# ఇతిహాస లహరి

## సుప్రసిద్ధ ఇతిహాస కావ్యాలు

దుర్భాక రాజశేఖర శతావధాని గారి ''రాణా ప్రతాపసింహ చరిత్రము''
గడియారం వేంకటశేషశాస్త్రి గారి ''శివభారతము''
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి ''ఆంధ్ర పురాణము''
వానమామలై వరదాచార్యులు గారి ''పోతన చరిత్రము''
విశ్వనాథ సత్యనారాయణ గారి ''ఝాన్సీరాణి''
ముదిగొండ వీరభద్రమూర్తి గారి ''వందేమాతరం''

## ప్రసిద్ధాంధ్ర సాహిత్యవేత్తలు

డా॥ ముదిగొండ శివప్రసాద్
డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు
డా॥ ప్రసాదరాయ కులపతి
ఆచార్య దివాకర్ల వేంకటావధాని
డా॥ అక్కిరాజు రమాపతిరావు
(మంజుశ్రీ) గారల

ఉపన్యాస వ్యాస మంజరి.



రిజిస్టర్ నెం. 1/64

ప్రచురణ

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# ITIHASA LAHARI

A Collection of Lecture-essays on six Telugu classics based on Indian History

Durbhaka Rajasekhara Satavadhani's Ranapratapasimha Charitramu
Gadiyaram Venkatasesha Sastri's Sivabharathamu
Madhunapantula Satyanarayana Sastri's Andhra Puranamu
Vanamamalai Varadacharyulu's Potana Charitramu
Viswanatha Satyanarayana's Jhansirani and
Mudigonda Veerabhadra Murthy's Vandemataram

By

Dr. Mudigonda Sivaprasad, Dr. Prasadaraya Kulapathi, Dr. G. V. Subrahmanyam, Prof. Diwakarla Venkatavadhani, Dr. Tummapudi Koteswara Rao and Dr. Akkiraju Ramapathi Rao (Manjusri).



ప్రచురణ సంఖ్య : 86

ప్రథమ ముద్రణ : డిసెంబరు 5, 1982

ప్రతులు : 2,200

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్రసారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రు. 12-00

ప్రచురణ పూర్వ విరాళం రూ. 8/- ఇచ్చిన సాహితీప్రియులకు అందజేయబడింది

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆర్థిక సహాయమున ముద్రించబడినది

# యువభారతి పరిచయం



మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థకం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పందొమ్మిదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలు రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 85 పుస్తకాలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ ప్రయత్నించింది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 7,800 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 775 మంది, భారతీభూషణులుగా 100 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ—

హైదరాబాదు,
డిసెంబరు 5, 1982

ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు: యువభారతి.




# ఇతిహాస లహరి

## ఉపన్యాస మంజరి - పుస్తక ప్రచురణ

కార్యక్రమ వివరాలు

స్థలం : ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

మొదటి సమావేశం

*3 అక్టోబరు, 1982-ఆదివారం సాయంకాలం గం. 5-30ని॥లకు*

అధ్యక్షులు : శ్రీ దేవులపల్లి రామానుజరావు
(ఉపాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.)

ముఖ్య అతిథులు : న్యాయమూర్తులు పి. కోదండరామయ్య
(ఆంధ్రప్రదేశ్ ఉన్నత న్యాయస్థానం)

'శివభారతము'ను గూర్చి ప్రసంగం : డా॥ ప్రసాదరాయ కులపతి

'రాణా ప్రతాపసింహ చరిత్రము'ను గూర్చి ప్రసంగం :
డా॥ ముదిగొండ శివప్రసాదు

## రెండవ సమావేశం

*6 నవంబరు 1982-శనివారం సాయంకాలం గం॥5-30 ని.లకు*

అధ్యక్షులు : డా॥ ముక్కామల రాధాకృష్ణశర్మ
(రీడర్, పురావస్తుశాస్త్రము, ఉస్మానియా విశ్వవిద్యాలయం.)

ముఖ్య అతిథులు : శ్రీ మాటూరి వెంకట సుబ్బారావు
(మాతృశ్రీ సంస్థల అధినేతలు)

ఆంధ్ర పురాణమును గూర్చి ప్రసంగం : డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

'పోతన చరిత్రము'ను గూర్చి ప్రసంగం :
ఆచార్య దివాకర్ల వేంకటావధాని

## మూడవ సమావేశము-ఇతిహాస లహరి ఆవిష్కరణ

*5 డిశంబరు, 1982-ఆదివారం సాయంకాలం గం॥5-30 ని.లకు*

అధ్యక్షులు : శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రి, ఎం.ఎ.,పి.హెచ్.డి.,
(డిప్యూటీ డైరెక్టర్, అంతర్జాతీయ తెలుగు సంస్థ.)

ముఖ్య అతిథులు : ఆచార్య సరోజినీ రేగాణి
(చరిత్ర విభాగం, ఉస్మానియా విశ్వవిద్యాలయం.)

ఇతిహాసలహరి తదితర పుస్తకావిష్కర్తలు : శ్రీ "కాళోజీ"

"ఝాన్సీరాణి" కావ్యమును గూర్చి ప్రసంగం :
డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు

"వందేమాతరం" కావ్యమును గూర్చి ప్రసంగం :
డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ)



# ప్రేరణ

''దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్.''

అన్న గురజాడ మాట ఈ నాటికీ మనకు అడుగుజాడ. భారతదేశ ఇతిహాసంలో స్వాభిమానం కోసం, స్వదేశ సంస్కృతి పరిరక్షణ కోసం జీవిత సర్వస్వాన్ని అంకితంచేసి మాతృదేశ ఋణం తీర్చుకున్న మహనీయులెందరో వున్నారు. వారు ఇతిహాస నిర్మాతలు, ఆదర్శ జీవులు, ప్రాతస్మరణీయులు. పురుషోత్తముడు, పృథ్వీరాజు, రాణా ప్రతాప సింహుడు, ఛత్రపతి శివాజీ, ఝాన్సీ లక్ష్మీబాయి, లోకమాన్య బాలగంగాధర తిలక్, మహాత్మా గాంధీ వంటి దేశభక్తులు భారత ప్రజలను ఉత్తేజ పరచిన మహనీయులు. ఆదర్శ పురుషుల జీవితేతివృత్తం ఇతిహాస మనిపించుకుంటుంది. ఇతిహాసం కావ్య ప్రాంగణంలోకి ప్రవేశించినప్పుడు శబ్ద సౌందర్యాన్ని. అర్థ గాంభీర్యాన్ని, వర్ణనా వైభవాన్ని పులుముకుంటుంది. జీవిత ఘట్టాలు రసాత్మకములై సహృదయులకు ఆనందాన్ని విజ్ఞానాన్ని సందేశాన్ని అందిస్తాయి.

కావ్య గౌరవాన్ని సంపాదించుకో గలిగిన కొన్ని ప్రసిద్ధ తెలుగు ఇతిహాసాలను దిజ్మాత్రంగా యువతరానికి పరిచయం చేయాలని ఉత్తమాధ్యయన పరులకు మంచి పుస్తకాలు సూచించాలని మా ఆకాంక్ష.

అయితే ఇతిహాస కావ్యాలనే తీసుకోవడ మెందుకు? అన్న ప్రశ్నను ప్రేరేచిన నేటి మన దేశ స్థితిగతులు కొంతవరకు పరోక్షంగా సమాధాన మిస్తాయి.

స్వాతంత్ర్యం వచ్చి 35 సంవత్సరాలు నిండినా ఈ నాటికీ దేశంలో జాతీయతాభావం నెలకొనక పోవటం, కుల, మత, ప్రాంతీయ ధోరణులు

ప్రబలడం నిజంగా శోచనీయమైన విషయం. భిన్నత్వంలో ఏకత్వాన్ని సంతరించుకున్న భారత దేశం, భిన్నత్వం నుండి ఏకత్వం వైపు పయనించడానికి బదులు, భిన్నత్వం నుండి ఛిన్నాభిన్నత్వం వైపు దారి తీస్తుండడం ఆందోళన కలిగిస్తున్న విషయం. ఇది జాతి చరిత్రను మరోసారి మననం చేసుకుని, జాతీయ జీవన సిద్ధాంతానికి జాతి పునరంకితం కావలసిన తరుణం. ఈ తరుణంలో స్వాతంత్ర్య సముపార్జనకు నడుంకట్టి, కష్టాలను సైతం లెక్క చేయక, విదేశీ పాలకుల నెదిరించి, జాతిని జాగరితం చేయడంలో కృషి చేసిన రాణా ప్రతాపసింహుడు, ఛత్రపతి శివాజీ, ఝాన్సీ లక్ష్మీబాయి వంటి ప్రముఖుల చరిత్రలను, 'వందే మాతరం' పిలుపు నందుకుని కదలిన భారత జాతి స్వాతంత్ర్య సమర చరిత్రను మననం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఇంతేగాక జాతీయతా విధానానికి భంగం రాని విధంగా, తెలుగు సంస్కృతికి జీవం పోసి, జాతీయ మహా ప్రవాహంలో కలిసి అంతర్వాహినిగా ప్రవహిస్తున్న ఆంధ్రదేశ చరిత్రనూ, దానిని పునీతం చేసిన "పోతన" వంటి వ్యక్తుల చరిత్రలనూ కూడా అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతయినా ఉంది.

వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని 'యువభారతి' తన 19వ వార్షికోత్సవాల సందర్భంగా ఈ శతాబ్దంలో వెలువడిన కొన్ని చారిత్రక కావ్యాలను ఎంపిక చేసి వాటిపై ఉపన్యాస కార్యక్రమాల నేర్పాటు చేసింది. ఆ కావ్యాలివి:-

| | | | |
|---|---|---|---|
| 1. | శివభారతము | 2. | రాణా ప్రతాపసింహ చరిత్రము |
| 3. | ఆంధ్ర పురాణము | 4. | పోతన చరిత్రము |
| 5. | ఝాన్సీరాణి | 6. | వందేమాతరం |

సాహిత్యానికి పాత కొత్తలు లేవనీ, అదొక సజీవ ప్రవాహమని మా విశ్వాసం. కేవలం పాతదే గొప్పదని గానీ, కేవలం కొత్తదే అభిమానించదగినదని గాని మా అభిమతం కాదు. మంచి ఎక్కడ, ఏ రూపంలో ఉన్నా స్వీకరించాలన్నదే మా నమ్మకం. సమాజాన్ని చైతన్యవంతం చేయటానికి సాహిత్యం ఒక చక్కని సాత్త్వికసాధనం. అయితే దీనికి సరియైన గుర్తింపు ఇంకా రాలేదేమో ననిపిస్తుంది. ఉత్తమ సాహిత్యాధ్యయనం ఉన్నత భావాలకు,

ఉన్నత భావాలు ఉత్తమ వ్యక్తిత్వానికి, ఉత్తమ వ్యక్తిత్వం సమున్నత సమాజానికి, సమున్నత సమాజం సర్వమానవ సౌభ్రాత్రానికి, విశ్వమానవ కల్యాణానికి నాంది. అందుకని తెలుగుదేశంలో ఉత్తమ సాహిత్యాధ్యయనాన్ని అలవరించేందుకు, ఉత్తమ సాహిత్యాన్ని వీలయినంత ఎక్కువ మందికి అందించేందుకు ఉడుతాభక్తిగా మేము చేస్తున్న కృషి ఇది.

ఈ ఉద్యమంలో అందరూ పాలుపంచుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. ప్రకటనలద్వారా ప్రచారం చేసుకునేటంత ఆర్థిక పరిస్థితి లేదు. మన ప్రచురణలు చదివి, మన కార్యక్రమాలు మెచ్చిన మిత్రుల మంచిమాటలే యువభారతికి ఎనలేని ఉత్సాహం. మీరంతా మన యువభారతి కుటుంబ సభ్యులే. ఏ ప్రాంతంలో వున్నా, ఏ దేశంలోవున్నా మీరంతా ఉత్సాహంగా పాల్గొనవలసిన ఆవశ్యకత వుంది. క్రొత్త మిత్రుల్ని మన కుటుంబ సభ్యులుగా చేయాలి. వీలైనంత ఎక్కువ మంది ఈ సాహితీ సాంస్కృతిక ఉద్యమంలో పాల్గొన్నప్పుడే మరింత తక్కువ ధరకు ప్రచురణలు అందచేయడానికి, మరికొన్ని నూతన కార్యక్రమాలు చేపట్టడానికి అవకాశం వుంటుంది. లోపాలు వుండని మనిషి ఉండనట్టే, లోపాలులేని సంస్థా వుండదు. మీరు నిర్మాణాత్మకమైన సూచనలిస్తే మరింత ఉపయోగకరంగా వుంటుందని మనవి చేసుకుంటున్నాను. డబ్బుకట్టి సభ్యులుగా చేరడంతో బాధ్యత తీరిపోదు, ప్రారంభమవుతుంది. కలిసి ముందుకు నడుద్దాం. పెరిగిన బాధ్యతని పంచుకుందాం. తెలుగుతల్లికి మరిన్ని మంచి మణిహారాలను కూరుద్దాం.

మీ సహకారాన్ని అర్థిస్తూ

భవదీయుడు

అయలసోమయాజుల నాగేశ్వరరావు

కార్యదర్శి, యువభారతి.



# ఎందరో మహానుభావులు

* ఇతిహాస లహరి కార్యక్రమాన్ని రూపు దిద్దడంలో సహకరించిన పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారలు.

* మా 19వ వార్షికోత్సవ సభలకు ముఖ్య అతిథులుగా విచ్చేసి, ఆశీర్వదించిన పెద్దలు, న్యాయమూర్తులు శ్రీ పి. కోదండ రామయ్య, శ్రీ మాటూరి వెంకట సుబ్బారావు, ఆచార్య సరోజినీ రేగాణి గారలు.

* ''త్యాగరాజస్వామి భక్తి కవితా వైభవం'' గ్రంథాన్ని ఆవిష్కరించిన పెద్దలు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు, ''అడుగు జాడలు'' గ్రంథాన్ని ఆవిష్కరించిన పెద్దలు శ్రీ గిరిధారీ లాల్ సంఘీగారు, ''ఉపనిషత్సుధ'', ''తమిళ సాహిత్యం – భారతి కవిత'' ''ఇతిహాస లహరి'', ''మరోజంఘాలశాస్త్రి-రెండవభాగం'', ''జానపదసాహిత్యం'' గ్రంథాల నావిష్కరించిన శ్రీ కాళోజీ నారాయణరావు గారు.

* 'ఇతిహాస లహరి' ఉపన్యాసమంజరీ కార్యక్రమాలలో ఉపన్యాసాల నివ్వడమే కాకుండా వ్యాసాలను కూడా సమర్పించి, ఈ గ్రంథానికి రూపు కల్పించిన సాహిత్యవేత్తలు డా॥ ప్రసాదరాయ కులపతి, డా॥ ముదిగొండ శివప్రసాద్, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు, డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) గారలు.

* ''త్యాగరాజస్వామి భక్తి కవితా వైభవం'' గ్రంథాన్ని అందించిన శ్రీ ఆకెళ్ళ అచ్యుతరామమ్, ''ఉపనిషత్సుధ'' గ్రంథాన్ని అందించిన డా॥ ఇలపావులూరి పాండురంగారావు, "జానపద సాహిత్యం'' గ్రంథాన్నందించిన డా॥ ఆర్వీయస్. సుందరం, "తమిళ సాహిత్యం - భారతి కవిత'' గ్రంథాన్నందించిన డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారలు.

* పిల్లలకై ''అడుగుజాడలు'' గ్రంథాన్ని ''అశోక్ కుమార్ సంఘి చారిటబుల్ ట్రస్ట్'' ఆర్థిక సహాయంతో వెలువరించడానికి పూనుకున్న వదాన్యులు శ్రీ జి. యల్. సంఘి గారు.

* మా నెలసరి ''సమాలోచనం'' సమావేశ కార్యక్రమాల్లో ప్రసంగించిన పెద్దలు శ్రీ మరింగంటి శ్రీ రంగాచార్యులు, శ్రీ ఆకెళ్ళ అచ్యుతరామమ్, డా॥ ఎ. శివారెడ్డి, శ్రీ గజ్జెల మల్లారెడ్డి, డా॥ నరసింగరావువర్మగారలు.

* మా 'యువభారతి' ప్రచురణలను ముచ్చటయిన ముఖచిత్రాలతో తీర్చి దిద్ది అక్షరాలంకరణను సంతరించిన చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజుగారు.

* ప్రచురణలకు ముఖ్య సాధనమైన తెల్లకాగితాన్ని అందించి సహకరించిన హిందుస్తాన్ పేపర్ కార్పొరేషన్ విక్రయాధికారులు శ్రీ ఎం. ఎ. లతీఫ్ ఖాన్, శ్రీ వి. ఆర్. కులకర్ణిగారలు మరియు రాజ్యలక్ష్మి పేపర్ మార్టు వారు.

* మా ప్రచురణలను ముద్రించిన ముద్రాపకులు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, అవేర్ ప్రింటింగ్ ప్రెస్, సుమన ప్రింటర్స్, ముఖచిత్ర ముద్రాపకులు రామా ప్రెస్, బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ వారు.

* బ్లాకుల తయారీ శిల్పులు మోహన్ ప్రోసెస్ వారు.

* ''ఇతిహాస లహరి'' ఉపన్యాస మంజరీ కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకోడానికి దయతో అనుమతించిన ఆంధ్ర సారస్వత పరిషత్తు పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు, కార్యాలయ నిర్వాహకులు శ్రీ హరికిషన్‌రావు గారు.

* మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని ఆర్థికంగా, హార్దికంగా ప్రోత్సహిస్తున్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ నిర్వాహకులు.

* ఆర్థికంగా మాకు తోడ్పడిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి సాంస్కృతిక వ్యవహారాల శాఖ వారు, ప్రత్యేకించి ఆ శాఖ డైరెక్టర్ డా॥ పి. యస్. ఆర్. అప్పారావు గారు.

* మా నెలసరి 'సమాలోచనం' కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకోడానికి దయతో అనుమతించిన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా

నిలయం నిర్వాహకులు, విశేషించి గ్రంథాలయ కార్యదర్శి శ్రీ ఎం.ఎల్. నరసింహారావు గారు.

* మా ప్రచురణల కొనుగోలులో ఇతోధికంగా ప్రోత్సహిస్తున్న రాజా రామ్ మోహన్‌రాయ్ గ్రంథాలయ ఫౌండేషన్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయ శాఖ డైరెక్టర్, జిల్లా గ్రంథాలయాధికారులు.

* మా యువభారతి కార్యక్రమాలు ఇతోధికంగా లోకానికి తెలియచెప్పి ప్రోత్సహించే పాత్రికేయులు, సాహిత్యశీలురు.

* మా సభలకు అవసరమైన ఫర్నీచరును సమకూర్చిన యూసఫ్ అండ్ కంపెనీ వారు, విద్యుద్దీపాలంకరణ కర్తలు – హనుమాన్ ఎలక్ట్రికల్స్ వారు.

* మా సాహిత్య కార్యక్రమాలకు వచ్చి 'యువభారతి' సాహిత్యోద్యమాన్ని సాదరంగా ప్రోత్సహిస్తున్న సాహిత్య స్నేహమూర్తులు, సహృదయులైన తెలుగువారు.

* 'యువభారతి' చైతన్యం యువభారతీయుల సమైక్య కృషి. సాహిత్యోద్యమంలో కష్టనిష్ఠూరాల కోర్చి శ్రమించిన యువభారతి సభ్యులు, అండదండల నందించిన 'సాహితీ మిత్రులు', 'భారతీ మిత్రులు', 'భారతీ భూషణులు,

* కార్యక్రమ నిర్వహణలో రేయింబవళ్ళు శ్రమించి, కార్యక్రమాలను దిగ్విజయం చేయడంలో సహకరించిన యువభారతి కార్యాలయ సిబ్బంది.

ఎదురుగా కనబడేది ఇందరు. కనుమరుగున ఉండి మమ్ములను దీవించేది ఎందరో ! అందరూ మహానుభావులే !

# అందరికీ మా వందనములు

అయలసోమయాజుల నాగేశ్వరరావు
కార్యదర్శి, యువభారతి

# ఆరు రుచులు

తనను తాను పునఃపరిశీలించుకోవటానికి జాతికి చరిత్ర పనికి వస్తుంది, తనను తాను పునరుద్ధరించుకోవటానికి జాతికి చారిత్రక కావ్యం తోడుపడుతుంది. ప్రతి భాషాసాహిత్యంలోనూ చరిత్రతోపాటు చారిత్రక కావ్యం ఉండక తప్పదు.

చరిత్ర వాస్తవ ప్రమాణమూలం; చారిత్రకకావ్యం కళాప్రమాణమూలం. చరిత్ర గత జీవితాన్ని చిత్రిస్తుంది; చారిత్రక కావ్యం గత జీవితాన్ని వ్యాఖ్యానిస్తుంది; చరిత్ర గతిని చెప్పినంతగా నీతిని చెప్పదు; చారిత్రకకావ్యం నీతిని చెప్పి జాతికి ప్రగతిని సూచిస్తుంది. అందువలన అర్ధశతాబ్ది కొకసారైనా సాహిత్యంలో ఉత్తమ చారిత్రక కావ్యం ఆవిర్భవించటం ఆరోగ్యకరమైన లక్షణం.

చరిత్ర రచయిత వేరు కావ్యకర్త వేరు. చరిత్ర రచన ఎంతటి కళాసౌందర్యాన్ని సంతరించుకొన్నా కావ్యం కాదు. కావ్యరచన ఎంతటి సత్యనిష్ఠను ప్రకటించినా చరిత్రకాదు. చారిత్రక కావ్యకర్తకు చరిత్రలోని ఒక ఘట్టాన్ని కళామయంగా వ్రాద్దామనే దృక్పథంకంటె ఆ వస్తువుద్వారా జాతికి ఒక వినూత్న సందేశాన్ని అందించాలన్న ఆకాంక్ష బలంగా ఉంటుంది. చరిత్ర ఘట్టాన్ని కావ్యవస్తువుగా మలచుకొంటాడు మొదట కవి. వస్తువు కవి దర్శనం నుండి ఉద్భవించే ప్రయోగభూమిక. దానికి కవి నేర్పిన స్వభావం ఒంటపడుతుంది; కవి అలవరిచిన అభినయం అలవడుతుంది. చరిత్రకంటె చారిత్రక కావ్యానికి అనుభవాన్నిచ్చే ఆలోచనశక్తి ఎక్కువ; జీవిత తత్త్వాన్ని వ్యాఖ్యానించే వివేచనాశక్తి ఎక్కువ.

సాహిత్య ప్రక్రియలన్నింటిలో లాగానే చారిత్రక కావ్యాలలోకూడా స్వభావాలను బట్టి భేదాలు కనపడతాయి. భారతీయ సాహిత్యాల్లో మొట్టమొదట వెలసిన చారిత్రక కావ్యాలు పురాణేతిహాసాలు. అందులో మానవజాతి వికాసాన్ని దర్శన దృష్టితో వ్యాఖ్యానించేది పురాణం. ఒక రాజవంశాన్నిగాని, ఒక వీరుని జీవిత గాథనుగాని, పురుషార్థసాధనామయమైన ధర్మదృష్టితో చిత్రించేది ఇతిహాసం. పురాణంలో సర్గాదులు దర్శనమూలాలు; ఇతిహాసంలోని కథార్థాలు పరంపరాగతమైన శ్రుతిమూలాలు. వస్తువుల స్వభావాన్నిబట్టి అవి భేదించినా వేదార్థ బృంహితత్వం వానియందు నియతలక్షణంగా నిలిచి ఉంటుంది. ఇతిహాస పరిధికంటె కావ్యపరిధి పరిమితం. ఒక పురుషార్థాన్నికానీ, ఒక ప్రయోజనాన్నికానీ సాధించటానికి ఆరంభమైన ఒక కార్యం విస్తరిల్లి ఫలవంతమయ్యేంత వరకు స్వయం సమగ్రంగా చిత్రింపబడే వస్తు జీవితం కావ్యం. ఇందులోని వస్తువు చారిత్రకమైతే అది చారిత్రక కావ్య మౌతుంది.

కావ్యంలో వస్తువు, నాయకుడు, రసం, అనే అంశాలు ప్రాధాన్యత వహిస్తాయి. చారిత్రక కావ్యంలో వాటితోపాటు దేశ, కాల, పాత్రములు ప్రత్యేక గౌరవాన్ని సంపాదిస్తాయి. వస్తువు దేశసంబంధి, నాయకుడు కాలసంబంధి; రసము పాత్రసంబంధి. చరిత్రలో ఒక సన్నివేశం ఒక ప్రాంతంలో కార్యకారణ సబద్ధంగా సంభవిస్తుంది. కాలానుగుణమైన ప్రయోజనాన్ని సాధించటానికి నాయకుడు- లేదా ఒక ఉద్యమ చైతన్యం- ఆ సన్నివేశాన్ని దిద్ది తీరుస్తుంది; ఫలాన్ని సాధిస్తుంది. ఆ పాత్ర సాగించే కార్యప్రవృత్తిలో భావరూపంగా జాలు వారే మానసిక చైతన్యం రసవృత్తి. చారిత్రక కావ్యం ఇలా ఒక చారిత్రక ఘట్టానికి రసజీవితాన్ని అలవరుస్తుంది. దానితో సీమలకు పరిమితమైన దేశం ఆవరణాలను ఛేదించుకొని అనుభవక్షేత్రంగా మారుతుంది. వ్యష్టిగా భాసించే నాయకుడు సమాజంలోని సమిష్టిచైతన్యంలోని సజీవశక్తిగా మారిపోతాడు; అతడు వ్యక్తంచేసే రసభావజగత్తు వ్యక్తిపరిధిని దాటి విశ్వజనీనంగా వ్యాపించి జాతిలోని వాసనాజగత్తును జాగృతం చేసి రసీకృతం చేస్తుంది. చరిత్రలో లేని కళానుభవం చారిత్రక కావ్యంలో ఉంటుంది. ఆ అనుభవం కోసమే అది పుడు తుంది; దానిలోనే అది జీవిస్తుంది.

చారిత్రక కావ్యరచనలోకూడా కవులు అనేకప్రయోగాలు చేశారు. వాటిని విమర్శకులు వివేచించారు. తెలుగులో వచ్చిన చారిత్రక కావ్యభేదాల్లో ముఖ్య మైనవి- చారిత్రక వస్తు కావ్యం; చారిత్రక రసకావ్యం, చారిత్రక తత్త్వకావ్యం- అని పేర్కొనవచ్చును. వీటిలో వస్తుకావ్యం చరిత్రలోని ఘట్టాలను వర్ణించే ప్రవృత్తికి ప్రాధాన్యం ఇస్తుంది. ఒక పరిణామసూత్రాన్ని కాని, సమన్వయ విధానాన్ని కాని, వ్యాఖ్యానవైఖరిని గాని ఆశ్రయించి కావ్యమునందలి సన్ని వేశాలు దారానికి గ్రుచ్చబడిన పూసల్లాగా అమర్చబడటం వస్తుకావ్య లక్షణం. ఆంధ్రపురాణం, వందేమాతరం లాంటివి ఈ వర్గానికి చెందే చారిత్రక కావ్యాలు. చారిత్రక రసకావ్యం ఏకనాయకమై రసప్రధానమై సాగుతుంది. ఇందులో వస్తువు చారిత్రకం; నాయకుడు చారిత్రక వ్యక్తి; అయినా ఆ రెండూ రస పోషణకు అడ్డురావు. ప్రఖ్యాతేతివృత్తంగల కావ్యంలోలాగా ఈ వర్గానికి చెందిన కావ్యాలు రాణాప్రతాపసింహ చరిత్ర, శివ భారతం మొదలైనవి. ఈ రెండింటి కంటె చారిత్రకతత్త్వకావ్యం విశిష్టమైనది. ఇందలి వస్తువు కథకోసం కానీ, రసంకోసంగానీ చెప్పబడదు- చారిత్రక సన్నివేశం వెనుక రచయిత దర్శించిన తాత్త్విక సిద్ధాంతం కావ్యార్థాలకు గమ్యమానంగా నిలుస్తుంది. ఈ ప్రక్రియలో

కవి కథనెలా చిత్రించా దన్నది ప్రధానం కాదు; కవి కథ నెలా ఒక తత్త్వానికి వ్యాఖ్యగా నిబంధించా దన్నదే ప్రధానం. ఇటువంటి కావ్యాలకు విశ్వనాథవారి ఝాన్సీరాణి, శివార్పణం లాంటివి చక్కని ఉదాహరణలు. చారిత్రక కావ్యాల్లో మహాకావ్యాలూ ఉండవచ్చు, ఖండకావ్యాలూ ఉండవచ్చు. అంతేకాదు, వ్యంగ్య కావ్యాలూ, అధిక్షేప కావ్యాలూ, వంశ కావ్యాలూ, ఉద్యమ చరిత్రలూ, మహా పురుష చరిత్రలూ— ఇలా ఎన్నోరకాలు ఉండవచ్చు. ఈ దృష్టితో చూస్తే పోతనచరిత్ర, శంకరచరిత్ర లాంటి కావ్యాలూ, త్వమేవాహం, తెలంగాణావంటి కావ్యాలూ, ఈ శాఖలోకి వచ్చే అవకాశం ఉంది.

తెలుగులో వెలసిన చారిత్రక కావ్యాల స్వరూపస్వభావాలను గురించి రచయితలు వ్యాసంగం చేస్తున్నారు. పరిశోధకులు సిద్ధాంతవ్యాసాలు వ్రాస్తున్నారు. అనేక విశేషాలు తెలుగువారికి తేటపడుతూ ఉన్నాయి. అయితే, ఈనాడు మన దేశ రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, విద్యారంగాలలో కలుగుతున్న పరిణామాలను పరిశీలిస్తున్నప్పుడు, క్రొత్తగా వస్తున్న విలువలను గూర్చి వివేచింపవలసి వస్తున్నప్పుడు, చరిత్ర చెప్పిన గుణపాఠాలను, చారిత్రక కావ్యాలు జాతిలో కలిగించిన ఉత్తేజాలనూ ఒకసారి మరల మనం మననం చేసికోవలసిన అవసరం ఉన్నదని యువతరం గుర్తిస్తున్నది. ప్రాచ్యమైనా, పాశ్చాత్యమైనా మన జీవన విధానంలో అది సంవిధానం పొందే సమన్వయం తెలియకపోతే దానిని అనుభవించటం, ఆచరించటందుర్లభం. ఆ సమన్వయాన్ని చారిత్రకకావ్యం కొంతవరకు ఇవ్వగలుగుతుందని యువభారతి విశ్వాసం. ఆ గాఢమైన విశ్వాసంతోనే 'ఇతిహాస లహరి' పేర చారిత్రక కావ్య పునస్సమీక్షను యువభారతి చేపట్టింది.

ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రబోధకవిత్వం దేశచరిత్రను కవితామయంగా చిత్రించి, ఉత్తేజకరంగా ఉల్లేఖించి, ఉపదేశాత్మకంగా అభివ్యక్తీకరించే పద్ధతిని తెలుగువాణికి నేర్పింది. ఆంధ్రేతిహాసంలోని చరిత్రవిశేషాలను మల్లంపల్లి వంటి మనీషులు వెలికితీసి కుప్పలు పోశారు. విశ్వనాథవంటి మహాకవులు ఖండకావ్యాలుగా చారిత్రక ఘట్టాలను చిత్రించి దేశాభిమానంతో పాటు, ఆత్మాభిమానాన్ని నేర్పారు. దుర్భాకవారు రాజస్థాన వీరగాథలలోనుండి రాణాప్రతాపుని చారిత్రక గాథను స్వాతంత్ర్యోద్యమ చైతన్య ప్రబోధదాయకంగా చిత్రించి తెలుగువారికి వినిపించారు. అదే వరుసలో ఎన్నో కావ్యాలను ఆ ఉద్యమానికి ఉపాయనంగా సమర్పించారు. రాణాప్రతాపుడు సాగించింది రాజకీయ యుద్ధమైనా ఆకృతిలో మనకు స్వరాజ్యోద్యమానికి ప్రతిబింబంగా భాసించింది.

తెలుగువారు సాగించే స్వాతంత్ర్య సంగ్రామానికి ఒక క్రొత్త ఆవేశాన్ని అందించింది. రాణా ప్రతాపునిలో మహాత్మా గాంధీ మనకు దోబుచులాడుతూ ప్రత్యక్ష మౌతాడు. అతనిలోని త్యాగం, దీక్ష, స్వార్థరాహిత్యం, సత్యనిరతి - నేటి చరిత్రలో కరువై పోతున్నాయి. దేశంలో ఉన్న కరువుల్లో ఇది ఒకటి. దేశమాతకై ఆత్మార్పణం చేసికొన్న ఆ మహనీయుని గాథ నేడు మనకు తారకమంత్రం కావాలని ఇతిహాస లహరి భావిస్తోంది.

'శివభారతం' చారిత్రక రస కావ్యాలలో తలమానికం. దుర్భాకవారు కవితతో జాతిలో ఆవేశం మోసులెత్తింప చేస్తే, గడియారంవారు కవితతో జాతిని ఆలోచింపచేశారు. శివాజీచరిత్రలో సంగ్రామగాథ ఎంత ఉన్నదో; ధర్మబోధ అంత ఉంది. జాతికి వీరమాతలు కావాలి, ధర్మవీరులు కావాలి, ధర్మం త్యాగశీలంతో తేజరిల్లాలి; భక్తిగా సాగి శక్తిగా రూపొందాలి; ఐహికంలో ఆముష్మికం ప్రజ్వరిల్లాలి. శివాజీ చరిత్రం తెలుగువారికి దేశభక్తిని, ధర్మశక్తిని ప్రబోధించింది. స్వాతంత్ర్యానికి పూర్వం రాణా ప్రతాపుడు, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత శివాజీ మనకు మార్గదర్శకులు. అందుకే శివభారతం మరలా నేడు చదవటం.

ఏజాతి చరిత్రనైనా కావ్యంగా వ్రాస్తే అది ఇతిహాస మౌతుంది. చరిత్ర రసవ్యాఖ్యతో రమణీయాకృతి తాలుస్తుంది. తెలుగురాజుల ప్రతాపచరిత్ర ఆంధ్ర పురాణం. వస్తుకావ్యాలలో విలక్షణమైనమార్గం దానిది. అలాగే దేశస్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర కవితాజీవితంలో జాలువారిన కృతి 'వందేమాతరం.' ఆంధ్రులకు ఆత్మచరిత్ర ఆంధ్ర పురాణం; భారతీయాంధ్రులకు మాతృగీతం 'వందేమాతరం.' స్వాతంత్ర్యం వచ్చిన మూడున్నర దశాబ్దాలకుకూడా మనం వీటిని ఇంకా చదువలసిన అవసరం ఎంతైనా ఉంది. రాష్ట్ర సమైక్యత, దేశ సమైక్యత చారిత్రక కావ్య పఠనంవల్ల జాతిలో ప్రబుద్ధమాన మౌతాయని యువ భారతి ఆశయం.

విశ్వనాథవారు చారిత్రకతత్త్వకావ్యప్రక్రియను తెలుగులో ప్రయోగించి చూపిన ప్రయోక్త. ఆయన కవితలో దర్శనశక్తి ఉంది. దాన్ని చరిత్రకు నేర్పా రాయన. వానమామలైవారు పోతనచరిత్రను మనోజ్ఞకావ్యంగా నిర్మించారు. ఆంధ్రుల ఆత్మస్థానీయుడైన పోతనకు అక్షరనీరాజన మందించే అనర్ఘ రచన పోతన చరిత్రం. ఎన్నుకొన్నవి ఆరు కావ్యాలే కావచ్చు- అంతకంటె మరి లేవని కాదు- ఒక అభిరుచిని యువతరంలో కలిగించటానికి ఆరు రుచులవంటి ఆరు కావ్యాలు చాలని యువభారతి ఆశయం !

—జి. వి. సుబ్రహ్మణ్యం.

# ఇతిహాస లహరి

## అనుక్రమణిక

# దుర్భాక రాజశేఖర శతావధాని గారి
# రాణాప్రతాప సింహ చరిత్రము
## — డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

సాహిత్యాన్ని విమర్శకులు వివిధ యుగాలుగా విభజించారు. తెలుగులో పురాణ యుగము, కావ్య యుగము, ప్రబంధ యుగము, యక్షగాన యుగము ఈ విధంగా ఏర్పడినట్టివే. ఒక యుగంలోని కవుల రచనలలోని సామూహిక మైన సమాన ధర్మాలను ఆధారంగా చేసికొని ఈ విధంగా యుగ విభజన చేయటం జరిగింది. అయితే ఇది సామాన్య సూత్రమే కాని అనుశాసనం మాత్రం కాదు. ఎందుకంటే, ప్రతి యుగంలోనూ ఆ యుగ లక్షణాలకు భిన్నమైన గ్రంథాలు అవతరించటం కద్దు. పదకొండవ శతాబ్దం పురాణ యుగం క్రిందికి వస్తుంది. కాని సరిగ్గా నన్నయకు సమకాలంలోనే ఒక గణిత శాస్త్రం పుట్టింది. పన్నెండవ శతాబ్దాన్ని శివకవి యుగంగా విభజించారు. అయితే ఆ యుగంలో శైవేతర సాహిత్యం కూడా లేకపోలేదు. జక్కన్న 'విక్రమార్క చరిత్ర', అనంతామాత్యుని 'భోజరాజీయం' వెల్వడిన కావ్య స్వతంత్ర కావ్య యుగములలోనే ఖడ్గశాస్త్రం, పశువైద్య శాస్త్రములు కూడా వెలువడ్డాయి. అలాగే ప్రబంధ, అనంతర ప్రబంధ యుగాలలో పద కవితలు వ్యాపించాయి. యక్షగాన యుగంలో ప్రౌఢ కావ్యాలు కూడా వెలువడ్డాయి.

ఈ దృష్టితో మనం సాహిత్య చరిత్రను పరిశీలించినట్లయితే 20 వ శతాబ్దం తెలుగు సాహిత్యం లఘు కావ్య యుగమనీ, ఖండ కావ్య యుగమనీ అనడం సామాన్య సూత్రమే అవుతుంది. ఈ యుగంలో ప్రాచీన మహా కావ్యాలకు ఏ విషయంలోనూ కూడా తీసిపోని గ్రంథాలు కొన్ని అవతరించాయి. అందులో శ్రీ రాజశేఖర శతావధాని రచించిన "శ్రీ రాణా ప్రతాపసింహ చరిత్ర" మొకటి. ధర్మవీర రస ప్రధానమైన యీ గ్రంథం, * ఈ శతాబ్దం

---

* "నీయంతటి పరమోత్తమ ధర్మవీర వరుడుండునె" భామాషాహీ మాటలు.

లోని ప్రథమ భాగంలో వెలువడింది. దివ్యమైన వృత్త రచనతో, భావ్యమైన ఇతివృత్త కథనంతో, సర్వ శిల్ప సంహితంగా రూపొందిన కృతి. ఏ గ్రంథం వెలుగులోనికి వచ్చినా అది కవి యొక్క ఆత్మీయతను ప్రతిబింబిస్తుంది. కవికి ఆ విధమైన ఆత్మీయత ఏర్పడడానికి పరిసరాలలోని ఎన్నో కారణాలు దోహదం చేస్తాయి. దేశ కాల పరిస్థితులు ఎన్నో కవిపై తమ ప్రభావాన్ని చూపుతాయి. కాబట్టి రాణా ప్రతాప చరిత్ర పరిశీలించాలంటే ఆనాటి తెలుగు దేశపు స్థితి గతులను మనం పరిశీలించవలసి ఉంటుంది. రాజశేఖర శతావధాని రచనకు ఉపక్రమించిన కాలంలో స్వాతంత్రోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. మహాత్మా గాంధీ అడుగుజాడలలో జాతి మొత్తము సత్యాగ్రహ సమరాగ్నిలోకి దూకుతున్నది. స్వాభిమానాన్ని ప్రజలలో రగుల్కొలిపి ప్రాచీన వైభవ ప్రతిష్ఠలను పునరుద్ధరింప చేసే రచనలుచేసి, కవులు గాయకులు, వైతాళికులైనారు. ఆంధ్ర పౌరుషాన్ని ఎలుగెత్తి చాటారు. ఆంధ్ర ప్రశస్తిని జనానీకానికి వినిపించారు. వేంగి క్షేత్రపు వెలుగులను, హంపీ క్షేత్రంలోని అవమానాలనూ ప్రజలకు గుర్తుచేసి పన్నీటినీ, కన్నీటినీ రెంటినీ వర్షింప చేశారు. సరిగ్గా ఆ కాలంలో ఇక్కడ ఆంధ్రోద్యమం కూడా సాగుతున్నది. అయితే యిది ప్రత్యేకమైన వేర్పాటు ఉద్యమం కాదు. అఖిల భారత స్థాయిలో మాళవీయ, తిలక్, గాంధీలు సాగిస్తున్న మహోద్యమానికి అనుబంధంగా సాగింది.[1] కవులు తెలుగు మాగాణాన్ని, ఇక్కడి నదీ నదములనూ స్థావర జంగమములనూ పురాణ పురుషులనూ, పవిత్రేతిహాసాలనూ, చారిత్రక స్థలాలను, వ్యక్తులనూ, సంస్మరించుకోవటం జరిగింది.[2] ఇదంతా కూడా జాతీయోద్యమం

---

1. "ఆంధ్రోద్యమము జాతీయ ధర్మము చేతనే ప్రేరితమగుచున్నదనుట నిశ్చయము." కృష్ణా పత్రిక సంపాదకీయం 1917.

2. శ్రీ రాణా ప్రతాపసింహ చరిత్రము, శివ భారతము, అమరసింహ చరిత్రము (నలుగురు కవులు ఈ కథ వ్రాశారు.) షాజీ, ఝాన్సీరాణి ఇత్యాది జాతీయవీరుల కథా, కావ్యాలూ, ఆంధ్ర పురాణము (ప్రథమ భాగము), ఆంధ్ర సామ్రాజ్యము, రామచంద్రుని హంపీ యాత్ర, ఓరుగల్లు కోట, ఆంధ్ర ప్రశస్తి, పెనుగొండ లక్ష్మి, హంపీ క్షేత్రము, దాశరాథము, ఆంధ్రావళి, ఆంధ్ర పౌరుషము, రాష్ట్ర గానము, ఉదయ గానము వంటి లఘు కావ్యాలూ, ఖండ కావ్యాలూ ఈ కాలంలోనే వెలువడ్డాయి.

లోని అంతర్భాగమే. పాయసంలోని పాలవలె జాతీయతతో కలిపి సాగించిన ఉద్యమమే! కాబట్టి, సమాజం సాహిత్యాన్ని, సాహిత్యం సమాజాన్ని ప్రభావితం చేస్తుందనేందుకు ఇది ప్రత్యక్ష నిదర్శనం.

కాని కొందరీ యుగాన్ని ప్రధానంగా కాల్పనికోద్యమకాలంగా వర్ణించారు. కాల్పనిక కవిత్వానికి ప్రకృతి ప్రీతి, గత వైభవ పునరుద్ధరణము, ప్రణయ తత్త్వము, ఆత్మాశ్రయత్వము, అద్భుతత్వము, సాహసప్రియత్వము అనేవి ప్రధానమైన గుణములుగా అభివర్ణించారు. అందు కుదాహరణగా పాశ్చాత్య సాహిత్య సంప్రదాయాలను చూపారు. వర్డ్స్‌వర్త్ మహాకవి సుదీర్ఘమైన ఒక గీతంలో ప్రాచీన గ్రీకు పురాణ గాథను స్వీకరించాడు. అలాగే షెల్లీ 'ప్రమీథియస్ అన్ బౌండ్' అనే మరొక గ్రీకు పురాణ గాథను స్వీకరించాడు. కీట్స్ వ్రాసిన 'ఎండిమియాన్ హైపీరియాన్' మొ॥ కావ్యాలు యిలాటివే. కాబట్టి రాణాప్రతాపు చరిత్ర రచన కాల్పనికోద్యమంలో ఒక భాగంగా అవతరించిందని విశ్లేషించటం జరిగింది.

ఇక్కడ మనం గమనించవలసిన ఒక ముఖ్యమైన విషయం ఉంది. ఇంగ్లండులో కాల్పనికోద్యమం విజృంభించినపుడు వారు స్వరాజ్యము కోసం ఎట్టి పోరాటమూ చేయటంలేదు. కాని మన శివభారతము, రాణాప్రతాపు చరిత్ర, ఝాన్సీరాణి, షాజీ వంటి కావ్యాలు వెలువడుతున్నది జాతి మొత్తం స్వాతంత్ర్య సమారాధనలో ఆత్మాహుతి చేసికొంటున్న తరుణంలో. ఇప్పటికి 400 సం॥ క్రితం మొగలుల కాలములో రాణాప్రతాపసింహుడు చేసింది అదే పని. రాణా ప్రతాపుడూ, శివాజీ ఇరువురు కూడా మొగలాయిలకు వ్యతిరేకంగా పోరాడారు. ఈ పోరాటంలో రాణా కర్తవ్యనిష్ఠకు ప్రాధాన్యాన్నిచ్చి జయాపజయాలను లెక్కింపచేయకుండా ఆదర్శం కోసం పోరాడాడు. శివాజీ అలాకాక అంతిమ విజయసాధనపై దృష్టి ఉంచి, దాని కనుగుణంగా తన కార్యాచరణ విధానాన్ని రూపొందించుకున్నాడు. అంటే శివాజీకి End ముఖ్యమైన అంశమైతే రాణాకు Means ముఖ్యమైంది. మహాత్మాగాంధీ స్వాతంత్ర్య సంగ్రామాన్ని కేవలం ఒక రాజకీయోద్యమంగా భావించలేదు. ఆయన ఒక యోగి. తన కర్మయోగ సాధనలో ఒక భాగంగా, ఊతగా స్వాతంత్ర్యోద్యమాన్ని స్వీకరించాడు. సరిగ్గా రాణాప్రతాపసింహుని జీవన నేపథ్యం కూడా యిదే! అందువల్ల గాంధేయమైన స్వాతంత్ర్యోద్యమ ప్రభావంతో వెలువడ్డ మహాకావ్యాలలో శ్రీ రాణాప్రతాపసింహ

చరిత్ర కూడా ఒకటిగా మనం భావించవచ్చు. "అకటా ముప్పది కోట్ల హిందువులు మోయన్‌దగ్గ భారంబు గొంకక నీవొక్కడవె త్రికో దలచితి''వని రాణా ప్రతాప్‌తో భీమచందు అన్న మాటలు మహాత్మా గాంధీకి ఆ సమయంలో వర్తిస్తాయి. "నీ పతాకంబు క్రిందికి రానొల్లనివారలందరును మాతృద్రోహులున్ వంచకుల్." ఈ మాటలు కూడా రాణాకేకాదు గాంధీజీకీ వర్తిస్తాయి. జస్టిస్‌పార్టీ వంటివి గాంధేయ ఉద్యమాన్ని ఆనాడు బలపరచలేదు. కేవలం ఇది మన ఊహయే కాదు. రాణాప్రతాపు చరిత్రకు పీఠిక వ్రాస్తూ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ విధంగా అన్నారు :

"ఈ గ్రంథము అస్వతంత్ర జాతి కొక స్మృతి గ్రంథము వంటిది. రాణాప్రతాపుని భద్రాకరణ ప్రతిజ్ఞ చూడుడు......ఈ ఘట్టము ద్వితీయాశ్వాసములో నున్నది. ఈ ఘట్టము చదివినచో పారతంత్ర్య జాతికి ఇది స్మృతి గ్రంథము అన్నమాట కర్థము తెలియును.

రాణా ప్రతాపునకు, మహాత్మునకు గల సామ్యము-భారత జాతికి గల యస్వతంత్రత. మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపు పోరు-ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపు పోరు. ప్రతాపసింహుడు అక్బరును జయింపవలెనని యుద్ధము చేయలేదు. పౌరుషశక్తితో గెలువలేనని ఆయనకు తెలియును. కాని వట్టి ధర్మము కోసము యుద్ధము చేసెను. భారత జాతీయ ధర్మము పరులకు లొంగిపోదు-చచ్చిపోదు-అని ఋజువు చేయుటకే యుద్ధము చేసెను.

'కాన విజయంబు ముఖ్యంబుగాదు మనకు !
ధర్మ నిర్వహణంబు కర్తవ్యమిపుడు.'

ఇది ప్రతాపుని యూహ. ఈ ఘట్టము చదువవలెను. నేటి సత్యాగ్రహమునకు ప్రతాపుని యుద్ధ ధర్మమునకు భేదమే లేదు.

ప్రతాపీయులు-అన్నము తినలేదు-నీరు త్రావలేదు-నిదురపోలేదు. ఇది బలవంతము చేతగాదు-వ్రతము చేత.

ఈ కథకు మనకు వేయి పోలికలు."

ఈ విధంగా మహాత్మాగాంధీ సంగ్రామ చరిత్ర స్ఫూర్తితో ఈ గ్రంథము వెలుగులోనికి వచ్చిందనటం సముచితంగా ఉంటుంది. ఇది 1934 సం॥ లో

మొదటిసారి వెల్వడింది. అపుడు 500 కాపీలు ముద్రించారు. వెంటనే ద్వితీయ ముద్రణం 1935 సం॥ లో ప్రొద్దుటూరు శ్రీ జానకి ముద్రాక్షర శాలలో జరిగింది. అపుడు 1000 కాపీలు వేశారు. ఇది స్వాతంత్ర్యోద్యమం గాంధీగారి నేతృత్వంలో తీవ్రంగా జరుగుతున్న కాలమని వేరే చెప్పనక్కఅలేదు. దీనికి కవి పెట్టినపేరు ఐతిహాసిక ప్రబంధమని. ప్రబంధల క్షణాలు మనకు తెలుసు. ఏ మార్కండేయ పురాణంలోని కథనో తీసికొని అనవసరమైన చోట తుంచి అవసరమైన చోట విపరీతంగా పెంచి, అష్టాదశ వర్ణనలతో, శృంగారాది రసములతో, అలంకారములతో రంగరించి కృతిని సింగారించటం మన మెరుగుదుము. కాని ఇందు సుదీర్ఘ అష్టాదశ వర్ణనలు లేవు. ఋతువర్ణనలు ఉన్న ఒకటి రెండు పద్యాలే ! అవీ కథా కథనంలో భాగాలుగా సూచ్యాలు ఉంటాయి. ఉదాహరణకు ఈ వసంతర్తు వర్ణన చూడండి. ''నునుపారు మెరుగు దీరిన గుజ్జు కామావి చిగురాకుబాకులు చికిలిచేసి, ననలాని వగరుటెల్గున గికారించు కోయిల హుమాయీల నాయితముచేసి నిలువెల్ల విచ్చి తావులు చిమ్ముదా సాని పూలతో నెల్లజెండాల నెత్తి యరవిచ్చు రేకు తామరతుపాకుల దేటిగమి యుక్కు గుండ్లనగాదుచేసి పరువపు వసంతుడను దొడ్డ తురకరేడుకల యవన పాళిపసదనమ్ముల గఅంచి లలిత రాజాత ప్రత్య మండలము చెరయదళముకొన్ని చిల్క పిండుతో దండువెడలె.'' (పంచమాశ్వాస ప్రారంభం). ఇది చారిత్రిక ప్రబంధమని కవిగారు చెబుతున్నారు. ఇకపోతే చరిత్రనుండే కథానాయకుణ్ణి తీసికొని ప్రబంధం వ్రాయాలని కవి ఎందుకనుకొన్నారో గ్రంథాదిలోని తమ విజ్ఞప్తిలో వివరించారు.

''పూజ్యులగు పూర్వ మహాకవులు పలుమారు వ్రాసిన పురాణాంశముల గుఱించి కాని, కల్పిత కథలను గొని కాని ప్రబంధములు రచించుట తొలుతటి నుండియు నాకు రుచించినది గాదు. అతిశయోక్తులకు బోక జరిగినది జరిగినట్టులు వ్రాసిపెట్టిన సత్యమగు దేశ చరిత్రములు ప్రజా ప్రబోధక ప్రబల సాధనములని నా విశ్వాసము.''

ఈ గ్రంథరచనకు కవిగారు లెఫ్టినెంట్ కర్నల్ జేమ్సు టాడ్డు దొర రచించిన ''ఆనల్స్ అండ్ అంటిక్విటీస్ ఆఫ్ రాజస్థాన్'' అను గ్రంథమును చదివి ముందుగా స్ఫూర్తిని పొందినట్లు చెప్పుకున్నారు. ఆ తరువాత వారు అనేక గ్రంథాలను కూడా పరిశీలించి చారిత్రిక నేపథ్యము రచించుకున్నట్లు తెలిపారు. ఈ సందర్భంలో మనం భారతదేశ చరిత్ర గురించి కొన్ని మాటలు చెప్పుకొన

వలసి యుంది. మనకు లభించిన చరిత్రలు 'ప్లూటార్క్' 'మెగస్తనీస్' 'టాలమీ' 'ఫాహియాన్', 'హ్యూయన్‌సాంగ్', 'మార్కోపోలో', 'అబ్దుల్ రజాక్' 'అబుల్ ఫజల్', 'ఫెరిస్త' వంటి విదేశీయులు వ్రాసినవే. ఆ తరువాత ఆంగ్లేయులు మన దేశ చరిత్రను రచించి మన విద్యార్థులు చేత అభ్యసింప చేశారు. ఆంగ్లేయులు చరిత్ర రచనలో ఒక స్పష్టమైన ప్రయోజనం ఉంది. వారీ దేశానికి పాలకులుగా, దురాక్రమణదారులుగా వచ్చారు. అంతకు ముందు మొగలులు, వారికి ముందు అరబ్బులు, ఇంకా ముందు యాక్మీరియాన్‌లు, శ్వేత హూణులు, గ్రీకులు, రోమన్లు ఈ దేశంపైకి దురాక్రమణ దారులుగా వచ్చారు. అందు వల్ల ఈ దేశం ఎపుడూ జయింపబడిన వారిదే కాని ఇందులో ఒక స్వతంత్రమైన సుసంఘటితమైన జాతి ఎప్పుడూ లేదని వారి సిద్ధాంతము. మరి ఆర్యుల మాటేమిటి? వారు కూడా విదేశాల నుండి భారత దేశానికి వచ్చి ఇక్కడి స్థానికులను జయించి తమ రాజ్యాధిపత్యాన్ని సుస్థిరం చేసికొన్నారని పాశ్చాత్య చరిత్రకారులు వ్రాశారు. ఈ విధంగా ఈ జాతిలో స్వీయాభిమానం లేకుండా ఇది ఎల్లపుడూ ఆక్రమణ దారులదేనని అభిప్రాయం కలిగేటట్లు వారు చేసిన ప్రయత్నం ఫలించింది. వాస్తవ చరిత్రలు ఇందుకు పూర్తిగా భిన్నమైనవి. ఆర్యావర్తం నుండి ఆర్యులు బయలుదేరి ఇరాన్, ఇరాక్, ఈజిప్ట్ వంటి ప్రాంతాలకు ఆర్య ధర్మ వ్యాప్తి కోసం వెళ్లితే ఆంగ్లేయులు సరిగ్గా దాన్ని తల క్రిందులుగా చేసి చిత్రించారు. పురుషోత్తముని చేతులో అలెగ్జాండరు చిత్తుగా ఓడిపోయి తిరుగుప్రయాణం కట్టి విషలిప్తమైన బాణాలను సింధూనదీ తీరస్థులైన వనచరులు వేయగా ఆ ప్రయోగంతో ఆరు నెలల తరువాత మార్గ మధ్యంలో బాబిలోన్‌లో మరణిస్తే చరిత్రకారులు దాన్ని సరిగ్గా తలక్రిందులు చేసి అల్జెండరు చేతిలో పురుషోత్తముడు చిత్తుగా ఓడిపోయాడనీ, అలెగ్జాండరు పురుషోత్తముని సాటి రాజుగా గౌరవించి దయాభిక్షపెట్టాడనీ వ్రాశారు. పురుషోత్తముడు తమ విజయ సూచకంగా ముద్రించిన విజయ ముద్రికలు నేడు మనకు లభించాయి. అందులో ఏనుగుపైనుండి పురుషోత్తముడు శూలం పట్టుకొని గ్రీకు వీరుడైన అలెగ్జాండరును గుఱ్ఱంపైనుండి పడద్రోస్తున్నట్లు ముద్రింపబడి ఉంది. పురుషోత్తమునికి అలెగ్జాండరుకు యుద్ధం జరిగిన రాత్రి పెద్ద వర్షం వచ్చింది. నది పొంగింది ఈ వాతావరణం ఏగుగులపై ఆధారపడ్డ పురుషోత్తమునికే కాని

పారశీక ఆశ్విక సైన్యంపై ఆధారపడ్డ అలెగ్జాండరుకు పూర్తిగా వ్యతిరేకమైనది.* అయినా గెలిచిన అలెగ్జాండరు దేశం వదిలి ఎందుకు వెనుదిరిగి పోయాడట? సైనికులు ఎదురు తిరిగితే భయపడేటంత సున్నిత హృదయమేమీకాదు ఆయనది. కాని ఆంగ్ల చరిత్రకారులు ''అలెగ్జాండరు ది గ్రేట్'' అని చరిత్రలో ఒక అధ్యాయాన్ని సృష్టించారు. వారి దృష్టిలో భారతదేశ చరిత్రలో ఉన్నవి మూడు యుగాలు - హిందూ మహా యుగము, మహ్మదీయ మహా యుగము, బ్రిటిష్ మహా యుగము. విజయనగర రాజులు బల్లులను తొండలనూ తినేవారని ఒక చరిత్రకారుడు వ్రాశాడు. షాజషాన్ తాజ్‌మహల్ కట్టి తమ ప్రేమను వెల్లడించుకొన్నాడని మరొక చరిత్రకారుడు అసత్యాన్ని సృష్టిస్తే ప్రపంచమంతా ఈ నాటికి అదే నిజమని నమ్ముతున్నది.**

రాణా ప్రతాపసింహ చరిత్రలో రాణా ప్రతాపుడు నాయకుడౌతే అక్బరు ప్రతినాయకుడు కావాలి. కాని కవిగారు ఇందులో ఇరువురిని మహానాయకులుగానే చిత్రించారు. ముఖ్యంగా అక్బరు పాత్ర మహోదాత్తంగా పోషింపబడింది. ఇందుకు కారణాలు ఏమయి ఉండవచ్చు? ఈ గ్రంథము రచింపబడి ఇప్పటికి దాదాపు 50 సం॥లు కావస్తున్నది. ఈ 50 ఏళ్ళలోనూ అక్బరును గూర్చిన యదార్థ చరిత్ర చాలావరకు వెలుగులోకి వచ్చింది. ఇది లభ్యం కాకపోవటం వలన ఆనాడు రాజశేఖర శతావధాని గారు అలా రచించి ఉండవచ్చు. లేక కొద్దిపాటి ఆధారాలు లభ్యమై ఉన్నప్పటికీ కూడా ధర్మరాజు దుర్మార్గుడైన దుర్యోధనుడ్ని కూడా సుయోధనా అని పిలిచినట్లు మన కవిగారు తమ ఉత్తమ శీలాన్ని ప్రకటించుకుంటూ అక్బరు పాత్రను మహోదాత్తంగా చిత్రించటం జరిగి ఉండవచ్చు. అక్బరు క్రీ శ. 1542 లో జన్మించాడు. బైరాంఖాన్ అక్బరుకు సంరక్షకుడుగా ఉండి సమయం వచ్చినపుడు తన ప్రాణాన్ని కూడా లెక్క చేయకుండా పోరాడి అక్బరు సింహాసనాన్ని కాపాడాడు. అట్టి నమ్మిన బంటు బైరాంఖాన్‌కు అక్బరు ఇచ్చిన ప్రతిఫలం ఏమిటి? దేశ బహిష్కారం! దారిలో ముబారక్ ఖాన్ లోహాని చేత బైరాంఖాన్‌ను హత్య చేయించి, బైరాం భార్యను

* చూ. వినాయక దామోదర సావర్కార్ రచించిన స్వర్ణ పత్రములు.

** తాజ్‌మహల్ షాజహాన్ కట్టలేదని, షాజహానుకు చాలా కాలంముందే అది రసపుత్రులచేత నిర్మింపబడిందనీ, దీనిపేరు తేజమహాలయమనీ సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ పి. ఎమ్. ఓక్ నిరూపించారు.

అక్బరు తన అంతఃపురంలో చేర్చుకొనటం చారిత్రక సత్యం కాదని ఎవరైనా అనగలరా ?

"పాక్షిక దృష్టి నిరతులగు అక్బరుకు ముందున్న తురుష్కులొనర్చిన కసాయి చేయిదమ్ములు వైదేశిక విద్వేష భావమును అంకురింపచేసిన కాని చిరకాల స్థాయి అగు విశాల సామ్రాజ్యమునకు పునాది వేయజాల వయ్యెను. ఈ నైతిక రహస్యమును కుశాగ్రబుద్ధి అగు అక్బరు చక్కగా గ్రహించెను. అక్బరు కాలమునకు అన్ని ఎడలను చతురుపాయములకంటె చతురోపాయములకే ఎక్కుడు ప్రసక్తి కలిగి ఆదర పాత్రములైనట్లు విమర్శకులకు గోచరించును" అని విజ్ఞాన సర్వస్వంలో (183 వ పుట) వ్రాశారంటే దీని కర్థమేమిటి ? అక్బరు కేవలం కుట్రతోనే భారతదేశాన్ని పాదాక్రాంతం చేసికున్నాడని స్పష్టం కావటం లేదా ?

1561 లో అక్బరు జయపుర రాజు పూర్ణమల్లు కుమార్తెను వివాహ మాడి కళ్యాణ వేదికతో మత సహనాన్ని సాధించాడని కొందరు చరిత్రకారులు వ్రాశారు. కాని ఇందలి నిజానిజాలేమిటి?

"అక్బరు వివాహాలన్నీ రాజకీయ తంత్రం కొరకే జరిగాయి" అని నిజాముద్దీన్ తబ్‌కత్-ఇ-అక్బరీ రచన ఈనాడు మన ముందున్నది. అక్బరు ఎందరో రసపుత్ర వనితలను తన అంతఃపురానికి చేర్చాడే కాని ఒక్క మొగల్ వనితను కూడా రసపుత్ర వీరునకు ఇచ్చి పెండ్లి చేసినట్లు కనపడదు. అంటే బుద్ధి పూర్వకంగా భారతదేశంలోని మహా పరాక్రమవంతులైన రసపుత్ర వీరుల రక్తాన్ని కలుషితం చేయడం ద్వారా ఈ జాతిని నిర్వీర్యం చేయవచ్చుననే రాజ కీయ వ్యూహం యిందులో యిమిడి ఉంది. అమీరు మహారాజు భగవాన్ దాసు సోదరి మరియం ఉజ్జమాని అనే నామాంతరం గల రసపుత్ర కన్యను అక్బరు వివాహమాడి ఆమెకు జహంగీర్‌ను కన్నాడు. జహంగీర్‌కు తిరిగి జుదాబాయి అనే రసపుత్ర కన్యనిచ్చి వివాహం చేశాడు. (వీరి కొరకు మరియం మహల్, జుదాబాయి మహల్ అనే భవనాలను (ఫతేపూర్ సిక్రీలో అక్బరు నిర్మించాడని చెబుతారు. కాని నూటికి నూరుపాళ్లు భారతీయ శిల్పకళ ప్రౌఢిమతో వెలసిల్లే ఈ భవనాలు అక్బరుకు ముందే ఉన్నాయి. ఫతేపూర్ సిక్రీలో 'నౌరోజు' ఉత్సవం వచ్చినపుడు (మన వసంత నవరాత్రముల వంటి ఉత్సవం) ఆడవాళ్లు మాత్రమే తిరిగే తోటలో తాను ఆడవేషం వేసికొని ఎందరో స్త్రీలను బురఖాతోనే కొగ

లించుకొనేవాడు. ఒకసారి రసపుత్రుడైన పృథ్వీరాయని భార్య శ్రీదేవిని కౌగలించుకొనబోగా ఆమె యితనిని గుర్తించి జుగుప్సపొంది పొడిచి వేయటానికి బొడ్లోని కత్తిని తీయగా పాటిపోయాడు. మొగలుల ఈ దురాగతాలను భరించ లేక ఎందరో రాజపుత్ర స్త్రీలు ఆత్మహత్య చేసికొన్నారు. గదా మండలాన్ని పరిపాలిస్తున్న రాణి దుర్గావతి వంటివారిని మోసంతో సంహరింపచేసి ఆ రాజ్యాన్ని ఆక్రమించాడు. రణతంభోర్, కలింజరు (1569), తర్వాత కాబూల్, గుజరాతులు అక్బర్ జయించాడు. తన సవతి అన్న మహ్మద్ ఆలీ తిరగబడితే అతనిని యుద్ధంలో ఓడించి తన శక్తిని ప్రదర్శించి తిరిగి వదిలిపెట్టినట్లు నటించి, తన ఔదార్యం ప్రదర్శించి పరోక్షంగా అతన్ని కడతేర్చి తన రాజ నీతిని ప్రదర్శించాడు.

స్వాభిమానం కోల్పోయిన నామమాత్ర రసపుత్రులు మాన్‌సింగ్, పూర్ణ మల్లు వంటివారు కొందరు అక్బరుకు లోబడ్డారే కాని భారతజాతీయ శక్తి ఆరనిజ్యోతి వలె రాణా ప్రతాపుని రూపంలో జ్వలిస్తూనే ఉంది. అక్బరు తన జీవితమంతా రాణాకు భయపడి సరిగ్గా నిద్రపోయి ఎరుగడు. అక్బరు ఇలా ఎందుకు చేశాడు? అంటే ఈ కావ్యానికి సమీక్ష వ్రాసిన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు ఇలా అంటారు: ''అక్బరు చక్రవర్తికి తన గొడుగు తప్ప ఇంకొక గొడుగు ఎక్కడా ఉండకూడదనే గౌరవాకాంక్ష. అవును. అతడు సార్వ భౌముడు కదా! పాపం, ఆ బిరుదం అర్థవంతం కావాలంటే యింకో శూరుడు తనకు మొక్కనివాడు వుండడం వల్లకాదు. ఈ దోషం మహానుభావుడైన అక్బరుది కాదు. అది అతడు ధరించిన సార్వభౌమ బిరుదాని దనుకోవాలి. ఆ యీ బిరుదే చాలా ఘోరాలు చేయించింది అక్బరుచేత. గ్రంథకర్త ప్రతాపుణ్ణి ఎంత చక్కగా కాపాడి తీర్చిదిద్దాడో అక్బరు చక్రవర్తిని కూడా అంత శ్రద్ధా భక్తులతో దిద్ది తీర్చి ధీరోదాత్త నాయకాగ్రేసరుణ్ణిగా ప్రకటించాడు. వాల్మీక్యా దులు రావణాదులను యింత చక్కగా చిత్రించనే లేదన్నా తప్పులేదను కుంటాను.'' ఇలా చేయడంలో కవిగారి మహోదారత వ్యక్తమవుతున్నది. నిజా నికి మన భారతీయ పరంపరయే ఇంత. శివాజీ తన జీవితంలో ఒక్క మసీదును కూడా నేల మట్టం చేసి ఎరుగడట. యుద్ధంలో ఖురాన్ ప్రతులు ఎప్పుడైనా దొరికితే వాటిని తన సైన్యంలోని మహ్మదీయులకు భక్తితో యిచ్చేవాడట. ఆ పరంపరకు చెందిన పుణ్య రక్తమే రాజశేఖర శతావధానిలో కూడా ప్రవహిస్తున్నది.

శ్రీ రాణా ప్రతాపసింహ చరిత్ర మొత్తం అయిదు ఆశ్వాసములు గల ఇతిహాసిక ప్రబంధము. దీని కర్త దుర్భాక రాజశేఖర శతావధాని. వీరు క్రీ.శ. 1888 లో జన్మించి 1957 వరకూ జీవించారు. వీరి జన్మస్థానము కడప జిల్లా జమ్మలమడుగు. వీరి అసలుపేరు కాళహస్త్యయ్య. అధికార నామము రాజ శేఖర శతావధాని. వీరిది 'శాలంకాయన' గోత్రము, ములికినాటి శాఖ. వీరి తండ్రి దుర్భాక వేంకట రామయ్యగారు. తల్లి సుబ్బమ్మ. వీరి విద్యాభ్యాసము కందాళ దాసాచార్యులు, జనమంచి శేషాద్రి శర్మగార్ల వద్ద జరిగింది. గాంధే యోద్యమ ప్రభావంతో తమ వృత్తిని చాలించి దేశసేవ చేశారు. కొంతకాలము పాటు గడియారం వేంకట శాస్త్రిగారితో కలిసి జంట కవిత్వం చెప్పారు. అవి అవధాన సారము అనే పేర వెలువడ్డాయి. 'వీరగాథా విధాత', 'వీర ప్రబంధ పరమేశ్వర' అనే బిరుదములు వీరికి సార్థకములైనాయి. అమర సింహ చరిత్ర, వీరమతీ చరిత్ర, చందన్రృపాల చరిత్ర మొ॥ వీరగాథలు వీరు రచించారు. ది హీరోయిన్స్ ఆఫ్ హిందూస్థాన్ అనే గ్రంథాన్ని ఆంగ్లంలో రచించారు. రాణి సంయుక్త కథ హరికథగానూ, తారాబాయి కథ నవలగానూ, టాడ్ చరిత్ర కావ్యంగానూ వెలువరించారు. రాజసింహ మొ॥ కొన్ని అముద్రితాలు కూడా ఉన్నాయి. ముఖ్యంగా వీరికి 'కవి సార్వభౌమ', 'కవి సింహ', 'కావ్య కళానిధి' మొ॥ బిరుదులు సార్థకమేనని చెప్పడానికి ఉదాహరణగా రాణా ప్రతాపసింహుని చరిత్ర నుదహరింపవచ్చు. ఈ కవి వ్రాసిన గ్రంథాలలోనేకాదు, ఆంధ్రభాష లోనే అనేక చారిత్రక కావ్యాలలో రాణా ప్రతాపసింహ చరిత్ర తలమానికమని చెప్పవచ్చు. దీన్ని ప్రశంసిస్తూ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు "ఈ రాణా ప్రతాప చరిత్ర రామాయణంలాగా వ్యాపింప దగ్గది. ఈ ప్రతాపుడు రాముని కంటె ఏ సుగుణంలోనూ తీసిపోడు. ఈ రాజశేఖర కవి కవిత్వము రామాయణ గాథ తెలుగులో రచించిన కవుల కవిత్వానికిన్నీ తీసిపోదు" అంటారు. కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు వీరిని ప్రశంసిస్తూ, "భారతము దేశ భక్తిని పెంపొందించునని రష్యన్ దేశస్థులు తమ భాషలోనికి అనువర్తించు కొనుచున్నా రట. భారతమున కాశక్తి యున్నచో రాణా ప్రతాపసింహ చరిత్రకునూ ఆ శక్తి కలదు. రాణా ప్రతాపుడు పేరునకు రాజ పుత్రుడు, ఆంధ్రుడు కాడు. ధర్మ రాజు ఆంధ్రుడా? కృష్ణుడు ఆంధ్రుడా? రాముడాంధ్రుడా? శంకరుడు ఆంధ్రుడా? వారందరూ భారతీయులు! అందుచేత ఆసేతు సీతనగము భారి

కథలు పాడిరి. అట్లే ప్రతాపుడునూ. భారతము పూర్వకాలము కథనే చెప్పును. అందులోనున్న ధర్మము మాత్రమే మన జాతిది. ఆ విషయము ద్వాపరయుగము నాటిది. మన పరిస్థితులతో సంబంధము లేనిది. ప్రతాప సింహ చరిత్ర మన ధర్మమునేకాక మన పరిస్థితులను కూడా చెప్పును. అక్బరు చక్రవర్తితో పోతి కేండ్లు హోరాహోరి పోరి, స్వదేశము వదలి కొండలలో గుట్టలలో నివసించి, తిండిలేక గడ్డి రొట్టెలు తిని, దైవ వశమున మరల స్వాతంత్ర్యము సంపాదించిన మహా పురుషుడు రాణా ప్రతాపుడు. ఆయనకన్న ధర్మరాజాదులు ఏమియూ ఎక్కువవారు కారు. వస్తు రమ్యతకు గాని, కథా చమత్కారమునకు గాని ఇందలి భిన్న పాత్రల భిన్నతా విశిష్టతకుగాని భారతమునకీ గ్రంథము తీసిపోదు" అని హృదయ పూర్వకంగా ముక్త కంఠముతో ప్రశంసించారు.* "తరుగని దేశ భక్తియును ద్యాగము, సత్యము, ధర్మ నిష్ఠయును గరుడుగ గట్ట వ్రాసితి జగన్నుత కావ్యము" అని జనమంచి శేషాద్రి శర్మగారు కవిని అభినందించారు.

"I must have already told you that I am an admirer of your book. If I have not done so, it is an un conscious and unintended omission. You are one of those few poets who have been able to treat an episode taken from real History and present it to the World as excellent literatuie of which the Telugu language has every reason to be proud. Your Rana Pratap Singh Charithra is one of the most memorable of modern productions. I congratulate you on your closeness to facts and a style that never flags." అని కట్టమంచి రామలింగారెడ్డిగారు కవిని సంస్తుతించారు. "ఇది మధురమైన భావాలతో ఆకర్షణీయమైన శైలితో విరాజిల్లుతున్న గ్రంథ"మని చిలకమర్తి వారు అంటే, "మీ కథా కథన విధానం ఇప్పటికి అద్వితీయమైనదని చెప్పిన అతిశయోక్తి కాదని" చిలుకూరి నారాయణ కవిగారు చెప్పారు. "తమది ప్రబంధ పక్వతతో కూడిన పురాణ శయ్య" అని రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారంటే, "వీర రాణా ప్రతాప రాడ్విగ్రహము తెనుగు కోవెల ప్రాణ ప్రతిష్ఠ చేసి నిలిపి

---

* భారతి, నవంబరు 1943 వ్యాసము.

తివి చేరి మనసార గొలుచు నాంధ్ర వీర సంతతి వాంఛలీడేరు గాక!'' అని కవితా కళానిధి శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవి సన్నుతించారు. ''అధునికులగు తెలుగు కవులకు దేశభక్తి - దేశాభిమానములు శూన్యములు. వారి గ్రంథములలో ప్రబోధకములగు రచనలు తక్కువ.* చరిత్రాత్మకములు కడుంగడు దక్కువ. చరిత్రాత్మకములై దేశభక్తి నుద్ధరింపచేయు పద్య కావ్యములు లేనే లేవు. వేల సంఖ్యను మించిన తెలుగు కవులలో దేశమును దలుచుకొను వారరుదు. భావ కవులకీ గొడవ పట్టనే లేదు. ఈ సుకవి కవిత్వము రసవంతమైనది. శైలి మధురమైనది. ధార గంగా ప్రవాహవేగము గలది. పదముల పొందికయు భావ గౌరవమును మిక్కిలి మెచ్చ దగినది. జాతీయములును లోకోక్తులును తమంత వచ్చి మూగి పడినట్లున్నవి. ప్రతి ఘట్టమునను ప్రతి పద్యమునను గవికి కల దేశభక్తియు, శూర శిఖామణియగు ప్రతాప సింహ మహారాజ సింహుని యందీ కవి సింహునకు గల భక్తి - గౌరవములు తొలుకాడుచున్నవి. ఎచ్చట జదివి నను జదువరుల హృదయములు కరిగి నీరుకాక మానవు. ఎంత దేశద్రోహులైనను దేశభక్తులుగ మాఱక మానరు. ఇట్టి విశేషములు వివరముగ దెలుపబూనిన నిది యొక గ్రంథమంత యగును''. అని శ్రీ మంగిపూడి వెంకట శర్మగారు యదార్థాన్ని శలవిచ్చారు. ఈ విధంగా ఆనాటి సుప్రసిద్ధ కవి పండితులైన గడియారం వెంకటశేషశాస్త్రిగారు, మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారు, విమర్శకాగ్రేసర నాగపూడి కుప్పుస్వామయ్యగారు, శ్రీ కాశీ కృష్ణాచార్యులు గారు, గుఱ్ఱం జాషువగారు ఇందలి వస్తు గౌరవాన్ని కవితా మాధుర్యాన్ని వేనోళ్ల కీర్తించారు. ఆనాటి ప్రముఖ పత్రికలైన 'కృష్ణా పత్రిక', 'గోలకొండ పత్రిక' 'ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక' 'అభినవ సరస్వతి' 'త్రిలింగ', 'కౌమోదకి' 'వైజయంతి', 'భారతి' ఇత్యాది సాహిత్య సాంస్కృతిక పత్రికలు శ్రీ రాణా ప్రతాప సింహ చరిత్రాన్ని అద్వితీయమైన గ్రంథంగా అభివర్ణించాయి. ఇందరిన్ని విధాల ఈ కృతిని పొగటానికి కారణం ఏమిటి ? దీనిని రచయిత 1932 లో

---

* ''రష్యాలో ఈనాడు విద్యార్థికి పాఠ్యాంశాల ద్వారా హైయర్ ఎలిమెంటరీ దశలోనే భౌతిక దృక్పథం, సోవియట్ ''జాతీయ'' దృక్పథం అలవడేటట్లు చేయబడుతుంది'' అని రష్యా పర్యటన జరిపివచ్చినడా. చలసాని సుబ్బారావుగారు తెలుగు విద్యార్థి సెప్టెంబరు 1982 సంచికలో వ్రాశారు. దీనిపై వ్యాఖ్యానం ఇంకా ఎందుకు ?

మొదలు పెట్టి 1934 లో ముగించారు. అది స్వాతంత్ర్య సంగ్రామోద్యమ సమయం. కాబట్టి వాతావరణమంతా దేశభక్తి పూరితమై మహోద్రేకంగా ఉంది. కాబట్టి వారికి కృతి ఆంగ్లేయులపై తమ పోరాటానికి ఇంధనంగా ఉపయోగపడిందీ అంటే అందులో కొంత సత్యం లేకపోలేదు. కాని అది పాక్షికమే. రసప్రౌఢి వల్ల ఇతివృత్త గౌరవం వల్ల ఇది దేశ కాల పరిస్థితులకు అతీతమైన రచనగా సార్వకాలీనతను సంతరించుకున్నది.

ఇందలి ప్రథమాశ్వాసము భారతదేశంపై మహ్మదీయుల దాడితో ప్రారంభమైంది. గజని, గోరిల దండయాత్రలు మొగలుల దండయాత్రలు బాబర్, హుమాయూన్, అక్బరుల కథలు ఇందు వర్ణింపబడ్డాయి. రసపుత్ర మహావీరుడైన ఉదయసింహుడు ఉదయపురమును కట్టి అందు నివసిస్తూ ఉంటాడు. ఉదయసింహుడు తన తర్వాత జగమల్లుని రాజుగా చేయగోర్తాడు. కాని ప్రధానమంత్రి సర్వసైన్యాధ్యక్షుడు సలుంబ్రాధీశ్వరుడు అయిన కృష్ణ సింహుడు ఉదయుని నలుగురు కొడుకులలోనూ ప్రతాపసింహుడే యోగ్యుడని నిశ్చయించి పట్టాభిషేకము చేస్తాడు. దీనికి ప్రతాపసింహుని సోదరులైన సూక్త, సాగర, జగమల్లులకు కోపం వస్తుంది. ద్వితీయాశ్వాసంలో ప్రతాప సింహుడు వేటకు వెళ్ళటంతో కథ ప్రారంభమవుతుంది. దారిలో ఒక అడవి పంది అడ్డం వస్తుంది. దానిని సూక్తుడు ప్రతాపసింహుడు, బాణాలతో కొడతారు. దానిని నేను చంపానంటే నేను చంపానని అంటారు. సూక్తుడు ప్రభువైన తన అన్నగారితో వివాదాన్ని పెంచుకొంటాడు. అది కూడదని చెప్పిన సలుంబ్రా కృష్ణసింహుణ్ణి కూడా సూక్తుడు లెక్కచేయలేదు. అపుడు వారివెంట రాజపురోహితుడైన హరభట్టు కూడా ఉన్నాడు. ఈ పురోహితుడు శాస్త్రంలోనేకాక శస్త్రంలో కూడా వీరుడే. హరభట్టు సూక్తునికి నీతిని ఉపదేశిస్తాడు. కాని సూక్తుడు దురహంకారంతో రాజపురోహితుణ్ణి తిరస్కరించి ఇలా అవమానిస్తాడు:

''తనదౌ శక్తికిమీఱు కార్యములకున్
దారొక్కన్నచో ముప్పు వ
చ్చును! మా యిర్వురలోన నొక్కడు రణ
క్షోణిన్ మృతిగన్న మీ
రును రావచ్చును! నేడ్వవచ్చును! మఱి పౌ
రోహిత్యమున్ చేయవ

చ్చును! లబ్ధిన్ గొనవచ్చు! నిష్పు చనవ
చ్చున్ దాటి దూరంబుగన్."

ఈ మాటలు విని హరభట్టు దుఃఖంతో కత్తితో పొడుచుకొని ఆత్మార్పణం చేసుకుంటాడు. ఈ విధంగా గురు రుధిరంతో అప్పటి కలహం ఆగిపోతుంది. సూక్తుడు ఢిల్లీ దోవ పడ్తాడు. రాజపుత్రులలో దేశభక్తులు, ధర్మనిష్ఠాపరులు అంతా రాణా ప్రతాపసింహుని గొడుగు నీడకు చేరుతారు. సలుంబ్రా కృష్ణ సింహుడు, భానుసింహుడు, మనస్సింహుడు, శ్యామసింహుడూ, తేజసింహుడూ, రామచంద్రదేవుడూ, భిల్లనాయకుడైన భీమచంద్రుడూ వీరంతా రాణా ప్రతాప సింహునికి బాసటగా నిలుస్తారు. కాని మాన్‌సింగ్ వంటి కొందరు భోగలాలసులు, కుల నాశకులు, దేశద్రోహులు అక్బరు కొలువులో చేరి సుఖభోగాలననుభవిస్తూ ఉంటారు. (మానసింహుడు కాశీ విశ్వేశ్వరుని పూజచేసి గంగోదకం నెత్తిన చల్లుకొని ఆ తర్వాత తన రాజభక్తి (అక్బరుపై భక్తి) ప్రదర్శించుకోవడం కోసం సనాతన ధర్మ ప్రతినిధిగా నిలచిన రాణా ప్రతాపుని పైకి యుద్ధానికి వెళ్ళేవాడట–ఎంతటి ధర్మవికృతి.)

ఆ తరువాత తృతీయ, చతుర్థ, పంచమాశ్వాసాలు దాదాపు సంపూర్ణంగా అక్బరుకూ, రాణా ప్రతాపునకూ జరిగిన యుద్ధమునకు సంబంధించిన కథయే. ఈ యుద్ధ వర్ణనలలో కవి దాదాపుగా భారతంలోని తిక్కనగారి యుద్ధ పర్వములకు ఏమాత్రం తీసిపోకుండా రచన సాగించారు. దేశీయమైన పలుకుబళ్ళతో కవిత్వం అంతా అచ్చంగా తిక్కన రచనవలెనే కనపడుతుంది. రాజశేఖర శతావధాని మహాకవి తనకు ముందున్న పురాణ ప్రబంధ కవుల రచనా విధానాలను, శయ్యలనూ పూర్తిగా జీర్ణించుకున్నవాడు.

''పరిపుల్ల రుచిర సరసిజ పరంపరలు నెరసినట్లు స
భా భవనం బ
ప్పుర జనముల నెమ్మొముల బరమామోదమున నపుడు
భాసిల్లుచుండెన్.''

ఇది అచ్చంగా నన్నయగారి శైలిలా ఉంది. యుద్ధ ఘట్టాలలో అచ్చంగా తిక్కనను కవి గుర్తుకు తెస్తున్నాడు. అంతేకాదు, ఆయా సందర్భాలలోని నాటకీయ శైలి కూడా తిక్కనగారి వలెనె ఉంటుంది. భిల్ల నాయకుడు రాణా

ప్రతాపుడు వ్రాసిన ఉత్తరాన్ని తీసికొని వచ్చాడు. అది చూచి పృథ్వీసింహుడు, అతని భార్యయు ఇలా అన్నారు-

"చెప్పుము చిత్తమిచ్చి యిదె
శ్రీ కృపలోక జగద్గురుండు మా
యప్ప ప్రతాప దేవుని ము
ఖాంబురుహంబున జంద్రబింబమం
దొప్పెడి వెన్నెల ట్లలరు
నుత్తమ మౌదరహాస రేఖ తా
నెప్పటి యట్ల పాయకర
హించుచు నున్నదే భిల్లశేఖరా!"

ఈ పద్యం అచ్చంగా పోతనగారి భాగవత రచనవలె ఉన్నదని విశ్వనాథ సత్యనారాయణగారు అభిప్రాయపడ్డారు. ఇందలి అప్పా శబ్దం రాయలసీమలో గౌరవ సూచకంగా వాడే పదం. కన్నడ భాష ప్రభావంతో ప్రవేశించినట్టిది. తిక్కనగారి నెల్లూరు మాండలికాలు, పాల్కురికి వాడిన పన్నెండవ శతాబ్దపు తెలంగాణా మాండలికాలు ఇలాగే ఎంతో సహజంగా ఉంటాయి. కవిగారి ఉదాహరణలు కూడా ఎంతో సహజంగా జీవితంలో నుండి తీసికొన్నట్లుగా ఉంటాయి. లౌకికమైన సుఖభోగాల కోసం భగవాన్ దాస్ అనే రసపుత్రుడు అక్బర్‌కు లొంగి పోయాడు. తన కుమార్తెను అక్బరు కిచ్చి వివాహం చేశాడు. తన కొడుకైన మానసింహుణ్ణి అక్బర్‌కు సేనాధిపతిని చేసాడు. అంతటితో ఊరుకోకుండా రాణా ప్రతాపుణ్ణి కూడా అక్బరుకు లోబడవలసిందిగా సలహా యిస్తాడు. అది విని రాణా ప్రతాపుని మంత్రి భీష్మ పితామహుని వంటివాడు అయిన సలుంబ్రా కృష్ణసింహుడు ఇలా అంటాడు-

"యవనుల పదంబు గొలిచి, వియ్యంబు వలచి,
కుశ మహారాజు కులకీర్తి గుంట కలిపి,
చెఱుప వచ్చితె మమ్ము! దాజెడ్డ కోతి
వనము నంతయు జెరిచెనన్ భంగిదోప!"

"ఉరగమును- వృశ్చికమ్మును గరళ క్రూరములు! పాముకన్నను మేలందురు తేలు! నిన్ను గన నక్బరు మేలనవచ్చు స్వకులవర్ధనుడౌటన్!"

ఇది ఎంతో అర్థవంతమైన పద్యము. తేలుకు పాముకు ఒక భేదము ఉంది. పాము తన గ్రుడ్లను తానే తింటుంది. తేలు అలా గాక తన ఆత్మ త్యాగంతో పిల్లలను ప్రసవిస్తుంది. స్వకుల వర్ధనుడు కావటం వల్ల అక్బర్ తేలు లాటి వాడు. భగవాన్‌దాస్ పాము లాంటి వాడు.

గత రెండు వేల సం॥ల భారతదేశ చరిత్రలోని రహస్యమంతా ఈ పద్యములో ఇమిడి ఉంది. భారతీయు లెప్పుడూ తమ పరాక్రమ వైభవాలు లోపించటం వల్ల పరాజయం చెందలేదు. తోటి భారతీయులు దేశ ద్రోహం చేయటం వల్లనే ఆయా ఘట్టాలలో ఓడిపోయారు. మహ్మద్‌ఘోరి విజయానికి ఘోరి పరాక్రమం కారణం కాదు. జయచంద్రుడు చేసిన విద్రోహం కారణం. అక్బరు విజయాలకు మానసింగ్, సాగరుడు, సుక్తుడు, తోడరుమల్లు, వీర బలుడు మొదలైన దేశాభిమానం లేని భారతీయ శునకాలు కారణం. (శునకం స్వామి భక్తిగలది. అలాంటి వారిని కుక్కతో పోల్చి కుక్కను అవమానించడం కూడా తగదేమో అనిపిస్తుంది). 1857 విప్లవంలో తాంతియా తోపే పరాజయానికి కారణం సాటి మహారాష్ట్రుడు ఒకడు ఆయనను బ్రిటిష్ వారికి పట్టివ్వడమే స్వాతంత్ర్య సంగ్రామంలో కూడా చంద్రశేఖర ఆజాద్, అల్లూరి సీతారామరాజు వంటి వారు నిప్పులు చెరుగుతూ పోరాడుతూ ఉంటే కొందరు దేశద్రోహులు స్వయంగా వారి రహస్య స్థావరాలను శత్రువులకు తెలియపర్చారు. కాబట్టి తేలిన సారాంశం ఏమంటే, మన జాతియొక్క పతనానికి మూల కారణం ఏమంటే- మన జాతిలోని పరాక్రమ రాహిత్యం కాదు. కేవలం మన దేశంలోని కొందరు భగవాన్‌దాస్ వంటి పిరికిపందల నిర్వీర్య ప్రవృత్తియే కారణం. ఈ కావ్యం మనకి స్పష్టంగా చాటిచెప్పే సూక్తి-

"అప్రతిహతముగా అక్బరొకడ్డే యేల
క్షితిని దేవుడు సృష్టి సేయలేదు!
వితత ప్రజాకోటి యతనిచే దునుమాడ
బడుటకై సృష్టింప బడగలేదు!
సకల భూపాల కన్యక లాతనుని భోగ
పరతకుద్దేశింప బడగలేదు !
ధరణీశులెల్ల నాతని జేరికొలిచి పా
దము లొత్తగ బుట్టువొందంగలేదు!

తన యొకని రాజ్య తృష్ణకై ధరణి గలుగు
ప్రజయు స్వాతంత్ర్యమును బాసి పారతంత్ర్య
మున మునుగుచెల్ల బాడిగాదనుచు నక్బ
రెంత యెఱిగిన జగమున కంత మేలు!''

ఇవి రాణా ప్రతాపుని మాటలు. ఇంతటి పరాక్రమ శీలుడు కాబట్టే ఇతడు మహా నాయకుడై జాతిని ఉత్తేజ పరచగల్గాడు. అది ఎలాంటి ఉత్తేజమో సూచించేందుకు ఈ గ్రంథంలో చతుర్థాశ్వాసంలో ఒక అద్భుతమైన కథా ఘట్టముంది. రాణా ప్రతాప సింహుడు దశాబ్దాల కొలది పోరాడుతూనే ఉన్నాడు. క్రమంగా సైన్యం తరిగిపోతూ ఉంది. దినదినమూ ఆత్మీయులైన మహావీరులను రణరక్కసికి బలి చేయవలసి వస్తున్నది. తనకు బహిః ప్రాణమైన చైతకాశ్వము చనిపోయింది. అర్ధాంగి పాటీశ్వరి భర్తతో అరణ్యాలలో పడరాని యిడుములు పడుతున్నది. రాణా ప్రతాపుడు సంచరిస్తున్నాడని తెలిసిన ప్రదేశాలలోని బావుల్లోనూ, ఇతర జల వసతులలోనూ అక్బరు సైనికులు విషం కలిపి వెళ్లారు. ప్రతాపునికీ, అతని భార్యా బిడ్డలకు తిన తిండి లేదు. నిలువ నీడ లేదు. కేవలం సూర్య వంశ ప్రతిష్ఠ కోసం పోరాడుతున్నాడు. ఒకనాడు పాటీశ్వరి గడ్డితో రొట్టె చేసి బిడ్డ చేతికిచ్చింది. ఇంతలో ఒక అడవి పిల్లి వచ్చింది. ఆ శిశువును రక్తం కారేట్లు గోళ్లతో పీకి ఆ రొట్టెను తీసికొని పోయింది. రాణా ప్రతాపుడు ఈ దృశ్యం చూశాడు. అతని గుండె చెరువైంది. తన స్వాతంత్ర్య కాంక్షకూ, ధర్మ రక్షణకూ ఇదా ఫలం అని ఒక్కక్షణం అనుకున్నాడు. అప్పుడొక భిల్లనాయకుణ్ణి పిలిచి అక్బరుకు ఒక ఉత్తరం వ్రాసి యిచ్చి పంపాడు. అందులో తన పోరాటంలో ఆరు నెలలు విశ్రాంతి కావాలని కోరాడు. అది చూచి ఢిల్లీ దర్బారులోని వారంతా ఆశ్చర్య చకితులైనారు. ఇది సంధి ఉత్తరమేనన్నారు. రాణా ప్రతాపుడు పూర్తిగా లొంగిపోవడానికి యిక ఎక్కువ కాలం పట్టదన్నారు. కాని, పృథ్వీరాజు అనే రసపుత్రుడు ప్రభూ, ఇది రాణాప్రతాపుడు స్వయంగా వ్రాసిన ఉత్తరం కాదు. ఇదేదో మోసంతో కూడిన రాజనీతి అన్నాడు. అలా అనడానికి కారణం ఆ ఉత్తరాన్ని తాను అనుమానించటం కాదు. రాణా ప్రతాపుడు తాను ఒక బలహీన క్షణంలో ఆ జాబు వ్రాశాడని పృథ్వీసింగునికి తెలుసు. కాని అది అబద్ధపు లేఖ అని ఢిల్లీ దర్బారు వారు నమ్మాలని అతని ఆశయం. రాణా ప్రతాపుడు

కూడా లొంగిపోతే యిక స్వాతంత్ర్య సమర దీక్ష ఏమి ఉంటుంది ? సూర్యుడే తూర్పున అస్తమిస్తే యిక ప్రకృతిలో మిగిలేదేమిటి ? అందుకే ఆ ఉత్తరాన్ని నిజంగానే అబద్ధం చేయాలని పృధ్వీసింగుడు రాణా ప్రతాపుని కొక సందేశం పంపాడు. ఓ రవివంశ పారావార సుధాకరా ! మేము గతిలేక బుద్ధిహీనులమై అక్బరుకు లొంగిపోయాము. అయినా మా హృదయాలలో రాజపుత్రుల పరాక్రమాన్ని భారతదేశ ప్రతిష్ఠలనూ నిలిపే వీరుడు ఉదయ భానుడు అరణ్యాలలో ఇంకా వెలుగుతూనే ఉన్నాడనే విశ్వాసం ఇంకా మిగిలిఉంది. నీ మీద మొత్తం భారతదేశము ఆశలు పెట్టుకొని ఉంది. మాకున్న మానసికమైన ఈ ఆనందాన్ని విశ్వాసాన్ని నీవిప్పుడు వమ్ము జేస్తే ఇక ఈ జాతి నిలువదు.

"ఇపుడు నసి చెడ్డ సకల ధాత్రీశ హృదయ వాటి
స్వాతంత్ర్య బీజముల్ నాటెద వని
యనఘ మాకుండె బ్రహ్మాండమండయాస ! కట్ట !
యొనరింతె నట్టేటి పుట్టిమునుక !
బరువుపడ కిన్నియేండ్లు కాపాడినాడ వనఘ !
స్వాతంత్ర్య కనక గర్భాలయమున
బ్రజ్వరిల్లు నఖండ దీపమ్ము నిపుడు కొండ యెక్కింతువే !
కను గూర్చి దేవ !
నీ యశోగానమున జిక్కి నిఖిల జగము చొక్కె నానంద
మందిరి సురలు గూడ !
సత్ప్రయత్నంబు ! క్షణము విశ్రాంతి వలదు ! తంద్రి ! మ్రోయింపు
విడక స్వాతంత్ర్యభేరి !"

ఈ లేఖను చూచి రాణా ప్రతాపసింహుడు సంతోషపడినాడు. ఆయన కన్నుల నుండి ఆనంద బాష్పాలు స్రవించాయి. "నేను ఢిల్లీ దర్బారుకు లేఖ పంపినప్పటి నుండి పరమ పవిత్రమైన సూర్య వంశానికి తీరని ద్రోహం తలపెట్టానని చింతిస్తూ ఉన్నాను. శత్రువుల దర్బారు నుంచి వచ్చిన ఈ లేఖ నా సమస్త మనస్తాపాన్ని తొలగించింది. ఢిల్లీ దర్బారులో ఇంతటి పుణ్యమూర్తులు నా యెడ అభిమానం గలవారు ఉన్నారని నా కిప్పుడే తెలిసింది" అంటాడు.

''రవి యస్తాద్రిని మొల్చుగా ! కఖిల పారావారముల్ క్రుంగుగా !
కవనీ చక్రము వ్రీలుగాక! చెడుగాకాకాశ! మయ్యుగ్ర భై
రవుడై లోకము గాల్చుగాని లవమున్ రాణా పుత్రుండు గౌ
రవమున్ గోల్పడి మర్త్యమాత్రునకు శీర్షంబొగ్గ డెప్పట్టునన్!''

ఈ మాటలు సలుంబ్రా కృష్ణ సింహునివి. రాణా ప్రతాపునిపై వారికి కలిగిన విశ్వాసమట్టిది. రాణా ప్రతాపుడు శ్రీరాముని వలె ఆదర్శ పాలకుడు. ఆదర్శ జీవనుడు. చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారి మాటలలో చెప్పవలసి వస్తే ''రాణా ప్రతాపుణ్ణి, రాముణ్ణి త్రాసులో పెట్టి తూస్తే ప్రతాపుడే అసిధారా వ్రతంలో చాలా మొగ్గుతాడు. లవకుశులు రాముణ్ణి ఎత్తి పొడిచారు. ప్రతాపుణ్ణే అయితే ఎత్తి పొడవలేరు అని తోస్తుంది'' (చెళ్లపిళ్లవారి సమీక్ష వ్యాసం మూడవ పుట). ఇలా హృదయంగమమైన ఘట్టాలు ఈ గ్రంథంలో నుంచి ఎన్నైన తీసి చూపవచ్చు. అలా ఉదాహరింపవలసి వస్తే మొత్తం గ్రంథం గ్రంథమే ఉటంకించ వలసి వస్తుంది. ఇంకొక ఘట్టం చెప్పి విరమిస్తాను. రాణా ప్రతాప సింహుడు యుద్ధంలో విజయాన్ని పొందలేక పోతున్నాడు. దేశ త్యాగానికి సిద్ధపడ్డాడు. మాతృ దేశానికి తుది నమస్కారమర్పించి "ఇరువదేండ్లుగా ఉత్తమ పరికరములతో భక్తితో నా పావన స్వాంతమందు కట్టుకొనిన స్వాతంత్ర్య వజ్రభవన రాజము కన్నీటి వరదలో మునిగింది. తల్లీ, నేను దుర దృష్టవంతుణ్ణి. నేను గాక మరొక్క ధీరుడెవడైనా నిన్ను సేవింప బూనినచో అతని పుణ్యఫలం వల్ల నిత్యోత్సవ, నిత్య మంగళ జయశ్రీ నిత్య సౌభాగ్య రేఖా నిత్య ప్రభ నీకు లభింపగలదేమో'' అని కన్నీటితో ప్రతాపుడు పయన మైనాడు. అలా పోతూ ఉంటే ఎదురుగా బ్రహ్మ తేజస్సుతో ఒక శాంతమూర్తి అయిన బ్రాహ్మణుడు సాక్షాత్కరించాడు. ''అయ్యా, ఇక్కడ రాణా ప్రతాపుడు నివసించే కొండ కోనలు ఎక్కడ ?'' అని ఆ బ్రాహ్మణుడు ప్రశ్నించాడు. ''తామెవరు?'' అని రాణా ఎదురు ప్రశ్న వేయగా, ''నాపేరు భామాషాహి. నేను పర్షియా నుంచి వస్తున్నాను'' అంటాడు. భామాషాహి పూర్వీకులు ఈ సూర్య వంశ రాజులకు మంత్రులు. రామునికి వసిష్ఠునివలె ఉండి కర్తవ్య నిష్ఠను బోధించేవారు. రాణా ప్రతాపుడు భామాషాహి పాదాలపై పడ్డాడు. ''నేనే ఆ రాణా ప్రతాపుణ్ణి. మీ సేవకుణ్ణి'' అన్నాడు. అప్పుడు భామాషాహి సంతో షాన్ని ఏమని వర్ణించాలి! ''నా విశ్వోన్నత దివ్య కల్ప తరువున్ నా వజ్ర

కోటీరమున్ నా విస్తార మనోంబుజాత తరణిన్ నా కీర్తి నిక్షేపమున్ నా వేలుపున్ మణి నాదు రాజధనమున్ నా స్వామి దర్శించి నా సేవన్ కూర్పగ వచ్చినాడన్'' అని ఖామా షాహి అన్నాడు.

''పరిశుభ్రతర సుధా సాగర వీచికలట్లు నీదు ఘనకీర్తి కళల్
మెఱసె దెసల; నీయంతటి పరమోత్తమ ధర్మవీరవరుడుండెనే !
స్తిమితమై తుదల విచ్చి యుదార గంభీర కాంతులీను వెడంద
కనులతోడ ;
బరువంపు బుగ్గలపైన రెక్కొను మీసల వెలుంగు మోము వాలకముతోడ;
వీర మహాలక్ష్మి విహరించు దుర్గమై విరిసిన బలితంపుటురము తోడ ;
దల యెత్తు వాడి కుంతము గేల నూది ధీరత యుట్టిపడ నిల్చు
రావణ తోడ ;
నెదలదురాయి, వీర తేజో దురీక్ష వదనమున గుంకుమపు
బొట్టు వజ్ర వర్మ
యొదల వెలుగొందు నలరు నీ పొదవు గంటి ; నెంత కళ గల
తండ్రి వోయి ! ప్రతాప ! ''

అని ప్రశంసించి ఆశీర్వదించాడు. ఖామాషాహి తన వెంట అసంఖ్యాకమైన ధనరాశులను తెచ్చాడు. వాటిని సనాతన ధర్మ సంరక్షణ కోసం పాటుపడుతున్న రాణా ప్రతాపునికి సమర్పించాడు. అంతేగాక, మహాభారత యుద్ధంలో అర్జునునికి శ్రీకృష్ణుడు చేసినట్లు తత్త్వోపదేశము చేశాడు.

''చనదు కృషి నిరసింపగా సాధకునకు; నదియ యన్నిట నరుని
యోగ్యతను బెంచు ;
గృషిని రోయు వానికి జోటు క్షితిని లేదు; వసుధ కెల్ల
శుభం బట్టివాని పోక.
అలజడిని మున్గినపుడె సత్యము జయించు ; నపజయంబుల
నది పెంచు నాత్మశక్తి.
యనుపమత్యాగమున సత్య మాప్తమిత్రులంద్రు స్వాతంత్ర్య తత్త్వజ్ఞు
లైన బుధులు.''

అని కర్తవ్య ప్రబోధము చేశాడు.

'పూవులు రాలె; నాకులును బోయెను; ముండ్లను ప్రోదునిల్పె; నీ
పీవిధి గేతకిన్ విడువ కేటికి జుట్టె, దనన్ 'వసంత ల
క్ష్మీ విభవంబు సోకిన జిగిర్చి తరుల్ కుసుమించునన్నయా
శావిసరంబుచే నిలుతు' నంచు వచించు గుమార భృంగమున్.''

అని కవితామయంగా ప్రపంచించాడు. ప్రతాపుడు ఆ ధనంతో తిరిగి యుద్ధ సన్నద్ధుడైనాడు. శత్రువులను జయించి పట్టాభిషిక్తుడైనాడు. ఇది వ్యక్తిగతంగా రాణా ప్రతాపునకే పట్టాభిషేకం కాదు; భారతీయ ధర్మానికి పట్టాభిషేకం! సుమారు 2000 పద్యాలు గల ఈ మహాకావ్యం ఈ విధంగా మంగళాశాసనంతో ముగుస్తుంది.

శ్రీ రాజశేఖర శతావధాని కథలు పాత్రలతో తాదాత్మ్యంచెంది ఈ గ్రంథాన్ని రచించారు. "నేనెల్లప్పుడు భావనాబలమునన్ నీ రూప నామ క్రియా ధ్యానంబున్ గొని తన్మయత్వమున అన్యాకాంక్ష లేకుంటి నీవే నేనయితినో నేనె నీవైతో రూపింపంగ నాకేల నిత్యానందంబు ఘటించె నీ కృతి ప్రతాప! విశ్వాలో కార్చితా!'' అని కృతికర్త కావ్య నాయకునితో తన తాదాత్మ్యాన్ని వెల్లడించుకున్నారు.

మరొక్కమాట- "ప్రతిఫలము గోరబోక నీ గ్రంథమునను దేశమంతట నింపంగ తివురుచుంటినని'' కవిగారు చెప్పుకున్నారు. నేడుకూడా పరిస్థితి అలాగే ఉంది. వ్యర్థమైన ఎన్నో పుస్తకాలు పుంఖానుపుంఖంగా వస్తున్నాయి. కాని శ్రీ రాణా ప్రతాపసింహ చరిత్రంపై వ్యాసం వ్రాయాలని ప్రయత్నిస్తే ఎంతో కష్టంమీదకాని నాకు ఒక ప్రతి ఒక వారం దినాలు దగ్గరపెట్టుకునే అవకాశం దొరకలేదు. దేశ పరిస్థితి ధార్మిక స్థితి ఆనాడు ప్రతాపుని సమకాలంలో ఎలా ఉందో ఈనాడు ఒకవిధంగా అలాగే ఉంది. మనకు స్వరాజ్యం వచ్చిందిగాని సురాజ్యం, ధర్మరాజ్యం ఇంకా రాలేదు. బయటి శత్రువులు, లోపలి శత్రువులు పొంచియున్న ఈ తరుణంలో జాతిని ఉత్తేజితం చేయటానికి శ్రీ రాణా ప్రతాప సింహ చరిత్ర వంటి కావ్యాలను ఇంటింటికీ వ్యక్తి వ్యక్తికీ అందించవలసిన బాధ్యత లేదా? శివ భారతం నవ భారతమైతే శ్రీ రాణా ప్రతాపసింహ చరిత్ర నవ రామాయణం! ఈ కొత్త భారతాన్ని రామాయణాన్ని ఆదరించటం తెలుగు వారికి తక్షణ కర్తవ్యం.



# గడియారం వెంకట శేషశాస్త్రిగారి
# శివభారతము
## – డా॥ ప్రసాదరాయ కులపతి

ఒక జాతి గమనములో ఒక మహా కావ్య ముదయించుట ఎన్నడును యాదృచ్ఛిక సంఘటన కానేరదు. సృష్టిలోని ప్రతి ఘట్టము వెనుక కార్య కారణ సంబంధబంధితమైన గాథ ఏదో ఉండును. ప్రతి అవతారము యొక్క చరిత్ర పరిశీలించిన ఈ విషయము స్పష్టమగును. కవిత విషయముననూ ఇదే సిద్ధాంతము. వందల వేల ప్రజా హృదయములను ప్రేరేపించ గలిగిన ఒక మహా కావ్య ప్రాదుర్భావము, చరిత్ర గతిలో అవసరమును బట్టియే వచ్చును.

ఆంగ్లేయుల పరిపాలనలో దాస్య శృంఖలా బద్ధమైన భారత జాతికి ఉత్సాహమును, ఉద్రేకమును, ప్రేరణను కలిగించు రచనల అవసరమెంతైన ఉన్న సమయమది. ఆ పరిస్థితికి తగినట్లుగా శివభారత మహోదయమైనది. నాడు శివాజి ఏ విధముగ మహమ్మదీయుల నెదరించి ఘోర వీర సంగ్రామము లొనరించి విజయము సాధించెనో అటులే భారతీయులును ఆంగ్లేయుల నెదిరించు ధైర్య, స్థైర్య, సాహసముల నలవరచుకొనవలెనని కవి ఉద్దేశ్యమై ఉండును. దానికై వ్యంగ్య మర్యాదా సుందరముగా శివాజీ చరిత్రమును పద్య ప్రబంధముగా రచయిత తీర్చి యుండును.

శివభారత ప్రబంధకర్త శ్రీ గడియారము వెంకట శేషశాస్త్రి కడప జిల్లాలోని ప్రొద్దుటూరు వాస్తవ్యుడు. చిన్నతనము నుండి నాటి తిరుపతి వేంకట కవుల యుగమునకు సహజమైన అవధానాశు కవితలతో విహరించివాడు. ఆయన మిత్రుడగు రాజశేఖర శతావధాని వీరిని-

గీ॥ 'శత శతవధాన హర్షితాస్థాన దత్త
కనక జయఘంటికా సింహ కంకణ రవ
ముఖరితా శాంత సద్యశః పూర్తి సుకవి
సింహ బిరుదుండు వేంకట శేషశాస్త్రి'

అని ప్రశంసించినారు. అటువంటి శేషశాస్త్రిగారు అవధాన కవుల మార్గములోనే తమను గురించి చెప్పుకొనిన పద్ధతి గమనింపుడు.

సీ॥ 'ఊరు కుముద్వతీ తీరాగ్రగహారస
మ్మాన్యత గన్న నెమళ్ళ దిన్నె,
వేద శాస్త్రార్థవిద్విబుధ మందారమ
హాంబుధి గడియార మన్వయంబు,
తల్లిదండ్రు లనిశ సీతారామ పాదసే
వాధన్య పుణ్య దంపతులు-వార
లన్నలు మువ్వు-రభిన్నభావులు వేద
విధి విత్తములు కళావిధులు ఘనులు

తే॥ భవ్య మైత్రేయముని గోత్ర భవుడ, వారి
చిన్ని తమ్ముడ వేంకట శేషశాస్త్రి
నేను శివభారతము రచించి సకల
రసిక జన హస్తముల సమర్పణము సేతు॥

గడియారము వారు గొప్ప ఆత్మ విశ్వాసముగల కవి. అది లేనిది కవితా సృష్టి కాదు. కాకున్న కొందరు బయటకు చెప్పుదురు, కొందరు చెప్పరు. అంతే తేడా. చూడుడు.

చం॥ ''పరహితమాత్మ నిర్వృతి అపారయశోధన గౌరవాది వి
స్ఫురణములందజేసి యిహమున్ పరమున్ వెలయించి మానవున్
ధర చరితార్థుజేయు కవితాకళ నా వశమౌట పంచమ
స్వరమున నాలపించెద వసంత వనాంతర సాల శాఖలన్.''

కవితా మార్గములో వీరికి తిక్కన ఆదర్శము. ధర్మాద్వైతస్థితి - జీవితములో కవితలో సాధించిన ఆ మహనీయుని ప్రభావము వీరి కవితపై నెంతేని కన్పించును.

చం॥ ''హరిహరనాథ శాంత మధురాకృతి లోపలి చూపునన్ పురా
చరిత తపఃఫలం బుభయసత్కృవిమిశ్రతత వెల్గ ధ్యానత
త్పరుడయి భారతాగమము వల్కెడు తిక్కన వాక్కువెంట త
త్కరమున తాండవించు వరదాయిని లేఖిని నే భజించెదన్.''

కావ్యేతి వృత్తమును గూర్చి భట్టుమూర్తి పలికినది నాడేగాక నేడును చాల మందిని ప్రభావితులను జేసినది.

ఉ॥ ''కేవల కల్పనాకథలు కృత్రిమ రత్నములాద్య సత్కథల్
వా విరిపుట్టు రత్నముల వారితసత్కవికల్పనా విభూ
షావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతి రత్నముల్
కావున నట్టి మిశ్రకథగా రచియింపుము నేర్పు పెంపునన్.

ఈ భావమునే శేషశాస్త్రిగారీ విధముగా పలికినారు-

ఉ॥ ''ఇంతయు తేర్చికొన్న ఇతివృత్తము తేరదు పూర్వగాథ సా
యంతన పద్మమై పలితమైనది కల్పితగాథ బూటకం
బంతరసారమై విలువ కందనిదైనది-ఖండగీత భా
వాంతర లక్ష్యమై జగమునంటదు దాసితనాయకోన్నతిన్.''

అంతరసారమై అను పదములో ద్వ్యర్థి సౌందర్యము ప్రశంసనీయము. ఆ పదము అటునిటు రెండు వైపుల వన్వయించుచు కవి పద ప్రయోగ నైపుణ్యమునకు సాక్షీభూతమై నిలుచుచున్నది.

ధీరోదాత్తుడు, జగదుపస్కృతికాశ్రయుడైన నాయకుడు దొరకిన మంచి కృతి నిర్మింతమను పూనికగల రచయితకు మిత్ర ప్రేరణచే ఛత్రపతి శివాజీ కథ లభించినది. ఇతర భాషలలో ఈ మహామహునిపై ఇప్పటికే ఎన్నో గ్రంథములుదయించినవి. తెనుగులో కావ్యరూపముగా ఇంతవరకా కథ రాలేదు. అది గడియారంవారికి దక్కుట, వారికి, తెనుగువారికి నదృష్టము.

శా॥ 'ధీరాగ్రేసరమూర్తి హైందవధరిత్రీ భాగ్యసత్యాపన
ప్రారంభుండు దయాగుణాంబుధి మహారాష్ట్రాన్వయోత్తంసుడౌ
వీరక్షత్రియమౌళి భవ్యభరతోర్వీ ధర్మరక్షార్పిత
శ్రీరమ్యుండు భవాని భక్తుడు శివాజీరాజు సామాన్యుడే!'

కం॥ 'ఆతని చరితము హైందవ
జాతి పరాయణము భావి జగదభ్యుదయ
స్ఫీతము ధర్మోపేతము
నీతిపథము నిగమసూక్తి నిభమై వెలయున్.'

శివాజీ భారతీయుల భాగ్యపరిపాకముగా జన్మించిన అపర శివుడు. మహమ్మదీయుల క్రూరపాలనచే పరితప్తమైన హిందూ జాతి నుద్ధరించుటకు పరమేశ్వరుడు పంపిన మహాప్రమధుడు శివాజీ. పతితమై భ్రష్టమై స్ఫూర్తి రహితమై నిస్తేజమైన యీ పురాతన జాతిలో ధర్మావేశమును నిర్మించి మట్టి నుండి మహావీరమణులను సృష్టించిన అద్భుత వ్యక్తి అతడు. భవానీదయాదత్త కరవాలఖేలా పునస్సంపాదిత రాజ్యలక్ష్మి మహోదయుడైన మహాపురుషుడతడు. ఆ శివవీరుని విజృంభణము నెంత చక్కని ఉపమానములతో రచయిత తీర్చెనో చూడుడు—

సీ॥ 'కార్తవీర్యుడు గొన్న కపిలధేనువు దేర
రణభీము భార్గవరామునట్టు
లేకచక్రపురంబు నెరియించు బకుగెల్వ
ద్విరదాయుతస్థేము భీమునట్టు
లాదితేయుల గెల్చి అమృతకుంభము దేర
తతవిపక్ష దిధక్షు తార్క్ష్యునట్టు
లమర సామ్రాజ్యాపహర్తయౌ బలిద్రొక్క
మాయావతార వామనుని యట్లు.' 2–79

పరశురామునివలె, భీమునివలె త్రివిక్రమునివలె విజృంభించెడి శివాజీ మహావీరుని చరిత్ర అనన్య సామాన్యమైనది. అంతటి హిందూ సామాజ్య ప్రతిష్ఠాపకుడైన ఒక ధీరోదాత్తుని కథ కావ్యముగా తీర్చి శేషశాస్త్రిగారు ధన్యులైనారు.

ఇక రచనా మార్గములో రచయిత కాదర్శము తిక్కన అని ఇంతకు ముందే గమనించినాము. ముఖ్యముగా తెనుగు పలుకుబడి యందా విషయము పదపదమున స్పష్టమగును.

'వచ్చినవాడు ఫల్గును డవశ్యము గెల్తుమనంగరాదు'———

'అంతలు చేసిపోనడచి అక్కడ సంజయుచేత చెప్పి పుత్తెంతురె'———
అను భారత పద్యములను మనసులో నుంచుకొని ఈ క్రింది పద్యము చదువుడు. అఫ్జుల్‌ఖాన్‌ను ఎదుర్కొనబోవు శివాజితో తల్లి జిజీయ బాయి పలికిన ఘట్టమిది

ఉ॥ 'వచ్చినవాడు ఖానుడొకవైపున కుత్తుకలుత్తరించునా
పచ్చికసాయి నీవెరుగవా ? భవదగ్రజునట్లు చేసెనా

చిచ్చెద బాయకింతలు కృశించితి నీ తరళాక్షు పూరమీ
వెచ్చని యూర్పు నీ కనుల వ్రేల మెలంగుము ఖాను పొత్తునన్' 5-116

ఇందలి పచ్చి కసాయి, చిచ్చెద బాయక, ఇంతలు కృశించితి వెచ్చని యూర్పు, కనులవ్రేల మొదలగు పదములలోని జాను తనము గమనింపదగినది. ఏతాదృశ మైన పద్యములు కొన్ని వందలు శివభారతమున మనకు ద్యోతకమగును.

సీస పద్యములు రచించెడి తెలుగు కవి శ్రీనాథునివలె ఒయ్యారములొలికించు నడకలతో రచింపక యుండడు.

సీ॥ 'నడిపించితివి తోడుపడికాన్పు సవరించి
యల ఆడుబిడ్డ మర్యాదలెల్ల
నొడిపించితివి బిడ్డ నొడిజేర్చిపుడికించి
పెద్ద కోడలి యింటి పెరిమయెల్ల
కుడిపించితివి పీటయిడి పళ్ళెరంబిడి
వియ్యపురాలి యొప్పిదములెల్ల
విడిపించితివి నీదుకడుపులో చోటిచ్చి
సవతి పుట్టింటి మచ్చరములెల్ల

తే॥ పది వసంతముల్ నీదు గర్భమున నడిచె
ప్రోచితివి నీదు రెక్కల పొదివికొనుచు
మరతుమే నిన్ను మాశివు పురుటియిల్ల
పతిని దరిసింప సెలవిచ్చి పనుపు తల్లి!' 2-96.

సీసమును కథాకథనమున కుపయోగించి నన్నయ మార్గము ననుసరించిన వారు తరువాతి కాలములో తగ్గిపోయినారు. శాస్త్రిగారు అందులోను అందమును చిందించిన తీరు మెచ్చదగినది.

సీ. ''శ్రీరామమూర్తి కాంతారవాసము సేయు
నపుడు దక్కను దండకాఖ్యమడవి
నాడగస్త్యుడు దక్షిణాపథమేగుచో
కొండజాతుల చూచియుండెనిచట
పాణిని సంస్కృత వ్యాకరణమ్మున
వినిచె నొక్కింత దక్కను గురించి

కాత్యాయన మహర్షి కాపురంబులు సేర్చె
తనతోడి ఆర్యసంతతుల నిచట

తే॥ వరుసనెందరో యిట్లు కాపురము సేర
కెరలి దక్కను బహుజనా కీర్ణమయ్యె
ప్రజలు రాజులు రాజ్యముల్ ప్రబలనిందు
సూర్యవంశ రాజన్యులు సొచ్చిరపుడె.

చారిత్రక కథా కావ్యములు రచించు కవి కొక యిబ్బంది ఉండును. కథ లోని అన్ని ఘట్టములను రసవంతముగా నుండవు. అటువంటి వానిని కావ్యగతము చేయునపుడు గ్రథన కౌశలము గల కవి తగిన ఛందము నెన్నుకొని సూటిగా విషయములోనికి ప్రవేశించి విసుగు పుట్టని పద్ధతిలో రచన సాగించును. గడి యారము వారిలో అటువంటి నైపుణ్యమున్నది గనుకనే అంత నిబ్బరముగా నిస్తరంగా నీరధి వలె శాంత గంభీరమైన రీతిలో గ్రంథము నడిపించినారు.

సరళ సుందరమైన శైలిలో పోతనగారు ''ఉన్నాడా బలభద్రుడుగూడి సుఖియై ఉత్సాహియై ద్వారకన్'' అనినటులే శాస్త్రిగారు శివాజీచేత మావళేలను గురించి పలికించినారు.

శా॥ 'ఉన్నాడా భగవంతుడెందయిన నొక్కింత సంసారియై
కన్నాడా ప్రజ తండ్రివోలె సమసౌఖ్యం బందగా బిడ్డలన్
గన్నాడా యనుకొందు కాని యెడ నీ కాంతారముల్ కొండల
న్నన్నా ! మీకు నివాసమై మనగనేలా ? జంతువుల్ తోడుగన్'

అలంకార శాస్త్రమున వాక్య గర్భితమను దోషము కలదు. ఇది కొన్ని సందర్భములలో గుణముగానే ప్రకాశించును. ప్రభావతీ ప్రద్యుమ్నమున సూరన కవి-

ఉ॥ 'ఆతడు మొన్ననున్నత మదాంధత మా పురి కేగుదెంచియా
పోతరమేమి సెప్ప ? నను బూరికి గైకొనక కప్ప రోవధూ
వ్రాతని శాత పాణిరుహ వారసలాలన సవ్య పల్లవం
బైతన రారునందన మహావనిలో విడియించె సేనలన్'

'ఆ పోతరమేమి చెప్ప' అనునది వాక్య మధ్యమున ప్రవేశించిన వాక్యము కృష్ణునకు వజ్రనాభుని దర్పాతిశయమును బోధించు నింద్రుని ఉద్విగ్నతను

సూచించుచుండుటచే ఇది గుణమే యైనది. అటులే శేషశాస్త్రిగారును సాంబాజీవధా కథన సందర్భముననట్టి రచన చేసినారు.

శా॥ 'ఆ ఙంజాట మడంపగా జనిరి సైన్యాటోపమేపార సాం
ఖాజీగారట ముస్తఫాబలియుడై మా రొడ్డె దుస్తంత్రరిం
ఖాఙం ఘూలుడు, దూరమున్న అఫజుల్‌ఖాన్ ముస్తఫారేపి సాం
ఖాజీగారిని...'పల్కనోడెదను' దేవా! వారు లేరీధరన్' 4-148

వేగరియైన భటుడు శివాజీతో ఉద్వేగదుఃఖభరితుడై చెప్పుటచే మధ్యలో ఆ వాక్యము సహజముగా వచ్చినది. కావున 'పల్కనోడెదను......' అనునది గుణమేయైనది.

ఉపమానము లెన్నుకొనుటలో రచయిత చూపిన నేర్పు మెచ్చదగినది. భర్తకు దూరముగానున్న జిజీయాబాయిని వర్ణించుచు శకుంతలతో పోల్చుట సమంజసము, ధ్వని గర్భితమునైయున్నది.

'...పతిరాక నరయుచామె
కణ్వుచెంత శకుంతల కరణినుండె.'

ఇరువదియవ శతాబ్దపు కవిగావున కాలానుగుణమైన సినిమావంటి ఉపమలును కొన్ని కనిపించుట ఆశ్చర్యము కాదు. చూడుడు-

తే.గీ॥ ధవళయవనిక సినిమాప్రదర్శనమున
తాండవింపవె వివిధ చిత్రములు వరుస
తిమిర గంభీర కాళరాత్రిని గమించి
అరుణ గర్భరేఖలు ప్రాచినలముకొనవె.'

అన్న హత్యను గురించి వినిన శివాజీ-

"అనునెడ బల్లెమున్‌జొనిపినట్లగుచున్ శివరాజు వ్రేటునా
టినపులివోలె రేగి'' నాడుట!

జీజియాబాయి శివాజీ చిన్నతనమున పడిన బాధలను వివరించు పద్యములోని ఉపమాన పరంపరా రమణీయత వీక్షింపుడు.

సీ॥ ఉదరమ్మునంట నిన్‌బొదివి మర్కటి వోలె
ప్రతి దుర్గమున కెగప్రాకలేక

బావురుగాని యాపదబాప రాచిల్క-
వలె పంజరమున నిన్నిలుపలేక
కంసుకటారిసోకగనీక వసుదేవు
వలె గోకులము చేర్చువాడులేక
పులివాతబడు గోవువలె లేగదరిజేరి
దిక్కు-లేనితనంబు తెలుపలేక'          2-73

కనులకు గట్టినటుల ఆమె పడిన కష్టములన్నియు ఈ పోలికలచే శక్తివంతముగా ప్రదర్శింపబడినవి.

ఆనంద ప్రదానము కవితకు ప్రధాన ప్రయోజనము. కాని ధర్మ ప్రధాన మయినపుడే అది జాతి కుత్తేజకరమగును. రామాయణ భారతాదుల మహత్వ మదే. శివభారతమును దాని కంకితమైనదే. కావ్యనాయకుడు శివాజీ ధర్మవీరుడు. ఎంతటి వీరుడో అంతటి త్యాగధనుడు. తన సామ్రాజ్యము సర్వమును రామ దాస యోగి పాద పద్మముల చెంత సమర్పించిన ధీరయోగి. రామదాసముని ప్రబోధ మాతనిని హిందూ సామ్రాజ్య స్థాపనకు ప్రేరేపించినది, కర్తవ్య పరా యణు నొనర్చినది.

ఒకనా డతడు సహ్యాద్రి సీమలలో వేటాడుచున్నాడు. ఆట తీవల ఆకు లపై ముత్యముల కూర్చినట్లు వ్రాత యేదో కన్పడినది. ఉత్సుకితాంతరంగుడై దానిని చదివినాడు. నాటి దేశ మత పరిస్థితుల కది మణిదర్పణమువలె నున్నది చూడుడు.

తే.గీ॥ 'త్రుళ్ళు కెరటాల నురుగు కరుళ్ళుదేల
భోరుమను మ్రోత జగమెల్ల పుక్కి-లింప
దాటుకడలి తుపానులో ధర్మనౌక
సుడియు చున్నది దరిజేర్ప నడుపుమింక'          3-177

తే.గీ॥ 'చెదరిపోయిన అంగముల్ కుదురుపరచి
సడలు వారిన తంతువుల్ చక్క-దీర్చి
అనుగతశ్రుతి భువన మోహనము గాగ
హాయి బలికింపలెమ్ము జాతీయవీణ'          3-178

కలి పురుషదుర్వ్యాహార కశ్మలమైన భరత భూమిలో ధర్మనౌక నొడ్డుకు జేర్చి, జాతీయ వీణను హాయిగా పలికించవలసిన బాధ్యతను రామదాసు శివాజికప్పగించి నాడు. కర్తవ్య మార్గము నద్బోధించు ఇటువంటి పద్యముల నెన్నింటినో ఈ గ్రంథమున మనము కాంచగలము.

పరమ కిరాతకుడైన అఫ్జల్ ఖాను నెదుర్కొనుటకు శివాజీ బయలు దేరినాడు. భవానీ ప్రసాదమును శిరమున దాల్చి తలపై ఉక్కుతెర శిరస్త్రాణము గట్టి పైన పట్టుపాగా ధరించి, మేన ఇనుప కవచము దానిపై నిలువుటంగీని తొడిగి ఎడమ చేత పులిగోళ్ళు కుడిచేత పిడిబాకు అంగీమరుగులో జొనిపి నిడు పైన కరవాలము నడుము పట్టికి వ్రేలాడజేసి, నొసట కుంకుమ దాల్చి, తల్లి కడకేగి పాదాభివందనము చేసినాడు. బిడ్డను పైకి లేవనెత్తి జీజియా దీవించినది. ఆ దీవనలోని భావ పరంపర వీరమాత కాదలచిన ఏ తల్లికైనను ఆదర్శము. ఒక వైపు కుమారుని సాహసమును కాదనలేదు. మరొక వైపు ఖానుని బలమును తలచినచో కలత కలుగును. డోలాందోళిత చిత్తయయ్యు కల్లోలిత మనస్కయయ్యు ధైర్యముతో నిశ్చయము చేసుకొని జీజియా చేసిన ఆశీస్సులు గమనింపుడు.

ఉ॥ "కాదనరాదు నీ తెగువ ఖానుని బలంబు దలంచియందు బో
రాదనరాదు లోమఋలు అంపిలు ప్రేవులపొత్తు తాల్మిరా
నీదు, కుమార! హైందవ మహాశుభముల్ లిమోసిపట్టి నీ
వీదెద వాంటిచేత సుడియెత్తులకందని రేవు జూడుమీ." (5-114)

ఉ॥ "బాలుడవౌచు గోహనన పాపమునాపిననాడు సాహసో
త్తాలుడవౌచు దోరణమొదల్ గడముల్ గొనునాడు-ప్రౌఢవా
బాలుడవౌచు దండ్రి జెఱసాలకు బాపిననాడు-నీకు దాం
బూలములో సుధాంశమయి పోల్చునదృష్టము నేడు తోడగున్."
(5-119)

జిజియాబాయి సామాన్య స్త్రీ కాదు. అసిధారా వ్రతము ధరించి, తెంపు కుదురగు నాత్మోపహారమున పసుపు కుంకుమ కానుక వెట్టి ప్రణయ బ్రహ్మము నుపాసించుచు శివాజీని కనిపెంచిన తాపసి. ఆమె వాక్కు లెన్నడును వ్యర్థము కావు. మహాబలశాలి, క్రూర కర్ముడునైన అఫ్జుల్ ఖానును శివాజీ వధించి

తీరవలయును. దానికి శారీరక శక్తి ఒక్కటే చాలదు. అసలా దృష్టితో చూచిన ఎడల ఏనుగు వంటి ఖానుముందు శివాజీ ఎంత ? కానీ జిజియా భవానీ భక్తురాలు. ఆమె కారుణ్యమునా వాహనము చేసి కుమారునిటు లాశీర్వదించినది:

మ॥ 'అరిసేనా హృదయాంత రాళములు మ్రోయన్ దురహంకారభీ
కరమౌ సింగమునెక్కి, యష్టభుజముల్ ఖడ్గాది శస్త్రంబులన్
దరశింపన్, రణమందు నీమునుము వెంటన్ గోల్తలన్ జేయుశాం
కరియవ్యాజ కటాక్షముల్ కవచరక్షా దీక్ష నిన్నోమ్మితన్.' (5-120)

పులి గోళ్ళతో ఖాను ఉదరమును చీల్చి వాని క్రియకు ప్రతిక్రియ చేసిన శివాజీ వీరావేశ పూరితమైన వాక్కులు హైందవుల కాదర్శప్రాయములు.

శా॥ 'హిందూ ద్వేషము ద్రావి త్రోవ నెచటన్ హింసింతువో గోసతీ
బృందం ? బీశ్వర విగ్రహాలయములుర్విన్ గూల్తువో? ప్రేల్తువో?
పందా! దైవము దిక్కులేని దనుచున్-బాషాణముల్ పల్కవం
చుందీంద్రింతా? శివుండు నిన్ను గడతేర్చున్ గాక సోకోర్చునే ?'
(5-142)

ఈ కావ్యమున ప్రధాన రసము వీరము. ఇటువంటి వీర రసాత్మక ఘట్టము లీ గ్రంథమున ఎన్నో కలవు. అఫ్జల్‌ఖాన్ మరణము తరువాత బీజపూర్ నవాబునకు పరాభవ క్రోధము చెలరేగినది. కర్నూల్ సుబేదారైన సిద్దీజూహార్ సేనాధిపత్యము క్రింద మహాబలము సమకూర్చి శివాజీపైకి దాడి పంపెను. పన్హాళాగడములో ఉన్న శివాజీ ఉనికిని తెలిసికొని సిద్దీజూహార్ కోటను నలువైపులా చుట్టుముట్టెను. కొన్నాళ్ళు యుద్ధము జరిగెను. అపారమైన శత్రుసేనలను ఎదిరించుచు అక్కడనే ఉండుట ప్రమాదకరమని శివాజీ గుర్తించి ఐదువందల సేనతో బాజీ ప్రభుడు వెంటరాగా అర్ధరాత్రివేళ కోటదిగి వచ్చి రాంగణా కోటవైపు వెడలెను. దీనినెటులో గ్రహించి నవాబు సేనలు వెంటాడినవి. శివాజీని భద్రముగా కోట చేర్చుటకై ఒక లోయ దగ్గర తన కొద్ది పాటి సేనతో నిలచెను. ప్రభువుమీది భక్తితో శత్రువులను చీల్చి చెండాడి అవసరమైనచో ప్రాణములనైన అర్పించెడి తెగువ కలవాడు బాజీ. అతడు శివాజీతో పలికిన తీరు చూడుడు:

మ॥ 'భవదాజ్ఞాపటు ముష్టిబంధ నిపతద్రృహోగ్రమో వజ్రమో
యవుబాజీ చనుదెంచునే ఉరక నృత్యన్మృత్యుజిహ్వా కరా
ళవలత్ఖడ్గ విదారి తారి తను కీలాలాభిషేకోదయ
ద్రవిబింబంబయి రాంగణా గడము జేరన్వచ్చు మీవెంబడిన్' 5-210

రసోచిత సమాసబంధముతో అర్థవిశిష్టతతో అలరు ఈ పద్యము వీరాగ్ర గణ్యుడైన బాజీ ప్రభుని ప్రభుశక్తిని సాహసమును సమున్నతముగా సందర్శింప జేయుచున్నది. పదునైదు వేల బీజాపుర సేనతో పోరాడిన ఆ మహా వీరుని శౌర్యము జగన్నుతమైనది. శత్రువుల నాతడు ఖండ ఖండములు చేసిన తీరు రచయిత ఎంత అద్భుతముగా వర్ణించినాడో పరికింపుడు:

సీ॥ 'కాలవిద్రిప్పినయట్లు మెఱుగు లేచినయట్లు
కరవాలు మిస మిసల్ గ్రమ్మకొనగ
మునుమెత్తిరిపు మధ్యమును జీల్చిచొరబాఱి
నలువైపు సేనల నఱకులాడి
పెనుగాలి తాటిపండ్లను రాల్చుచందాన
గొడవండ్ల బైరులు గోసినట్లు
చెఱకుగడల్ నిల్వు నఱికివై చెడిరీతి
చిగురాకు దూసిపోసినవిధాన

తే॥ దలలు మొండెముల్ పాణి పాదములు కండ
లింతలింతలు తునియలై యిందువందు
ప్రోవులై, రాసులై, రణభూమి మిత్తి
వంటయిల్లన పీనుగు పెంటజేసె.' (5-226)

సాక్షాత్ వీరభద్రునివలె వీరావేశ దుర్దాంతుడై కత్తిడాలు ధరించి అతడు కావించిన శత్రు సంహారము అనూహ్యము. మూడువందల అల్పసేనతో పదివేల బిజాపూర్ సైన్యము దర్పమడచి కనుమ వాకిట ప్రవేశింపనీయక సింహ విక్రముడైన బాజీ ప్రభుడు భయంకర యుద్ధము చేసినాడు. రోషముతో శత్రువులను చూచి, ఇదిఏమి చెవులపోతుల వేట అనుకొనినారా? వచ్చినది పెద్దపులి. మిమ్ము చీల్చివేయును. శివాజీ సేనాపతులలో చిన్నవానినే చెనక లేకున్నారా ? ఇది ఎంత సిగ్గుచేటు?

తే॥ 'రండు రండోయి! యవన శూరవరులార
చెదరి చూచెదరేమి ? బాజీ ప్రభుండు
చిక్కినాడు గదోయి మీ చేతులందు
దెంపు చూపించి యిపుడ బంధింపరాదె ?.' (5-242)

ఈ విధముగ యవనుల తెగనాడి సవాలు చేసి రౌద్ర రసానుభూతి నెనసి దూకుచు తనవారిని గని యిట్లు పల్కినాడు:

తే॥ 'వెడలి రండు మహారాష్ట్ర వీరులారా !
తఱిగి పోయుడు రిపుల మస్తముల గములు
మనకు రణరంగములు పెండ్లి మంటపములు
వీరలక్ష్మితో జయలక్ష్మి వియ్యమాడు.' (5-246)

యుద్ధమున మరణించిన వీరులు సూర్యమండలము భేదించుకొని మలయు చున్న మందారముల తావిలో పోవుచున్నారు. నేలవాలిన మనవారి కళేబరములు ఒకటొక్కటి నిచ్చెన మెట్లుగా ప్రభువు రాంగణా గడము నెక్కుచున్నాడు. మీరు చివరి సోపానమైనా కాదగదో.

ఉ॥ 'దారులు గట్టి యీ కనుమదాపున బోరుడు, నేటికీ ముఖ
ద్వారము గర్వ ధూర్వహ విపక్ష వరూధిని పాలికిన్ యమ
ద్వారము-వీర యోధజన వల్లభ కీర్తి రమా సమాగమ
ద్వారము; స్వామిభక్తిపణబంధమునన్ జొరబారు డిందునన్.'
(5-252)

అని ఎలుగెత్తి ఆర్చి రభసాహవదోహలుడై బాజీ ప్రభుడు దారుణమైన యుద్ధముచేసి మరణించినాడు. శివాజీ కోట చేరిన గుర్తుగా వచ్చిన ఫిరంగి మ్రోత విని సంతృప్తితో ఆతడు ప్రాణములు విడిచినాడు. అతని దేహమును సైనికులు తీసికొని వెళ్ళి శివాజీ ముందుంచిరి. శివాజీ బాధావిలచిత్తుడై తన సహానుభూతి నిట్లు పల్కెను:

తే॥ ''ఎంతలో నెంతలయిపోయె! నిపుడు గాదె
సెలవు గొంటివి-మరల దర్శింపలేని
సెలవు! బాజీ ప్రభూ! కనుల్ సెదరమెఱసి
మెఱుగులో తెప్పమఱుగులో సురిగిపోతె!'' (5-266)

తే॥ ''ప్రాణములు మ్రింగు మృత్యు వక్త్రమున కెదిరి
నన్ను దొలగింప బలియిచ్చినాడ వుసురు
లట్టి నిను చేతులార బోగొట్టికొంటి
నెందు వెదకుదు-వెల్లువ లేచి చనగ.'' (5-267)

స్వామి భక్తితో శౌర్యాగ్నిని సంస్కరించి రణ మహాయజ్ఞ కుండము నందు స్వార్థమును వ్రేల్చి అవభృథమాడి అమృతోపహారమంది వెలుగుచున్న ఆ ధర్మవీరుని గూర్చి ఆ విధముగ భావించుట ఎవరికైనను సహజము.

అటులే సింహగడమును గెలిచిపెట్టి తానాజీ మరణించినపుడు అఖండ ప్రేమభాండోదరోద్ధూతాశ్రూదకబిందు లుట్టిపడగ వేడి నిట్టూర్పులు విడచుచు శివాజీ తన వేదనను వెల్లడించినాడు.

తే॥ జారిపడినది - నా చేతి చంద్రహాస
మవగళితమయ్యె నా వజ్ర కవచమిప్డు
సింహగడమున గడమేమొ చిక్కెగాని
పోయినది సింహమీ కుడి భుజము వోలె!'' (7-281)

తానాజీ ఒట్టి సేనాపతి మాత్రమే కాడు. శివాజీకి అడుగడుగున తోడై నిల్చిన ప్రాణమిత్రుడు. బాజీఘోరపటుడు ప్రతిభటుడై మీదపడిననాడు, అఫ్జుల్‌ఖాన్‌తో ద్వంద్వ యుద్ధము చేసిననాడు, షయిస్తఖాన్ మేడపై అర్ధరాత్రి పోరిననాడు, ఔరంగజేబ్ చెరసాలలోనుండి తప్పించుకొనెడినాడు, తోడై నిలిచిన సాహసవీరుడాతడు. అతని త్యాగము కరుణరసాత్మకమై శివాజీనేకాదు, హృదయ మున్న ప్రతివానిని కదలించును.

ఇటువంటి కరుణరసభరిత ఘట్టములు అటనట నీకావ్యమున గలవు. పుత్రపౌత్రులతో లుకజీని గొంతుగోసి నిజాం దర్బారులో వధించిన వార్త విని షాజీ, జిజియాబు పరితపించిన సందర్భము కూడా గుండెలు కదిలించునట్లు శేషశాస్త్రిగారు రచించినారు. జిజియాబాయి కన్నుల బాష్పములు జాలువార—

తే॥ 'తొలగితివె నన్ను! నీ ప్రేమ నిలయమునకు
దలుపుమూసితివే తండ్రి తరలిపోతే

కన్న సంతాన మిటు బైలుగాలి దోలి
కన్నుగవ మూసికొంటివే కన్నతండ్రి.' 1-162

అని పితృదేవునికై శోకాకులమై విలపించినది.

షాజీ కూడా—

మ॥ కసుకుంబిందెల దూసిపోసి చిదుమంగా జేతు లెట్లాడెనో!
నిసుకుల్ దిక్కఱి యెంతగాబదరి 'తండ్రీ' యంచు వాపోయిరో
యసిధారన్ జళిపించి పైబడెడి హత్యాభృత్యులన్ గంచు, దా
ససహాయుండయి మామ యెట్టి మరణాయాసంబునన్ గ్రాగెనో.
1-163

కన్నులు చెమ్మగిల్లగా తటకాపడినిల్చెడి నాధునిగాంచి జిజియాబాయి ద్రౌపదివలె పగతో విజృంభించినది. రోషముతో భర్తకు ప్రబోధము చేసి పరశురామునివలె శత్రుసంహారము చేయుమని ప్రార్థించినది. దర్ప సమగ్ర భుజార్గళచ్ఛిదావికలిత రాజలోకుడగు వీరుడు అభిమానవంతుడు కిరాతకజన దుర్విహారమును ఓర్చుకొనరాదని హెచ్చరించినది. కన్నుల ఊట మామకొడికపు తిలోదకమిత్తువో? తెగగొన్న కసాయి దాయగమి కుత్తుకనెత్తురు దోయి లిత్తువో? ఆలోచించుకొమ్మని పల్కినది.

ఈ కావ్యమున జిజియాబాయి పాత్ర ఎంతో ముఖ్యమైనది. ధీరగంభీర మైన ఆమె వ్యక్తిత్వమును రచయిత అద్భుతముగా తీర్చి దిద్దినాడు. ఇంతకు ముందొకసారి తన భర్తపై కత్తి గట్టనుంకించిన తండ్రిని ధిక్కరించుచు ఆమె పల్కిన పల్కులను గమనించిన ఆమె అసామాన్య లక్షణము వ్యక్తమగును.

ఉ॥ 'కెవ్వన హుంకరించి యడికించెద, వాయుధమెత్త నుంటివీ
వెవ్వరిపైన? నీ యెడద కింత వివేకము చాలదయ్యెనే?
గువ్వలుగూడ గాన్పులను గూరిమిబెంచు జగంబునందు నీ
వెవ్వడవయ్య? యాదరణ కెక్కరె యల్లుడు నాడుబిడ్డయున్.'

చా॥ 'కనికరమింతలేని కొటికాడవు నన్నిటు పెంచనేల, పు
ట్టినయపుడే గళమ్మటమటించిన బోవదే? వెంటనంటియు
య్యనువున వేటలాడమనసయ్యెనె? కన్ననిసుంగు మ్రింగు ప
ర్తనమది సర్పజాతికి గదా యొకమానవుడిట్లు సేయునే?' (1-98, 99)

తన వాక్చాతుర్యముచే తండ్రి కరిగిపోవునటులు చేసి ఆతని మనసు మార్చిన ధీమంతురాలు జిజియా. ఆమె కన్నీరు చూచి లుకజీ కరాళ కరాసి జార, తొట్రిలు నడమీర పుత్రికదాపుజేరి చేతులగొని అక్కున జొనిపి, తొంగలి రెప్పల సోనలొత్తి, కెంపొలసిన బుగ్గల నిమిరి యోడిన కుత్తుకతో నామె నోదార్చినాడు.

ఈ విధముగా తాను తలపెట్టిన ఏపనినైనను పట్టుదలతో సాధించగల అద్భుత వ్యక్తి జిజీయాబాయి. ఆమె పెంపకము వలననే శివాజీ అంతటివాడైనా డనిన అసత్యము కాదు. ఎంతటి కష్టమునైనను సహించు ధైర్యము, అన్యాయము నెదుర్కొను సాహసము ఆమెవలననే శివాజీ పొందినాడు.

తండ్రి మార్గమును కాదని తనదైన ఒక ప్రత్యేక జీవిత మార్గము నెన్నుకొనుటకూడ శివాజీకి మాతృశిక్షణములో, గురుశిక్షణములో లభించిన వరము. నవాబుల నెదిరించుట కిష్టపడని తండ్రితో తన మార్గమును శివాజీ యెటులు పలికినాడో చూడుడు !

మ॥ 'జనకా ! నా మతమున్ వచించెద హరిశ్చంద్రాది రాజన్యులే
లిన యీ భారత భూమి గోహనన మాలిన్యంబునన్ బాసిప్రా
క్తన జాతీయత నందగింపవలె సుల్తానైన నీనాటి పా
లన సూత్రమ్ముల మార్చివేయవలె కళ్యాణంబు ప్రోయన్‌వలెన్'

మ॥ 'యవనుల్ హైందవులన్న భిన్నత నసూయన్ జూపగా లేదు తా
మెవరీ రాజ్యము నేలనన్ తగవులేనే లేదు నీనాయటం
చవకాశమ్మునుబట్టి యొక్క తెగ కన్యాయంబు గావింపన్
నవునంచూరక వంతుపాట పని సేయంజాల ముమ్మాటికిన్'

ఇందలి వంతు పాట అను పద ప్రయోగమును డా॥ చిలుకూరి నారాయణ రావు గారెంతయు మెచ్చుకొన్నారు. వారి దృష్టిలో ఈ కావ్యము శాంతరస ప్రధానమైనది. మహాగంభీరజలధివంటిదే యీ గ్రంథమని వారి అభిప్రాయము.

భావము, ఔచిత్యము, అలంకారము, రసము, రీతి, పాకము, శయ్య, ఉక్తి విశేషము, వక్రోక్తి, స్వభావోక్తి, ధ్వని - ఆలంకారికు లేవేవి కావ్యమునకు ప్రాణమని వేర్వేరు మాటలతో నిరూపించినారో వాటికన్నిటికి శివభారతములో

నుదాహరణములు కన్పించునని చిలకూరివారు పలికినమాట అక్షరాల సత్యము. ఉత్తమ కవిత్వమునకు కావలసిన సర్వలక్షణములు నీ కవికున్నవి. అవి కావ్యగతములై శాశ్వతములైనవి.

గడియారము వారి అదృష్టమంతయు వారి కవితా శక్తికి తగిన ఇతివృత్తము నెన్నుకొనగలుగుటయే, ఒక చారిత్రకమైన అవసరము వారి కాకథ నెన్నుకొను ప్రేరేపణ కలిగించినది. శివాజీవంటి మహా వీరుడు నాయకుడగుట కావ్య స్రష్టకొక మహా భాగ్యము. శివాజీ వట్టి వీరుడు మాత్రమేకాదు. పర స్త్రీ పరాఙ్ముఖుడు. కళ్యాణ దుర్గాధిపతి కోడలి విషయమున ఆతడు ప్రదర్శించిన ఉదాత్తత లోకాదర్శము. అంతటి శీలసంపన్నుడు గనుకనే, సకల హృదయములకతడు మాననీయుడై నిలిచినాడు. అతడు సాక్షాత్ శివావతారమని ప్రజలెల్ల నమ్మినారు. చిన్నతనమున దాదోజీ షాజీతో నేమనినాడో చూడుడు-

ఉ॥ మూడవకన్ను నెన్నుదుట మ్రొమ్మెనవాలు కరమ్మునందు రే
రేడు శిరమ్మునందు చికిరింపక నాడనసూయయింట పా
రాడిన పాపడే మనగృహమ్మున నేడుదయించెనేమొ రే
కాడిన వాని చాయలవి యట్టివి ధన్యుడవీవుభూవరా.'

తిక్కన రచించిన-

'చిచ్చరకన్నుమూసుకొని చేతి త్రిశూలము డాచి లీలమై
వచ్చిన రుద్రుచందము ......................'

ఈ సందర్భమున స్ఫురింపక తప్పదు. ఏదైనను శివవీరుని కథ శేషశాస్త్రి గారి పుణ్యమాయని తిక్కన రచన మార్గమున తెలుగువారి కందినది.

యుద్ధ ఘట్టములలో రాజనీతిని బోధించు ఘట్టములలో అడుగడుగున కవిబ్రహ్మ మనకు కనులముందు సాక్షాత్కరించినట్లు ఆ భారతమునందు వలెనే ఈ భారతమునందును తోచును. ప్రజలకు ప్రభుత్వమునకు ఉండవలసిన సంబంధము గూర్చి రచయిత తేట తెలుగు మాటలలో ఎటులపలికెనో గమనింపుడు.

తే.గీ॥ 'పవన సూర్యులు వోలె జీవనము వోయు
దొరలు గలరేని ప్రజ కేలుదోయి మోడ్చు
ఉరక విషమించి వడగాలి చెరిగిరేని
ప్రకృతిమాత ఒండొక మార్పు పన్నకున్నె' 2-285

ఉ॥ 'నీతిపథమ్ము మెట్టి అవనీ పతులందరు నేగుచో జగత్
త్రాతకులేనిపోని అవతారములెత్త పనేమి' ?---

ఈ పద్యములు చదువుచున్నపుడు అవతారమూర్తిగా భావింపబడిన గాంధీమహాత్ముని నేతృత్వమున స్వాతంత్ర్య సంగ్రామము జరుగురోజుల గాధలు స్ఫురించును. అ స్ఫురణ పఠితలకు కలిగిన దనిన రచయిత కృతార్థుడయినట్లే.

రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు పలికినట్లు ఖండ కావ్యములే తప్ప మహాకావ్యములు రచించు కాలము గడిచినదని భావించు కాలములో అనుపమానమైన మహాకావ్యము పుట్టినది. తెలుగుభారతి మకుటములో నిది కలికితురాయి. ఆంధ్ర సాహితీ ప్రియులు గర్వించవలసిన అమూల్య రచన యిది.



# మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి
# ఆంధ్ర పురాణము
## —డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం

'శ్రీమదాంధ్ర వసుంధరాసీమ నోలసి
దక్షవాటీ మహాస్థాన దైవతమ్ము-
కాళనాధేశ్వరుండు- శ్రీశైలవిభుఁడు-
తెలుఁగువారల నాశీర్వదింతు రెపుడు'[1]

ఒక జాతి చరిత్ర వ్రాయటం ఆ జాతి సాధించిన వికాసాన్ని వ్యక్తీకరింప చేయటం. గతంలోని సజీవసంప్రదాయం మార్పు చెందే వర్తమానానికీ, రూపు కట్టే భవిష్యత్తుకూ ప్రమాణసూత్రంగా పరిఢవిల్లుతుంది. 'Let a country loose its freedom and not loose its history for the consciousness of the past greatness will encourage a nation to win back its freedom'[2] అని మహాత్మాగాంధీ గత చరిత్ర ప్రాశస్త్యాన్ని ప్రశంసించటం గమనింపదగింది. చరిత్ర కొన్ని వాస్తవ సంఘటనల ప్రామాణిక సంకలనం మాత్రమే కాదు. చరిత్రకారుడు చరిత్రలో దర్శించిన మానవేతిహాస మనోజ్ఞవికాసస్ఫూర్తి. చరిత్రలోని సన్నివేశాలన్నీ మానవాళికి ఆదర్శప్రాయంగా ఉంటాయని చెప్పలేము కాని, మానవుడు పొందిన పతనోత్థానాల సమీక్షవలన జాతి గమనింపదగిన, గ్రహింపదగిన నీతిపాఠం మాత్రం కాగలదు. అందువలన చరిత్రకారుడు గతంలోకి చొచ్చుకొని పోతాడు, వాస్తవాలను సేకరిస్తాడు; వానిలోని ఏకవాక్యతనో, వైవిధ్యాన్నో, క్రమవికాస విశేషాన్నో, యుగచైతన్యధారనో, దర్శించి, చరిత్ర నొక క్రమంగా రచిస్తాడు. Carl L. Beeker మాటల్లో - "He (Historian) works in the past, he explores the past in order to find out what men did and thought in the past. His business is to discover and set forth the 'facts' of history."[3] అలా రచింపబడిన చరిత్ర గతాన్ని విలువ కట్టటానికీ, వర్త

మానాన్ని దిద్ది తీర్చుకోవటానికీ, భవిష్యత్తుకు పునాదులు వేసికోవటానికి తోడ్పడుతుందని రాన్కె పేర్కొన్నాడు- "History has had assigned to it the task of Judging the past, of instructing the present for the benifit of the ages to come.''[4]

చరిత్ర రచనలో ప్రధానంగా మూడు విధాలు పాటింపబడుతుంటాయి. 1. వాస్తవ సన్నివేశాలను సత్య దృక్పథంతో కూర్చుచేయటం. 2. చరిత్రగతిలో అంతర్లీనంగా భాసించే మానవస్వభావాన్ని వికాసదశావిస్ఫూర్తితో వివరించి చెప్పే పద్ధతిని ప్రదర్శించటం. 3. చరిత్రగతిలో కనపడే సన్నివేశాలవెనుక తాత్త్వికంగా గోచరించే మానవాంతః పరిణామాన్ని వ్యక్తీకరింప చేయటం. మొదటిది చరిత్ర నిర్మాణ మనిపించుకుంటుంది; రెండవది చరిత్రస్వభావ చిత్రణ మనిపించు కొంటుంది; మూడవది చరిత్ర తత్త్వ సందర్శన మనిపించుకొంటుంది. అయితే, ఈ మూడు పద్ధతుల్లో మొదటిది నేటి చరిత్ర రచనకు ప్రధాన లక్షణ మని సామాన్యంగా భావింపబడటం, రెండవది సాంస్కృతిక, సాంఘిక చరిత్రల రచ నలకు తోడుపడే రచనా విధాన మని తలంపబడటం, మూడవది మానవుడు తాత్త్వికంగా సాధించిన ప్రగతిని చిత్రించే రచనకు ఉపాదేయ మని గ్రహింప బడటం జరుగుతోంది. అయినా, ఆ మూడూ కలిసి త్రివేణి సంగమంగా చరిత్ర రచనలో రాణించినప్పుడు చరిత్ర సమగ్ర మౌతుందని విజ్ఞులచేత వివేచింపబడు తున్నది ''History must be defined as a reasoned account of man's evolution on earth; it is nothing less than this. The story of man's evolution on earth is essentially the growth of human spirit''[5] - అన్న సర్ ఎల్. బి. నామియర్ మాటలు ఇక్కడ గమనింపతగినవి.

ప్రాచీన నాగరక జాతుల్లో జాతిచరిత్రను భద్రపరచుకోవటం ఎంత ముఖ్యమో, జాతినాగరకతను, సంస్కృతిని, జీవనవిధానాన్నీ, తత్త్వచింతననూ పరిరక్షించుకోవటం కూడా అంతముఖ్య మనే భావం ప్రబలంగా ఉండేది. అందు వలన, చరిత్ర గ్రంథాలూ, చారిత్రక కావ్యాలూ సమాన గౌరవాన్ని పొందుతూ ఉండేవి. ఈ రెండు రకాల రచనల్లో కావ్యరూపం తాల్చిన రచనలకు ఒక విశిష్ట స్థానం ఉండేది. గ్రీకు, బాబిలోనియన్ సంస్కృతులను, భారతీయ సంస్కృ తులను తరతరాలవరకు రక్షిస్తూ వస్తున్నవి అటువంటి గ్రంథాలే. భారతీయ

సాహిత్యాలలో వెలసిన పురాణవాఙ్మయం మానవజాతి వికాసాన్ని తాత్త్వికంగా చిత్రించటానికి యత్నించింది. అందువలన వాస్తవ చరిత్ర వాస్తవ దృక్పథంతో నిర్మించిన రచనలు మనకు లభింపకుండా పోయాయి. పాశ్చాత్య చరిత్రరచనా ప్రక్రియ మన కందుబాటులోకి వచ్చేంతవరకు సాక్ష్యాధారాల నాధారంగా చేసికొని రచించే పద్ధతి మనకు లేకుండా పోయింది. ఈ దృక్పథంతో చూస్తే భారతీ యేతిహాసాలు కాని, పురాణాలు కాని చరిత్రగ్రంథా లని చెప్పలేక పోతున్నాము. కాని, అవి భారతీయ జీవన విధానవిస్తృతిని దర్శన పరిణామాన్నీ, ధార్మిక చింతననూ మన కందించే మహనీయ సాహిత్య ప్రక్రియలని మాత్రం నిస్సంశ యంగా చెప్పగలుగుతున్నాం. ఇటువంటి ప్రక్రియ లన్నింటిలోనూ భారతీయులు పురాణాలకు అగ్రతాంబూల మిస్తారు.

"అభితః పరిమళిత యశః
ప్రభవిష్ణులు సుకవిజన సభాజన లీలా
రభటికాస్థానులు ప్రా
క్ప్రభువుల చారిత్ర మిటు పురాణింపబడెన్"[6]

అని శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ప్రాచీనాంధ్ర ప్రభువుల చరిత్రను పురాణంగా తెలుగులో రచించారు. దానికి 'ఆంధ్రపురాణము' అని పేరుంచారు. చరిత్ర ఈ కృతిలో పురాణింపబడిందని పేర్కొన్నారు. చరిత్రను పురాణించట మంటే ఏమిటనే ప్రశ్న ఇక్కడ మొదట ఉత్పన్నమౌతుంది. ప్రాచీనాంధ్ర ప్రభువుల చరిత్ర రచిస్తే ఇతిహాసం అనవచ్చు. కల్హణుడు కాశ్మీరరాజ చరిత్రను ఇతిహాసంగా నిర్మించాడు. ఆంధ్ర పురాణాన్ని ఆంధ్రేతి హాస మంటే బాగుండును కదా! అనిపించవచ్చు. కాని, ఆధునిక యుగంలో ఇతిహాస, చరిత్ర శబ్దాలు వచన రచనలో వెలువడిన చరిత్ర అనే అర్థాన్ని అందిస్తాయి. మధునాపంతులవారు ఆంధ్రరాజుల చరిత్రలోని రసవత్తర ఘట్టాలను కావ్యస్ఫూర్తితో వినిర్మించాలని భావించారు. దానికి పురాణమని పేరు పెట్టారు. 'ఆంధ్ర పురాణము- సమగ్ర పరిశీలనము' అనే అంశంపై పరిశోధన వ్యాసం వ్రాసిన శ్రీ బి. నాగిరెడ్డిగారు మధునాపంతులవారితో ముఖాముఖి గోష్ఠి సలిపి, ఆ అంశాలను తమ గ్రంథానికి అనుబంధంగా సంతరించి విలువైన విషయాలను అక్షరబద్ధం చేశారు. అందులో ఒకటి రెండు ప్రశ్నలకు ఆ కవి యిచ్చిన సమాధానాలు ఈ విషయాన్ని వివరిస్తున్నాయి. వాటిని ఇక్కడ

పొందుపరచటం సమంజసంగా ఉంటుంది. నాగిరెడ్డి ''మీరు ఇతిహాసము వ్రాసి, పురాణమని ఎందుకు పేరు పెట్టారు?'' శాస్త్రిగారు. ''ఆంధ్రజాతి ప్రాచీనమైన దగుట ఒక కారణము. పంచలక్షణములలో వంశానుచరిత ముండుట, పాల్కురికి సోమనాథుడు బసవని చరిత్రను 'పురాణ' మనుట, కన్నడమున కావ్యశబ్దమునకు పర్యాయ వాచిగా 'పురాణ' శబ్దము వాడుటకూడ దీనికి కారణమైనది.''

నాగిరెడ్డి- ''కావ్యమున కొన్ని అద్భుతాంశములు చోటు చేసికొనుటపై మీ అభిప్రాయ మేమి?''

శాస్త్రిగారు - ''ఉపాసకులకు భగవదంశగ ఏదో వెలుగురేఖ తోచును. వారి యుపాసన అట్టిది కావున సహజమే. ఇట్టి అద్భుతాంశములు చోటు చేసి కొనుటవలన కూడ ఈ కావ్యమునకు 'పురాణ' నామ మన్వర్థమగుచున్నది.''[7]

ఇందులో బలమైన కారణంగా కనబడుతున్నది - కన్నడ సాహిత్యంలో 'పురాణ' శబ్దం కావ్యవాచికా వాడబడుతుండటం చేత 'ఆంధ్ర పురాణ' మంటే ఆంధ్ర ప్రభువుల చరిత్రను చిత్రించే కావ్యమని శాస్త్రిగారు పేర్కొనటం. అయినా వారే కావ్యంకంటె విలక్షంగా ఉండే పురాణలక్షణాలు ఆ గ్రంథాని కున్నాయని పరోక్షంగా అంగీకరిస్తున్నారు. బసవేశ్వరచరిత్రను పాల్కురికి సోమనాథుడు 'బసవ పురాణ' మని పిలిచాడు కాబట్టి ఆంధ్రరాజుల చరిత్ర 'పురాణ' మని పిలువబడటం సమంజసమని శాస్త్రిగారు భావించారు. అయితే బసవ పురాణం కన్నడంలో వెలసిన జైనపురాణాల కుండే పంచకల్యాణ లక్షణాలకు ప్రతిగా ఉండే పంచలక్షణాలను తనలో సంవదించుకొని వెలసింది. అంటే వీరశైవ పురాణమైన బసవపురాణం ప్రచ్ఛన్నంగా జైనపురాణలక్షణాలను పాటించిం దన్నమాట. ఆంధ్రపురాణం బసవనిచరిత్రం లాగా మతప్రవక్త జీవితం కాదు; ఏకైక మహాపురుషుని చరిత్రను పంచలక్షణవిశిష్టంగా వినిర్మించిన వస్తువు గలది కాదు. ఆంధ్రచరిత్రను తీర్చిదిద్దిన ప్రభువుల చరిత్రలలోని కమనీయ ఘట్టాల రమణీయ వర్ణనం ఆంధ్రపురాణధ్యేయం. అందువలన లోతుగా పరిశీ లించి చూస్తే బసవపురాణ నిర్మాణంకంటె ఆంధ్రపురాణ నిర్మాణం విలక్షణ మని భావించవలసి ఉంటుంది.

'విశ్వనాథ చారిత్రక కావ్యాలు' అనే అంశంమీద పరిశోధన వ్యాసం వ్రాసిన శ్రీ పి. శివరామశర్మ ఆంధ్రపురాణ నామసార్థక్యాన్ని గురించి వివేచిస్తూ ఇలా అన్నాడు- ''ఆంధ్రులు అనార్యులు కారనీ, పురాణకాలంనుండి

సుప్రసిద్ధు లయిన ఆర్యులే ననీ, ఆంధ్రభాష సంస్కృత మూల మని, ఆంధ్ర రాజులు వైదిక ధర్మమార్గనిష్ఠారతులని, వారి పవిత్ర ధన్యజీవన ప్రతిపాదకమై ఆంధ్రుల మహోజ్జ్వల ఇతిహాసాన్ని వర్ణించే కావ్యం కాబట్టి ఆంధ్రపురాణ మని, పురాణశబ్దంతో వ్యపదేశించటంలోని పరమార్థం.''[8] శర్మగారి వివేచనంలో ఆంధ్రపురాణం ఆంధ్రజాతి పురాదశనుండి, ఆంధ్రరాజుల జీవితంలో భాసించే ధర్మమార్గ నిష్ఠారతిని కాలక్రమాన్ని అనుసరిస్తూ చిత్రించటంవల్ల పురాణ నిర్మాణంలోని ఏకవాక్యతాసూత్రం ఈ కావ్యంలో పాటింపబడటంచేత ఆంధ్ర పురాణం పురాణశబ్ద వాచ్య మౌతున్నది.

విశ్వనాథ సత్యనారాయణగారు ఆంధ్రపురాణ నామసార్థక్యమును మరొక విధంగా సంభావించినారు– ''ఈ రచన కవియొక్క పాత్రపోషణాదిక వాంఛా నిరూపణము చేయదు. పౌరాణిక కథామూర్తులను ఒక దివ్యమైన వెలుగులో చూపించుటకే ప్రయత్నించుచున్నది. ఆంధ్రపురాణశబ్దమే కవియొక్క ఈదృష్టికి సాక్ష్యముగా నున్నది.'' పౌరాణిక కథామూర్తు లనగా విశ్వనాథవారి అభిప్రా యంలో ప్రాచీన చరిత్రలో ప్రసిద్ధులైన వ్యక్తులని గ్రహిస్తే, వారిలో దీపింప బడిన దివ్యత్వమే ఈ కృతికి పురాణనామ ముంచటానికి హేతువైనట్లు భావించ టానికి వీలుపడుతున్నది.

ఆంధ్ర పురాణకర్త అభిప్రాయాలనూ, విమర్శకుల వివేచననూ సమన్వ యించుకొని ఈ గ్రంథ స్వభావాన్ని నిరూపింపవలసి ఉన్నది. ఇది పురాణీక రింపబడిన ఆంధ్రేతిహాసం. మార్గ సంప్రదాయానికి చెందిన మహాపురాణ లక్షణాలు ఈ కృతికి వర్తించవు. పంచలక్షణ సూత్రం, దశలక్షణ సూత్రం ఈ కృతిని సమన్వయించటానికి పనికి రావు. ఉప పురాణ నిర్మాణ వైఖరి కూడ దీని కంత అనువైనది కాదు. అయితే ఉప పురాణాలను, పురాణ ఖండాలను కావ్యాలుగా తీర్చిదిద్దిన ప్రాచీన కవుల నిర్మాణ శిల్పం ఈ పురాణ రచనకు పరోక్షంగా స్ఫూర్తిని కలిగించి ఉండవచ్చును. అయినా అట్టి కావ్యస్పృహ ఇందులో సర్వత్ర వర్తించిందని చెప్పలేము. అయితే పురాణలక్షణాల్లో ఒకటైన వంశానుచరితాన్ని ఇతిహాసంగా నిర్మించే ప్రక్రియ సంస్కృతంలో ప్రాచుర్యాన్ని వహించింది. రఘువంశాదు లామార్గంలో నడిచినా కావ్య లక్షణాలను తమలో పండించుకొన్నాయి. పురాణంలో ఏకదేశమైన ఇతిహాసం కూడా పురాణశబ్ద వాచ్యం కావచ్చునని మధునాపంతులవారు భావించటం గమనింపదగింది. ఆంధ్ర

పురాణ నిర్మాణంలోని అంతస్సూత్రం ఈ లక్షణంలో ఉన్నదని భావించటం ఉచితం. సూర్య చంద్రవంశ రాజుల చరిత్రలో వైదికధర్మ మార్గాచరణాన్ని పాటించిన ప్రభువుల చరిత్రను ఒక సమన్వయ సూత్రంతో కాలక్రమంగా నిబంధించటం అటువంటి రచనకు ఆయుస్సూత్రం. దానిని ఆంధ్రజాతిని రూపు దిద్దిన ఆంధ్ర ప్రభువుల పరంపరకు అన్వయించి చిత్రించిన వైఖరి ఆంధ్ర పురాణంలో కనపడటం చేత పురాణశబ్దం దానికి అన్వర్థమౌతుంది. ఆంధ్ర పురాణావతారికలోని కవిగారి మాటలు ఇందుకు సాక్ష్యాలు-

''ఒకనాటి బ్రహ్మముహూర్తమునం దొలినాటి తెలుగువారి చరిత్ర సారంబు నవపర్వపరిమితంబుగా వింగడించుకొని 'యాంధ్రపురాణ' కావ్య రచనకుం గడంగినాడ; సర్గప్రతిసర్గాది పంచలక్షణ లక్షితము కాక, త్రిలింగ రాజవంశ్యానుచరిత ప్రధానమై యుదయ, సాతవాహన, చాళుక్య, కాకతీయ, పునఃప్రతిష్ఠా, విద్యానగర, శ్రీకృష్ణదేవరాయ, విజయ, నాయకరాజ సమాహ్వయంబులగు నవపర్వంబులతో సంభృతమైన యేతత్కృతి'' - అని మధునా పంతుల వారన్నప్పుడు ఇది వంశ్యానుచరిత వర్ణనరూపమైన పురాణమని, స్వభావంచేత కావ్యమని, కావున పురాణకావ్య విశ్వరూపమని భావించటానికి వీలుపడుతున్నది.

ఇది ఇలా ఉండగా విమర్శకులు ఆంధ్రపురాణాన్ని చారిత్రక కావ్యాలలో నొక శాఖకు చెందిన దానిగా వివేచిస్తూ వచ్చారు. శ్రీ పి. శివరామశర్మ ఆధునిక చారిత్రక కావ్యాలను మూడు విధాలుగా వింగడించి వివేచించాడు. అవి (1) చారిత్రక వస్తుకావ్యం (2) చారిత్రక రసకావ్యము (3) చారిత్రక తత్త్వకావ్యం. చారిత్రక వస్తుకావ్యం జీవిత చరిత్రాత్మకమనీ, ఆంధ్రదేశ చరిత్రాత్మకమనీ మరల రెండు విధాలుగా వింగడించాడు. వాటిలో రెండవ రకానికి ఆంధ్రపురాణం చెందుతుందని పేర్కొన్నాడు. శర్మగారి మాటల్లో ''ఆంధ్రదేశ చరిత్రాత్మక కావ్యాల్లో ప్రసిద్ధమైనవి ఆంధ్రపురాణము, ఆంధ్ర సామ్రాజ్యము. ఆంధ్రుల చరిత్రను పద్యాల్లో వ్రాశారు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఇక ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన ఇతిహాస కావ్యమని చెప్పదగింది 'ఆంధ్ర పురాణము.' ఇందుదయపర్వం మొదలు నాయకరాజపర్వం వరకు గల తొమ్మిది పర్వాల్లో ఆంధ్రులచరిత్ర వర్ణింపబడింది. సంప్రదాయానుయాయియగు ఈ కవి విశ్వనాథ ఆంధ్రప్రశస్తి వస్త్వాశ్రయఖండకావ్య ప్రయోగా న్ననుసరించి మనో

త్వరగా పిలిపించెద''నంచు వాకొనెన్. తరువాత శ్రీనాథుడొంటి మిట్ట కరిగి పోతనను దర్శించి యతనినే శిథిలభాగ పూరణమొనరింపుమని కోరెను. పోతన శ్రీరామునాజ్ఞలేనిదే కృతి రచించుట తనవలన గాదని పల్కి, తానొకప్పుడు భాగవతము రచించు భాగ్యమబ్బెనని సంతసించుతఱి శిష్యులు తన్ను సమీపించి 'ఓ గురువరేణ్య! ఆ యదృష్టము మా బోంట్లకబ్బునె యన' దాను దైవకృపా విశేషమున దప్పక వారికి కూడనట్టి భాగ్యమబ్బునని పల్కియుండెననియు నది యట్లే య్యెననియు దెల్పి యానందించెను, అందుచే శిథిల భాగములను నారయాదులే పూరించుట తటస్థించెను. 'శిథిల భాగములను మరల నెవ్వరో పూరింపనేల ? ఏకసంథాగ్రాహియైన పోతనయే యా భాగములను స్మృతి ననుసరించి మరల వ్రాయలేక పోయెనా' యన్న దాని కారంభముననే కవిగారొక కారణమును సూచించియున్నారు. చిదానందయోగి పోతనకు శ్రీరామ మంత్రముతో పాటు శారదా మంత్రమునుకూడ నుపదేశించి దానిని బ్రహ్మచర్య వ్రతముతో పంద్రెండేండ్లు జపింపవలెననియు నట్లు చేసినచో నతడు కావ్యాదులను పఠించునప్పుడు వాణి వీణాపాణియై యాతనియందు వసించుననియు, నెట్టి గ్రంథమునైన నొకసారి చూచినంతనే యది నోటికి వచ్చుననియు, బ్రహ్మచర్య వ్రతదీక్షకు విఘ్నము వాటిల్లినచో 'కావ్యకల్ప నాధారమొక్కటియె దక్కి ధారణాశక్తి తరలిపోవు' ననియు నెఱింగించెను. పోతన వివాహమాడిన పిమ్మట గూడ బదకొండేండ్లు బ్రహ్మచర్య వ్రతదీక్ష నిర్విఘ్నముగా సాగించెను. కాని పంద్రెండవ యేట దల్లిదండ్రులు తీర్థాటనమున కరిగిన సందర్భమున దానికి భంగము వాటిల్లెను. అది కారణముగా చిదానందయోగి చెప్పినట్లాతనికి కావ్య కల్పనాధార యొక్కటియే మిగులుటయు ధారణాశక్తి తరలి పోవుటయు సంభవించెను. పోతన శిథిలిత భాగములను జ్ఞాపకము చేసికొని మరల వ్రాయ లేమి కిదియే హేతువు మఱియు శిష్యులకు గూడ భాగవత రచనా భాగ్యమబ్బునని యాతడాశీర్వదించి యుండెను. సిద్ధ వాక్సంపన్నుడైన యాతని యాశీస్సునకు వైఫల్యము చేకూరునా?

శ్రీనాథ పోతన లిరువురు నొకేయుగమునకు చెందిన వారనుట యెల్లరకు సమ్మతమే కాని వారిరువును సమకాలముననే జీవించిరని చెప్పుటకు చారిత్ర కాధారములు లేవు. మరియు శ్రీనాధుడు తన కవితా పాండితీ శౌండీర్యముచే సర్వజ్ఞసింగమనీని గూడ మెప్పించెననుట కాధారములున్నవి కాని యాతనికొల్వు

ననే యాస్థాన కవిగా నుండెననుటకు సాక్ష్యములేదు. బహుశః శ్రీనాథుని వార్ధ క్యమున పోతన యువకుడై యుండవచ్చును. వారిరువురికిని బాంధవ్యముండెనను విషయముకూడ సందేహాస్పదమే కాని లోకమునందట్టి కథలు ప్రచారములో నున్నవి. శ్రీమదాచార్యుల వారీ కావ్యమున వారి సమకాలికత్వమును బాంధ వ్యమును కూడ ప్రకటించి యుండిరి. శ్రీనాథుని చెల్లెలు పోతన భార్య. శ్రీనాథుని కూతురు శారద పోతన కుమారుడైన మల్లన భార్య. ఈ రెండు తెఱగులబాంధ వ్యము కావ్యమున యథోచితముగా వర్ణింపబడినది.

పోతన భాగవతము రచించిన పిమ్మట నాతని శిష్యులు శారద లేఖను శ్రీనాథుని కిచ్చుటకరిగి సింగ భూపాలుని కొల్వులో గురువుగారి భాగవతము నందలి కొన్ని పద్యములు విన్పించిరి. శ్రీనాథ సింగ భూపాలు లిరువును వానిని విని యపారానందము చెందిరి. సింగ భూపాలునికా కావ్యము నంకితము గాగొన వలెనని కోరిక పుట్టెను. సేనా సహితుడై యరిగిన సేనాపతి వరాహ విఘ్నిత ప్రయత్నుడై తిరిగి వచ్చెను. తరువాత శ్రీనాథుడే స్వయముగా పోతన కడ కరుదెంచి పలువిధముల బోధించెను. కాని పోతన మనస్సున మార్పు కలుగ లేదు. వారిరువురును తిప్పన్నను దర్శించుటకై యోరుగంటి కరుదెంచిరి. కర్ణాట భూపతి భాగవత కృతి తనకీయ వేడుచు నుత్తరము పంపించెను. శ్రీనాథుడు తిప్పనకు దానువచ్చిన పని తెల్పి యది నెఱవేరినగాని భోజనము చేయనని పట్టు పట్టెను. తిప్పన చేయునదిలేక కృతిని కర్ణాట భూపాలున కిమ్మని పోతనతో చెప్పెను. పోతన్న యన్నయానతి మీఱజాలక యందు కంగీకరించెను. ప్రయత్న ములు జరుగుచుండెను. పోతనకు మెట్టుగుధరమున సరస్వతి విలపించుచు దర్శనమిచ్చెను. పోతన 'కర్ణాట కిరాట కీచకులకమ్మ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ'! యని వాగ్దాన మొనరించి యామె నోదార్చెను. లోకమున సింగ భూపాలుని వృత్తాంతమున కున్నంత ప్రచారమా కర్ణాట రాజ వృత్తాంతమునకు లేదు.

పోతన పరోపకార తత్పరతను భగవంతుని భక్త పరాధీనతను ప్రదర్శిం చుటకై కవిగారీ కావ్యమున గొన్ని రమణీయములైన సన్నివేశములను గల్పించి యున్నారు. పోతన కవితా లేఖనమొనర్చి యన్నకు వినిపింప గృహోన్ముఖుండ గుచు మార్గ మధ్యమున నిరుపేదయగు నొక జవరాలిని ఆమె భర్తను గాంచి వారి కష్టములు విచారించి వారికి బత్తెమిచ్చి పంపుట, పోచయ్య యను కాపు పోతనను జంపదలచి చెఱువుకడకరిగి సర్పద్రష్టుడై నేలగూల పోతన విరోధియని

భావింపక పసరుపిండి యతని జీవింపజేయుట, ధాన్యము బదులుకొని వచ్చుటకై పోతన గ్రామములోనికేగుచు గోమటి యొక భిక్షకుని గొట్టబోవ నడ్డముగా నరిగి క్షతగాత్రుడయ్యు విస్మృతిగొన్న యా భిక్షుకునికి బరిచర్య లొనర్చుట మున్నగునవి పోతన త్యాగ శీలతకును పరోపకార పరాయణతకును దార్కాణములు. ఆ భిక్షుకుడు కృతజ్ఞతా పూర్వకముగా పోతన కొక గంటమునిచ్చి తరువాత చీకటిలో బయట కరుదెంచి యదృశ్యుడయ్యెను. పిమ్మట శ్రీరాముడే యట్లువచ్చి యా గంటమును తన కర్పించెనని పోతన యెఱింగెను. ఆ గంటముతోనే పోతన శ్రీమద్భాగవతమును లిఖించెను. పోతన 'అల వైకుంఠ పురంబులో...' అను పద్యమును ముగింపకయే యట్లుంచి పల్లెకేగ శ్రీరాముడు రామశర్మయను బ్రాహ్మణుని వేషమున పోతన యింటికి అతిధిగా వచ్చి యా పద్యమును పూరించెను. సింగ భూపాలుని సేనాని భాగవత గ్రంథము నపహరించుకొని పోవుచుండ రాముడే వరాహ రూపమున రాజ భటులతో బోరి గ్రంథము మరల బోతనకు దక్కునట్లొనర్చెను. గోదావరీ తీరమున పోతన రామధ్యాన నిష్ఠా గరిష్ఠుడైయుండ శ్రీ రాముడాతనికి సాక్షాత్కరించి, యాంధ్ర భాగవతమును తన కంకితము చేయుమని యడిగియుండెను. ఇంకను బెక్కు క్లిష్ట పరిస్థితులలో రాముడాతనికి దోడ్పడి క్లేశమును బాపియుండెను. ఇవన్నియు శ్రీ రామచంద్రుని భక్త రక్షణ పరాధీనతకు దార్కాణములు.

పోతన శ్రీనాధులను గూర్చి లోకమున ప్రచారముననున్న కొన్ని యతిలోక విషయములను కూడ కవిగారిందు జొప్పించి యున్నారు. బోయీలు లేకుండనే శ్రీనాధుని పల్లకి నడచుటయు నెద్దు లేకుండనే మల్లన హలము సాగిపోవుటయు నిట్టివాని కుదాహరణములు. రుక్మిణీ కల్యాణ సందర్భమున 'బాలకమరె నని పోతన వ్రాయగనే ఆతని కూతురు కుంపటిలోబడి కమరుటయు "నెలత యౌవనంబు నిండివెల్గె" నను వాక్యము వ్రాయగనే యామె తెలివిగొని పల్కుటయు పోతన ఋషితుల్యతను సిద్ధ వాక్సంపన్నతను జెప్పక చెప్పుచున్నవి. శ్రీనాధుడు పోతనతో వర నిశ్చయమునకు బహుసహస్ర ప్రమితులైన రాజపరివార జనులతో వచ్చినట్లుతెల్పి పోతన వారికి దగినట్లు విందు చేయుట యెట్లని కుందుచుండ జ్యోతిపుర రాజ్ఞి వచ్చి సహస్ర భోజనమునకై భోజ్య పదార్థముల సమకూర్చుటకూడ దైవప్రేరిత కార్యమే. శ్రీ నాధుడు భాగవత కృతిని సింగ భూపాలుని కిప్పింప నెంచి బమ్మెర కరుదెంచుచు నుద్యాన వనమున విడిసినప్పుడొక యువతి యాతని

కడకరుదెంచి పోతన నర కృతి యొసంగడని నిర్ధారణ మొనరించి చెప్పి యాతని వ్రేలికి రత్నాంగుళీయకము నర్పించిన వృత్తాంతమున్నది. ఈయువతి శ్రీనాధునితో జెప్పినట్లు జంగమ మఠపతి కూతురుకాదు. ఆమె సాక్షాచ్ఛారదయే ఈ వృత్తాంతము ముందు చెప్పబోవు కథాంశమునకు సూచనగా నీ కావ్యమున జేర్పబడినది.

భాగవతమునందలి గజేంద్ర మోక్షములోని 'సిరికిం జెప్పడ'ను పద్యమును విని శ్రీనాధు డాక్షేపించుటయు, పోతన శ్రీనాధుడు భోజనము చేయుచుండగా రాయి నూత విసిరి యాతని బిడ్డ నూతఁబడెనని కేకవేయ శ్రీనాధుడు చేయి కడుగుకొనకుండగనే నూతి దగ్గరకుఁ బరుగెత్తుకొని వచ్చుటయు, పోతన యప్పుడు సత్యము తెల్పి తన పద్యమును సమర్థించుకొనుటయు లోకమున ప్రచారమునందున్న కథలోని విశేషములు. శ్రీ మదాచార్యుల వారష్టమాశ్వాసమున నీవృత్తాంతము నించుక మార్పుతో రమ్యముగా వర్ణించినారు. శారద పూల మొక్కలకు నీరు తోడుచుండగా త్రాడు తెగి చేద నూతిలో బడెననియు, శారదయే పడిపోయెనని శ్రీనాధు డన్నము తినుచున్న చేతితోనే నూతి కడకుఁ బరువెత్తుకొని వచ్చెననియు వారు కల్పించినారు. తన పద్యమునందు యౌచిత్యమును సమర్థించుకొనుటకై యిందు కృత్రిమముగా నేమియుఁ జేయవలసిన యక్కఱ పోతనకు లేకపోయినది సహజముగా సంఘటిల్లిన సన్నివేశమే యాతని కట్టి యవకాశ మొసంగినది. లోకమునఁ బ్రచారమునందున్న కథకంటె గావ్యమునందలి కథ యెక్కువ నిసర్గ సుందరముగా నున్నది.

శ్రీ వరదాచార్యులవారు పోతనను గూర్చి లభ్యమైన కథాంశముల నన్నిటిని సేకరించుకొని వానిని బూర్వాపర సందర్భము చెడకుండు నట్లుగను, గావ్యోచితములైన వర్ణనల కానుకూల్యము కల్గునట్లుగను సమకూర్చుకొని కథను విస్తరింపఁజేసినారు. సుందర వర్ణన శోభితమై కావ్యమునం దాదినుండి తుదివఱకు బ్రధాన కథ సాగిపోయినది. కథా కథనమునందును వస్తు విస్తరణమునందును వారు ప్రదర్శించిన కౌశలమున కివి తార్కాణము. నిజమునకు పోతన కావ్యము దశమాశ్వాసముతోనే ముగిసిపోయినది. అయ్యును వారు మఱి రెండు ఆశ్వాసములను జేర్చి పోతనచే నాశువుగా నొంటిమిట్ట రఘునాధునకు మోహిని నృసింహ వరాహావతార గాథలను గజేంద్ర మోక్షణ కృష్ణావతార రుక్మిణీ కల్యాణ వృత్తాంతములను జెప్పినారు. ప్రతి కథ యారంభమునను "స్వామి!

ప్రహ్లాద బాధలడచి హిరణ్యకశిపు నంతమొందింప స్తంభోద్భవుండవై వెలసితి వీవకాదె. నేడును మత్కృతి ప్రహ్లాదుంగా పాడుమని నిన్ బాడుదు'' నను విధముగాఁదన కథకును దానికి నొక సంబంధము సమకూర్చినారు. శ్రీమద్భాగవతమునఁ బండ్రెండు స్కంధములున్నవి. ఈ తుది రెండాశ్వాసములతో పోతన చరిత్రయుఁ బండ్రెండాశ్వాసముల కావ్యమై భాగవత తుల్యమైనది. ఈ కథలను చెప్పుటలో శ్రీ మదాచార్యుల వారు భాగవత కథా విధానమునే యనుసరించినను కథన శిల్పమున నప్రతిమానమైన కౌశలము ప్రదర్శించినారు. కథలో, తత్త్వములో పద్యముల నడకలో, భావ సంపదలో నవి భాగవతము నందలి కథల కెందును దీసిపోవు. కావ్యైక దృష్టితోఁ జూచినచో నవి యనావశ్యకము లనిపించినను గథా కథన దృష్టితో జూచినచో నద్భుతావహములై యలరారును.

కథా కథనమున శ్రీ మదాచార్యులవారు ప్రదర్శించిన నైపుణ్యమును వివరించుటకై కావ్యమునందలి యొక్క సన్నివేశమును మాత్ర ముదాహరింతును. ఇది తృతీయాశ్వాసము నందున్నది. చిదానంద యోగి యుపదేశము ననుసరించి వివాహితుడయ్యును పోతన నిగ్రహ చిత్తుడై కాలము పుచ్చుచుండెను. అతని తల్లిదండ్రులా తరుణ దంపతుల నింటనుంచి తీర్థయాత్రల కరిగిరి. చేలు కోయవలసిన యదనరుదెంచెను. పోతన భార్యతో గూడ వన భోజనమునకై వెడలి చేల కోత యారంభింపఁజేసెను. ఆకసము మేఘావృతమయ్యెను. పోతన భార్య వంటకములను దుర్గకు నివేదింపఁజని దుర్గాస్తవ మొనర్చెను. వర్షము కురిసెను. ఆమె తడిసిన వస్త్రములతో భర్తను సమీపించి స్నానార్థమై తటాకమున కరిగెను. అప్పుడు పోతన యపూర్వమైన విరహ వేదన ననుభవించెను. భార్యవచ్చి యతనికి భోజనము పెట్టెను. పాలేరు తాను గాపలా కాయుటకై వచ్చి పోతన నింటికిఁ బంపెను. శరదృతు వరుదెంచెను. పోతనకు దపో భంగమాయెను. ఈ సన్నివేశమందలి కథా సంగ్రహమిది. విరక్త చిత్తుడు తపోనిష్ఠుడునైన పోతన రక్తచిత్తుడు భార్య సౌందర్య ముగ్ధుడునైన వృత్తాంత మిందత్యంత రసబంధురముగా వర్ణింపఁబడినది. ఒక్కొక్క సౌందర్య భంగిమ, ఒక్కొక్క మనోహర విన్యాసము - ఎంతటి దృఢచిత్తులనైనఁ బరవశుల నొనరించును గాఁబోలును. ఇచ్చటి కథా కథనము, సన్నివేశాది వర్ణనము పింగళి సూరనార్యుని సుగాత్రీ శాలీనుల కథా విధానమందలి సౌందర్య సంపదను

బుడికి పుచ్చుకొన్నది. విస్తర భీతిచే నింతకంటె కవిగారి కథాకథన శిల్పమును గూర్చి యెక్కువగాఁ జెప్పలేక పోవుచున్నాను.

ఈ కావ్యమున సముద్రము, ద్యూతము మున్నగు నేరెండు మూడో తప్ప మిగిలిన యష్టాదశ వర్ణనములును ప్రసక్తానుప్రసక్తముగా ప్రవేశ పెట్టఁబడినవి. ఈ వర్ణన లన్నియు శ్రీ మదాచార్యుల వారి ప్రకృతి పరిశీలనమును, భావనా శక్తిని పూర్వ మహాకవి కావ్య పరిచయమును వ్యక్తము చేయుచున్నవి. కావ్యారంభముననే బమ్మెర గ్రామ వర్ణనమున్నది. అచ్చట పెంకుటిండ్లతోపాటు పూరి గుడిసెలుకూడ నున్నవి పెంకుటిండ్లు పెంకు చాళ్ళదల ధరించి యుండు టచే సంసృతి భారమెంచి బాధదనరు పెన్గుటుంబుల వలెను, బూరియిండ్లెద నాశవీడినచో నీ బరువే తృణతుల్యమౌనని చెప్పునట్లుగను గోచరించు చున్నవట. శ్రీనాథ పోతనలను ప్రధానముగా వర్ణించు నీ కావ్యమునఁ బైభావమెంతో సుంద రముగా నున్నది. కుటీరములపై నున్న గుమ్మడిపాదులు, గుడిసెల వెనుకనున్న పిడుకగూండ్లు, కుటీర శిఖరము నెక్కికూయు కుక్కుటములు, కర్షక శ్రమబిందు ఘనతఁదెల్పు జొన్నచేలు కవిగారి నిశిత పరిశీలనమును చాటుచున్నవి. ఇవన్నియు గ్రామ వాతావరణమును బాఠకుల నెదుట నిల్పునట్టివి. ఇట్లే చతుర్థ సప్తమాశ్వాసములందలి రాచకొండ నగర వర్ణనమును దిలకించిన వైభవోపేత మైన పట్టణ సౌందర్యము కన్నులపండువొనరించును. నవమాశ్వాసమందలి సంక్రాంతి వర్ణనము సహజమై భారతీయ సంప్రదాయముల యందచందముల నత్యంత విశదముగా వ్యక్తము చేయుచున్నది.

"పండుగ యనధని భాగ్యము, పండుగదా పంచభక్ష్య పరమాన్నాప్తిన్
బండుగ యనరిక్తునిపని, పండుగదానాడు పస్తు పండుట ననియెన్."

అను పద్యము కవిగారికి బీదల యెడఁగల సానుభూతిని దెల్పుచున్నది. ద్వాదశాశ్వాసమున గజము విష్ణువును బ్రార్థించి ప్రార్థించి, యింక నాతడు వచ్చి రక్షించుట కల్లయని భావించి -

"పిలిచిన బలుకరు, కాంచన్ వలనుపడదు, చనగరాదు వద్దకు లక్ష్మీ
లలనాధీశు లభాగ్యుల; దిలకించెద రొక్కొవారి తీరిది వేతే"

యని గుండెరాయి చేసికొనెను. ఇందు 'లక్ష్మీ లలనాధీశు' లైన ధనికు లభాగ్యుల యెడ వర్తించు విధము లెస్సగా సూచింపఁబడినది. పంచమాశ్వాసమున కవిగారు తెలుగునాటి జాహ్నవియైన గోదావరిని వర్ణించిరి. పోతన సింగ భూపాలుని కొలు

వున భోగినిని వర్ణించుచు దండకము రచించెను. అందుచే నాతడు తన రసన పంకకళంకితయై పోయెనని భావించి మరల నది పూతయౌటకై గోదావరీ వర్ణనము గావించెను.

"శ్రీశుపద సరోజమ్మంటి చిలుకు తేనె
నీశుపృధు శిరోజములైన యెఱుపుతేంట్లు
తెచ్చి తెట్టెగా నిడికొనఁజెరువరియయి
కాచిపోసె భగీరథ ఘన తపోగ్ని."

అను పద్యము గోదావరి పవిత్రతను, మధుమధురవారి పరిపూర్ణతను, భాగీరథీత్వమును మనోహరముగా ప్రకటించుచున్నది.

కలశపాథోరాశి క్రాగుపొంగును ద్రోసి
యురికివచ్చిన పాల నురువువేమొ,
వీరరుద్రుని కాలి విలయ తాండవకేళి
వంతుబాడిన వీణెతంతు వేమొ,
దురితాసురుల ద్రుంప శర పరంపర ముంప
నాట్యమాడెడి వీరనారి వేమొ,
గాలితోఁ బందెమ్ము గట్టి మ్రింగభృశమ్ము
పగబట్టి చను త్రాచుపాము వేమొ,

కరగిపోసిన రజత నగమ్ము వేమొ
యభ్రగతివీడు విద్యుల్లతాంగి వేమొ
పవనహతిఁదూలు హరుమల్లు పాగ వేమొ
భూమిజన కల్పవల్లి; గంగామ తల్లి ! (5-45)

అను పద్యమున కవిగారు కురియించిన యుత్ప్రేక్షలు వారి కానదీమ తల్లిపై గల భక్తి భావమును లెస్సగా వ్యక్తము చేయుచున్నది. పంచమాశ్వాసమునందలి "తెగమాసి పిట్ట గూడగు తలంగల చింపి గొఁగడిలో శని గూరుచుండ" నను సీస పద్యము కట్ట గుడ్డలేక తిన తిండిలేక దైన్యము మూర్తీభవించినట్లున్న యా ముసలి భిక్షువును బతితల యెదుట సాక్షాత్కరింపఁజేయుచున్నది. ఇట్లే వేసవి, వసంతము, శరత్తు, సంధ్యాకాలము, చంద్రుడు, ప్రాతఃకాలము, గుడులందలి శిల్పములు, సస్యసంపద మున్నగు వానిని వర్ణించుటలో కవిగారు ప్రద

ర్శించిన నేర్పు శ్లాఘాపాత్రముగా నున్నది. గ్రామీణ సౌందర్య సంపదను వర్ణిం చుటలో వారికిఁగల యభిమాన మీ కావ్యమునఁ బెక్కుచోట్ల కానవచ్చుచున్నది. పోతరాజు విరక్తుడై తీర్థయాత్రలకేగిన సందర్భమున వారు వైష్ణవ క్షేత్రము లను, అందలి దైవములను దనివితీర వర్ణించినారు. అట్లని వారు శివుని మాట పూర్తిగా విస్మరించిన వీర వైష్ణవులుకారు. సందర్భము కలిగినప్పుడు వారు విష్ణువును వలెనే శివుని కూడ భక్తిభావ సంభరితముగా వర్ణించినారు.

ఈ కావ్యమునందలి వర్ణనలలోని కెల్ల ముఖ్యముగాఁ బేర్కొన దగినది భోగిని నాట్య వర్ణనము. ఈ వర్ణన సందర్భమున కవి గారు తమ కాకళయందు గల యభిమానమును బాండిత్యమును సర్వతోముఖముగా వ్యక్తము చేసినారు. ఆ భాగము చదువుచున్నప్పుడు పఠితలకు సంగీత నాట్య విశారదయైన యొక నాట్యకర్త్రి మనోహరముగా నెదుట నాట్యము చేయుచున్నట్లు స్ఫురించును. భోగిని ప్రదర్శించిన వివిధ ముద్రలను, వివిధ భావస్ఫోరకములైన నాట్య విన్యాసములను ఒయ్యారములను గవిగారు విశదముగా వర్ణించియున్నారు. ''పవన డోలికల జంపాల లూగుచు సరస్వతినాడు కెరటాల సౌరుదోచ'' అను సీసమున వారామె నాట్యము చేయుచు నెన్నియెన్ని యందముల నెట్టి యెట్టి యొడుపులఁ బ్రదర్శించెనో సూచించియున్నారు. వారు చెప్పినట్లామె నాట్యము చేయుచుండగా-

''అందము చిందులు ద్రొక్కెను, విందగు జవ్వనము
భువన విజయమొనర్చెన్
కుందనమున జీవము, జెందామరలు ఉకులాడె చెలి నృత్యములన్.''

భోగిని సరసుడైన సింగనృపాలుని హృదయమునఁ బ్రేమించెను. ఆ విరహతాప మామె చిత్తమున నిండారి యున్నది. అందుచే నామె రాధా విరహ మును బ్రదర్శించునప్పు డెక్కువ ప్రయత్నము చేయవలసిన యక్కఱ లేక పోయెను. అప్పుడా భావ విన్యాసాదులన్నియు నామెకు సహజ సిద్ధములై యుండెను. అందుచే కవిగారు-

''నటన నిజమొనర్చి నాతి కృష్ణుని విరహంపు రాధపాత్ర నభినయించె
నాటవెలది యొక్క యసమాన ప్రతిభకు మురిసిపోయి
రాజు ముగ్ధుఁడయ్యె.''

నని వ్రాసియుండిరి. పైని రాధా విరహ నాట్యాభినయ మంతయు పది యాట వెలది పద్యములలో వర్ణింపబడినది. ఇచ్చట 'నాటవెలది' శబ్ద ప్రయోగము చమత్కార శోభితమై యున్నది. రాజా యాట వెలది ప్రతిభ కెంత మురిసి ముగ్ధుడయ్యెనో చదువరులు కవిగారిచ్చట రమ్యాతిరమ్యముగా రచించిన యాట వెలది పద్యముల ప్రతిభ కంతగా మురిసి ముగ్ధులై పోవుదురు. పోతన భోగినీ నాట్యమును జూచి-

"భోగ మింట్లలోపల నీమె పుట్టవలసినదియె కాదు శ్రీ హరిభక్తి
నటన యందు
దాఁగరగి యేడ్చి యేడ్పించెఁదక్క నరులఁ వ్రాయ దండకమగు
నీమె వర్తనమని"

యనుకొనెను. ఇచ్చట దండకమగుననగా విస్తృత మగునని సాధారణార్థము. ఇది 'యావిషయము చెప్పినచో భారతమగు' నని లోకమున ననుట వంటిది. కాని తరువాత పోతన దాని నాట్య సౌందర్యమును వర్ణించుచు నిజముగా నొక దండకమే రచించెను. అది విని సభలోని వారందఱును ముగ్ధులై తలలూపిరి. పై పద్యమునందలి దండక శబ్ద ప్రయోగము కూడ పూర్వపు ఆట వెలది శబ్ద ప్రయోగమువలెఁ జమత్కార శోభితమై యున్నది.

రసపోషణమున శ్రీ వరదాచార్యుల వారారితేరినవారు. ఈ కావ్యమున పలు ఘట్టములందు భక్తిరసము చక్కగా పోషింపఁబడినది. పోతనకు వలె శ్రీమదాచార్యుల వారికిని భక్తి యాజన్మ సిద్ధమైనది. షష్ఠాశ్వాసమున వారు భక్తిని వివిధరీతుల నిర్వచించి యున్నారు. "శౌరి రూపశీల సమితి నవిచ్ఛిన్న తైలధార వంటి తఁపు భక్తి - ముక్తికాంత భోగమునకు సర్వస్వము త్యాగ మొసగు ప్రేమ ధనము భక్తి" యనునవి వారొసగిన రెండు నిర్వచనములు. రామశర్మ వచ్చి పద్యమును బూరించి యేగెనని విన్నపిమ్మట పోతన్న యాతడు శ్రీరాముడేయని యెఱింగి వెల్వరించిన భావములు భక్తిరస బంధురమ్ములై యున్నవి. దివ్యక్షేత్రములను సందర్శించు సందర్భమునను ఒంటి మిట్టలో శ్రీ రఘునాధుని దర్శించునప్పుడును పోతన భక్తిరస ప్రవాహమున నోలలాడి యున్నాడు. తృతీయాశ్వాసమున పోతన తపోభంగమైన సన్నివేశము శృంగార రసమునకు రంగము. కవిగా రచ్చట పోతన దంపతుల సౌఖ్యవసంత వీధీ

విహారమును లలిత మధురముగా వర్ణించి యున్నారు. అప్పుడు వారు దేశ కాలస్థితు లెఱుంగక తనువు లుండియు లేనటులైన యపూర్వ సమాధి యోగము ననుభవించిరి. శ్రీనాథుడు భార్య మరణించిన పిమ్మట దన కూతురు శారదను బమ్మెరకుఁ గొనివచ్చి చొప్పడిన లొజ్జు దనమునఁ దప్పుకొనన్ లేక కంట తడి నిడి పలికిన పలుకు లందును (III-310-321) రాచకొండలో నున్నతటి తల్లి మరణవార్త విన్న సందర్భముందును, సప్తమాశ్వాసమున తండ్రి తన్నుఁజూచు టకు రాలేదని శారద యేడ్చు సందర్భమందును గరుణ రసము వెల్లివిరియు చున్నది. అందును పోతన తల్లి మరణమునకై విలపించిన సన్నివేశము రాతి గుండెలను కూడ కరగించునట్టిది. "ఆ నిశిన్ విధిలేక యాగెనొక్కెడ గాని తల్లికై మనమందుఁ దల్లడిల్లు" అను పద్యము పోతన తల్లి మరణమునకు సూచనగా నున్నది. శ్రీనాథుడు పోతన కశ్వయానము సమకూర్పవలెనని సింగ భూపాలునితోఁ జెప్పగా నాతడన్న యధిక్షేప వాక్యములు పరమ శాంతుడైన పోతన్నను గూడ రౌద్రమూర్తిని గావించినవి. సింగ నరపతి సేనలకును ఒంటరి వీరునకును, వరాహమునకును జరిగిన పోరాటము సందర్భముననను, కన్నడ రాయల సేనలకును, సింగ భూపాలుని సేనలకును, మెట్టుగిరి వద్ద జరిగిన సంఘర్షణము సందర్భముననను వీర రౌద్ర భయానక రసములు స్ఫురించు చున్నవి. శ్రీమదాచార్యుల వారే రసమును వర్ణింపఁదలచినను దానికిఁదగిన విభావానుభావాదుల వర్ణించి పఠితలకు రసానందానుభూతి చూఱ యిచ్చుచుందురు.

ఈ కావ్యమునందలి పాత్రలను సుస్పష్టరేఖలతోఁ దీర్చి దిద్దుటలో శ్రీమదాచార్యులవారు చూపిన నేర్పు ప్రశంసా పాత్రమైనది. పోతన భక్తి వినయములను, పితృ మాతృ భ్రాతృ భక్తిని, పరోపకార పరాయణతను, వైరాగ్యమును వారు చక్కగా వర్ణించియున్నారు. "నా తల్లి మేన్జవ్వనంపు గ్రొంజిగి చాయ చిగిరించె నా కాలుసేతులందు......నాకేదేన్ రోగపున్నీడ సోక నాపె నగుమొగము చంద్రునకు గ్రహణము పట్టు" నను పద్యమాతని మాతృ భక్తి కక్షరమూర్తి. పోతన భార్య యతనికి తగిన యిల్లాలు. ఆమె పాతివ్రత్యము, అతిథి సేవాతత్పరత అప్రతిమానములైనవి. ఆమె పూర్వ జన్మమున రతియే అయినను కావ్యమున మాత్రము సతిగానే గోచరించును. లక్ష్మి, మల్లన ఆ పవిత్ర దంపతుల గుణగణము లన్నియుఁ బుడికి బుచ్చుకొన్న వారు. శ్రీనాథుడు రక్త చిత్తుడు; భోగ తత్పరుడు. రాజసేవ వలన గల్గు

కీర్తి సౌఖ్యములనే కాని నైచ్యావమానముల నాతడు పాటింపడు. అతడు శారదను జాలకాలము వఱకు జూడరామికి హృదయలోపము కారణము కాదు. శారదను బమ్మెరలో నుంచుటకై వచ్చినప్పు డాతడు పల్కిన పల్కులు వాత్సల్య నిధానములు. శారదకు పోతన యింటివారి సాహచర్యముచే వారి గుణములన్నియు వచ్చినది. కాని యామె సహజమైన రజస్సత్త్వము నడంచు కొనలేక తండ్రికి తీవ్ర భావములతోఁ గూడిన యుత్తరము వ్రాసినది. తిప్పన సోదరప్రేమ యపారము. సింగభూపాలుడు సర్వజ్ఞ చక్రవర్తియే కాక రసజ్ఞ చక్రవర్తి కూడను. భోగిని వంటి కళాసౌందర్యసేవధి తనంతఁ దానతని వలచుటయే యాతని సరసత్వమునకుఁ దార్కాణ. కవిత్వమన్నను గవులన్నను ఇతనికిఁగల యభిమాన మవధి యెఱుంగనిది. పోతనను దన యాస్థానము నందలి కవుల కధ్యక్షుడుగా నుండుమని యితడు వేడినప్పుడాతడు—

"ఈ కవీంద్రుడజన్మ మీశ్వరునికెతక్క, నొరులకెప్డు చేతులొగ్గి యడుగ
దాడుబిడ్డ దేహ మమ్ముకతినునట్లు కృతుల నమ్ముకొనుటె బ్రతుకుతెరువు"

అని నిరసించుట యితనికి కోపకారణమయ్యెను. అందుచేతనే అతడు బమ్మెర వెళ్లుట కితడశ్వయానము నీయ నిరాకరించెను. మరల భాగవతమునందలి పద్యములు వినినప్పుడీతని మనసు మెత్తపడెను. భాగవత కృతి నందుటకై యీతడు వే విధములఁ బ్రయత్నించెను. కాని లాభము లేకపోయెను. రామదాసు మూలమున తానీషాకువలెఁ బోతన మూలమున నీతనికిని గలలోనైన శ్రీ రామ దర్శన భాగ్యమబ్బెను. ఇతడు పశ్చాత్తప్తుడై భాగవత శిథిలభాగ పూరణమునకు దగిన యత్నము లొనరించుటయే కాక ధనము కూడ నొసంగెను. ఇతడు కావ్యమునఁ జూపిన కాఠిన్యము తాత్కాలిక కోపజన్యమైనదే కాని స్థిరమైనది కాదు. నరాంకితమగునట్లు చేసి భాగవతము మోక్షప్రదత్వమునకు భంగము కలిగించుటకై జనించిన యింద్రుని కుండవలసినంత తీవ్రత యితనియందుఁ గానరాదు.

కవిగారు ప్రధాన పాత్రలఁ బోషించుటలో వలెనే యప్రధాన పాత్రలఁ బోషించుటలోను నమితమైన శ్రద్ధ ప్రదర్శించినవారు. ఇందుకుఁ బోతన సాయమును బొందిన పేద వనితయు, ఒంటరి వీరుడును, కోమటి సెట్టియు నిదర్శనములు. వీరి కావ్యమునఁ జూపిన కృతజ్ఞత సాటిలేనిది. ఆ పేద పైదలి తోలుకొని వచ్చిన పందులలోనిదే సింగ నృపతి సేనల నెదిరించిన

వరాహము. పాము కాటునకు గుఱియై చచ్చి పోతనచేఁ బునరుజ్జీవితుడైన కాపు కుమారుడే యీ యసహాయ వీరుడు. భిక్షుకుని దయ యింతయు లేక కొట్టిన కోమటి సెట్టి పోతన సంపర్కముచేఁ బరమ భక్తాగ్రేసరుడుగా మాఱినాడు. ఇక పోతన శిష్యులైన గంగయ సింగయ నారయలు గురుభక్తి సేవధులు. ఆ భక్తిచే గురువును మెప్పించి వారు భాగవత కావ్యకర్తృత్వమున భాగము పంచుకొన్నారు. కేవల భక్తియే కాక కవితా పటుత్వముగల దిట్టలుకూడ నగుటచే వారు సభలో శ్రీనాథ సింగభూపాలుర మెప్పించుటయు, భాగవతము నుచితరీతి పూరించి లోకమును మెప్పించుటయు జరిగినది.

ఇంక శ్రీమదాచార్యులవారి కవితా కౌశలము నరయవలయును. ఇంత మహా కావ్యమును రచింపవలెనని పూని దానిని నిర్విఘ్నముగాఁ బూర్తిచేయుటయే వారి 'మహాకవిత్వ'మునకు సాక్ష్యము. కావ్య మాద్యంతము ధారాశుద్ధి శోభితమై లలిత మధుర పద ప్రయోగ ప్రచురమై, ప్రసాదగుణ భూయిష్ఠమై, రసభావ బంధురమై చదివిన కొలంది చదువవలెనను నుత్కంఠను రేకెత్తించుచున్నది. కవిగారికి పూర్వాంధ్ర మహాకవులలో శ్రీనాథుడు, పోతన, భట్టుమూర్తి, చేమకూర వేంకటకవి మున్నగువారి కవిత్వమునెడ నభిమాన మధికమని తోచును. ఈ కావ్యమున శ్రీనాథుని పద్యములందలి ప్రౌఢ గంభీర గమనము, పోతన రచనయందలి మాధుర్య సౌష్ఠవములు, భట్టుమూర్తి కవిత్వమందలి ధ్వన్యలంకార సౌందర్యము, చేమకూర వేంకటకవి కవిత్వమందలి శబ్దాలంకార చమత్కారము పుష్కలముగా గోచరించును. ''ఎవ్వాని యానతి నేప్రొద్దు రవిబుధుల్ సరివేళ దప్పక సంచరింతురు'' వంటి సీసములు తిక్కనగారి ''ఎవ్వానివాకిట నిభమదపంకంబు రాజభూషణ రజోరాజినడగు'' నను సీసమును దలపునకు దెచ్చుచున్నవి. చివరి రెండాశ్వాసములలోని భాగవత కథా సంగ్రహములలోఁ బోతనగారి కవితాఛాయలు పెక్కుచోట్లఁగనవచ్చుచున్నవి.

''వైకుంఠుఁబొగడని వక్త్రమ్ము ఢక్కనానది దేవళమ్ములో నదమొనర్చు
హరిపూజనములేని హస్తంబు దర్వినానదియన్న పూర్ణహస్తాయుధమ్ము
విష్ణుభక్తియె లేని విబుధుండు పశువన్ననది మహాదేవు వాహనము సతము
కంజాక్షునకుఁగాని కాయంబు భస్త్రినానది రాగిఁగరగి దేవాకృతి నిడు
చక్కిచింతలేని జన్మబుద్బుదమన విష్ణుపాదవారి వెలయునదియు
శ్రీపుఁగనని కనులు శిఖిపింఛ నేత్రమ్ములనిన దేవసన్నిధినవి యలరు''
(X1-324)

''పద్మాక్షు దర్శనభాగ్యహీనములై కన్ను లంధవరాటకములుగావె
జగదీశ సత్కథా శ్రవణ దూరంబైన శ్రుతులు కోటర బిలాకృతులు గావె
యచ్యుత గుణ కీర్తనంబానని నాలుక ప్రేతాగ్ని కీలగాదె
వనమాలి నిర్మాల్యవరగంధ మెఱుగని నాస యుమ్మెతకనుప్రాసగాదె
విష్ణుపద పద్మ సేవనా విరహితమగు కరము ధరమొల్చునుప్పలికరము గాదె
పదమపదనాథ విషయ సద్భక్తిలేని మేను బడిశంపు టెరమ్రింగు మీనుగాదె''
(V-75)

''పరమ దయాళులై మకరిఁబట్టి వధింపగఁబంపె వేగశ్రీ
హరి కర భీషణోరగ ఫణాగ్రమణి ప్రభలీను చక్రమున్
వర సురవైరినాశ పరిపాలిత శక్రమునైక కోటిభా
స్కర కిరణ చ్ఛటాచ్ఛవి ధగద్ధగితాంబరచుంబి వక్రమున్.''
(XII-80)

మున్నగు పద్యము లిందుకు నిదర్శనములు. పోతన వలెనే కవిగారును ఎడనెడ ననుప్రాసలను అంత్యానుప్రాసములను గూర్చుచుందురు.

''మానిత సూన సౌరభర మా కృత......'' (IV-124)

''విగతాడంబరవేషి నాస్తిక కథావిద్వేషి ... ...'' (VII-98) మొదలగు పద్యములందు వీనిని గాంచనగును.

''బెడిదపు టడిదములగుదము విడి విడి కదుఁబోరుచుండ వెసలగుదము తా
నడిదపు బడికిటి ముడిపైఁ గడువడి దాకుటయునొచ్చి కత్తిని జార్చెన్''.

అను పద్యము దకార వృత్త్యనుప్రాసముతో గూడి పోతనగారి రచనయా యనిపించుచున్నది. గజేంద్ర మోక్షము చెప్పుచు కవిగారు ''అలవైకుంఠ పురంబులో'', ''సిరికింజెప్పడు'' అను పోతనగారి పద్యములనే యా సందర్భమునఁ జొప్పించియుండిరి. అచ్చటనవి పూర్వాపర పద్యములతో నతికి కవిగారి రచనలోఁ గలసిపోవుటయే వారు పోతనగారి కవితారీతి నెంత చక్కగా నల వరచుకొని యుండిరో సూచించుచున్నది.

గోపికలు శ్రీకృష్ణుని దుడుకు చేతల యశోదకు దెలుపు సందర్భమీ విషయమును బలపఱుచు చున్నది. అష్టమాశ్వాసమున పోతన శ్రీనాథులకు జరిగిన సంభాషణ, సప్తమాశ్వాసమున పోతన శిష్యులకును ద్వారపాలకునికి జరిగిన

సంభాషణ కవిగారి సంభాషణ రచనా చాతుర్యమును దెలుపుచున్నది. చతుర్థా శ్వాసమున శ్రీనాథుడు పుష్పలావికలతోఁ జేసిన సంభాషణ ఆముక్త మాల్యద యందలి "వెలది యీ నీ దండ వెల యెంత" యను పద్యభాగమును బోలి యున్నది. "కాళ్లులేక చరింప గల్గు వాడన నెప్పు డాందోళికాగామి యగుచు నేగు" (VIII-193) అను సీసమున ధనిక రాజన్య ఫణులకుఁ గల పోలిక చక్కఁగా వ్యక్తము చేయబడినది.

"నూత్న యౌవనపు మనోజ్ఞ వాసనలేవొ కుంజపుష్పితయగు కొమ్మ కెఱుక
తానెవలచి కలయు దాంపత్యరుచి మ్రాకుగడియ విడని తీవగరిత
తెలియు." (III-247)

అను పద్యము పోతన దంపతుల శృంగార విహార సందర్భములోనిది. ఇందలి సమాసోక్తి రామణీయక మనిర్వచనీయమై యున్నది. ఇట్టి వీకావ్యమున ననేకము లున్నవి. వసుచరిత్ర విజయవిలాసము లందలి పద్యములవంటి పద్యములను కవిగారీ కావ్యమునఁ బెక్కుచోట్ల రచించి యున్నారు. "నెలగుండి యల బిండి సెలయేటి యెలబోటి యిలక్షీర వారాశి నౌలకఁబోయ" (III-192) యను సీసము వసుచరిత్రను; "మీనంబు పొలసుల మేన్వడి స్నిగ్ధతంగాంచ దానీ లేమ కనులఁబడియె" (XI-183) నను పద్యము విజయ విలాసమును స్ఫురింపఁ జేయుచున్నవి.

"కలవాడైనం జాలునె చెలువుడు రసికుండుగామి జీవితమేలా
చెలువలు కలువలు సరసుల చలువ వలన నిలుపగలుగు జలజదళాక్షీ !"

అను పద్యము నందలి 'సరసుల' యందుగల చమత్కారమును,

"భ్రమరాభుల సరసులఁగని యమితోత్సాహమ్ము మెఱయహసియించుచువా
గమృతము నర్పించుట లోక శ్రమమే సుమనస్సులకును సౌజన్య నిధీ!"

అను పద్యమందలి 'సుమనస్సుల' యందలి చమత్కారమును మిక్కిలి ప్రశంసా పాత్రములుగా నున్నవి.

"కన్నెలను వెన్నెలలు గాసె గలికి సొగసు, నవ్వులన్మల్లియలు పూచె
నాణ్యమైన
గొంతులోఁ గోకిలలుగూసెఁ గొసరి కొసరి, నడల రాజహంసలు కాళ్లఁ
బడుచు డాసె." (II-246)

''అంబికా సతియట్టు లాత్మేశ్వరున కెప్పు డర్ధాంగివై ప్రేమ నలరుచుండి
వాణీసతి విధమ్మ ప్రాణ వల్లభునోట నాలుకవై కూర్మి(గ్రాలుచుండి
శ్రీకాంత యట్టులు నీకాంతు హృదయమ్ము(దమినాక్రమించి నిత్యము వసించి
పూత గంగాసతీ పుణ్యవర్తన మట్లు నాధుండు తల(దాల్ప నడచుకొనుచు
వరునిఁదను మనోవాక్యత్రికరణములను, నెలమిఁస్వాధీనమొనరించి యెంతొభక్తి
యతిథి గురుబంధుజన పూజలాచరించి, మించియుభయవంశములుద్ధరించవమ్మ.''
(II-281)

''కనుగీటుటకు నైన(గాని యనిమిషాంగనలట యప్సరసలు
.......................... .........'' (IV-72)

''కమ్మ విలుకాని యమ్మ లజ్జమ్ములెందు............'' (IV-265)

''నీ పేర్విసభవాబ్ధి నీళ్ళు మ్రింగునదేల జలధి బంధన ఘట్టముల
వినియెనొ..................'' (V-100) మున్నగు పద్యములు
విజయ విలాస మందలి పద్యములతో( బోటీ చేయుచున్నవి.

''ఇవ్వనియె జవ్వనింబోలి యెలమిమీఱ( బుష్పవతియౌటచే భృంగ
భోగ్యయయ్యె
నేతదారామ మారామ నృపతివోలె నలరి ద్విజవాంఛితమ్మ
సఫలమొనర్చె'' (IV-110)

ఇందలి శ్లేష మనోహరముగా నున్నది. ''అమృత మొల్కించు దేవావతారంబన్న
అల నిశాచరవృత్తిఁ జెలగుచుండు'' (IV-194) అను సీసము రాజు చంచల
త్వమును, అవిశ్వాస్యతను వర్ణించుచు( జంద్రుని(గూడ స్మృతికిఁ దార్చుచున్నది.
''బ్రాహ్మణుం డావీట బహుళ విజ్ఞానియై ప్రథిత విద్యానాథ పదవిఁ బడసె''
(I-80) అను సీసపద్య మొయగంటి వర్ణన మందలిది. ఇందలి విద్యానాథ,
రుద్రావతార, తిప్పయ, కాపయ్య పదములందలి యర్థద్వయస్ఫూర్తి విద్యానాథ,
ప్రతాపరుద్రాదుల( దలపించుచు పద్యమునకెనలేని సౌందర్యమును సమకూర్చు
చున్నది.

''నడయాడున్ భవదీయకాయము ఋ సౌందర్యార్ణవం బీకటిన్
బుకమిన్దట్టుచు మధ్యసీమ గగనమ్మున్ ముట్టుచున్ నాభిలో
సుడులన్ జుట్టువళిన్ దరంగ గతి లేచున్ గ్రీవలో శంఖమై
యొదుపుల్పెట్టుచు జన్గవన్ రజత హేమోర్వీధ్రముల్ నెట్టుచున్''
(III-181)

అను పద్యము రూపకాలంకార విరాజితమై దుర్గాదేవి సౌందర్య సర్వస్వమును వ్యంగ్యముగా ప్రదర్శించుచున్నది.

"అనుట నా యెమ్మెలాడి తానతనిఁగాంచి మధుర దరహాసములు
మొల్లమాలలల్ల
దాడిమ ఫలాలగిల్ల నేత్రములు చలుపకలువ పూరేకులం జల్లఁబలికె
నిటులు." (IV-37)

అను పద్యము ధ్వని సౌందర్యమునకు నిధానము. ఇది యామె హాసవికాస ముఖియై దాడి మీ బీజములవంటి దంతములు గోచరింప గలువరేకుల వంటి వీక్షణములు ప్రసరింపఁజేయుచు నెట్లు పల్కెనో విశదము చేయుచున్నది. నవ మాశ్వాసమున పోతన భక్తి తత్పరుడై రాము నుపాలంభించిన పద్యములు (38, 48) తీవ్రములయ్యు నత్యంత మనోహరములై యలరారుచున్నవి. కవి గారి యనన్య సామాన్యమైన యుపమాలంకార ఘటనమునకి క్రిందివి కొన్ని యుదాహరణములు.

తాళపత్రమందు దనరు నక్షరమును క్షరమొనర్చు చెదలపురువుభంగి
(III-308)

తాను బోతనయువచ్చె గర్మ వెనుకనె జ్ఞానమ్ముగ్రాలుకరణి (IV-63)

క్ష్మాపతి పల్లెరుకాయ చాడ్పునన్. (IV-394)

తమములోనఁదోచు తత్త్వోపదేశమ్ము తనువుగొన్న యట్లు చనియెసుకవి.
(V-160)

కవిగారీ కావ్యమున సందర్భోచితముగా నెన్నో సామెతలను, లోకోక్తులను గూర్చినారు.

ముక్కుముడి బెట్టక పదాన ముల్లునాటకుండ వచ్చిరి హరి
రక్షకుండుగాగ (III-255)

లక్ష్మిరా దడక నడ్డము పెట్టుకొనంగఁజెల్లునే (VIII-188)

పాముపగయుఁదోక బంధువు నాకనువాడు జగతి వెఱ్ఱివాడు (X-102)

తలయె పోవునఁ జెవుల పోవులకు నేడ్చువాని నేమియనగ వలయుఁ
బుడమి (X-103)

మున్నగునవి నిదర్శనములు. "విచ్చెడి తమ్మిమొగ్గ తొలివిందునకే యళిపెట్టి పుట్టునో" (IV-313) అను పాదము "నజానేభోక్తారం కమిహసముపస్థాస్యతి విధిః" అను కవి కులగురువు శ్లోకపాదమును స్మరింపఁజేయుచున్నది.

కవిగారి పదప్రయోగము సలక్షణమై మృదుమధురమై యింపు నింపు చున్నది. సంస్కృత సమాసముల వాడినను, తెలుగు పదముల వాడినను వారి రచన ప్రౌఢమయ్యు సర్వసుబోధమై వీనుల విందు చేకూర్చుచుండును. తెలంగాణమున వాడుక యందున్న పదములను జాతీయములను వారు పెక్కు చోట్ల వాడియున్నారు. "మీ బంటుకు బానిసను గింత బారెయ్యవ్వా కుంటోణ్ణి పున్నెముంటది" యనునది తెలంగాణమందలి పల్లెప్రజల పలుకుబడి. ప్రహ్లాదుని తొక్కు పల్కులను కవిగారు యథాతథముగాఁ బ్రయోగించియున్నారు. వారెడనెడ వ్రాసిన శ్లోకములు, తెలుగు పద్యములలోఁ గీలించిన సంస్కృత వాక్యములు లోకోక్తులు వారి కాభాషయందలి నిశిత పాండిత్యమును జాటుచున్నవి.

"హరిరాక కల్లయిక నీకరి జీవితమిల్ల యామకరి యాకటికై
యెరయనిన కొల్లధర నెవ్వరికింగావలె ననాథ బాధలనెల్లన్" (XII-51)

అను పద్యమున నంత్యప్రాసానుగుణముగ కల్ల, ఇల్ల, కొల్ల, ఎల్లన్ అను పదములు ప్రయోగింపఁబడినవి. ఇందలి 'యిల్ల' తమిళ పదము.

"ప్రాలో వేణివి మెఱపులచాలో చూపుల ప్రసూన చయవర్షాలో
బాలిక నవ్వుల రాల్ముత్యాలో మోదాబ్ధిశీకరాంబుశ్రీలో" (II-254)

ఇందు 'లో' తో ముగియు పదములకూర్పు హృద్యమై పద్యమున కెనలేని సొంపు కూర్చుచున్నది.

ఈ కావ్యమున నచ్చటచ్చట జక్కని గద్యభాగములున్నవి. ఇవన్నియు నన్ప్రాసాలంకార పూరితములును, భావ బంధురములును, ప్రౌఢములునై పూర్వ ప్రబంధములందలి గద్య భాగములను బోలియున్నవి. సప్తమాశ్వాసము నందలి దశావతార వర్ణనగద్యము, నేకాదశాశ్వాసమునందలి బ్రహ్మోముడు తండ్రికిఁ జెప్పిన తాత్త్విక గద్యయు, ద్వాదశాశ్వాసమునందలి సరోవర వర్ణన గద్యయు గమనింపఁదగినవి. ఈ గద్యభాగములు శ్రీమదాచార్యులవారి పాండితీ విజ్ఞాన గరిమలను జాటుచున్నవి. ఛందోవిషయమున నీ కావ్యమునఁ జెప్పఁదగిన విశేషములేవియునులేవు. ఆశ్వాసాంతములందు మాత్రము మాలిని మున్నగు

వింత వృత్తములు వాడబడినవి. భోగిని నాట్యము వర్ణించు సందర్భమున కళికోత్కళికలు, తోహరలు, ఆది త్రిపుట తాళములు, ముక్తాయులు, మంగళ మహాశ్రీవృత్తము కలవు. చివరి యాశ్వాసములలోఁగూడ వర్ణన సందర్భమునం దచ్చటచ్చట రగడ భేదములైన కళికోత్కళికలు వ్రాయఁబడినవి. సప్తమాశ్వాస మున 313వ సీసమున నొక్కొక్క సీసపాదము నొక్కొక్క గీతపాదము వెనువెంటనే యనుసరించుచున్నది.

> ''పవన కుమార సంస్పర్శ మ్మదెట్టిదోయర నవ్వి మరియు నీవిరి పడంతి
> అనుట నామె కన్నుల సిగ్గు పెనగులాడె''.

శ్రీ వరదాచార్యులవారి నాట్యకళా కౌశలమును గూర్చి యిదివఱకే కొంత సూచించితిని. వారికి జ్యోతిర్వేదాంత శాస్త్రములతోఁగూడఁ జక్కని పరిచయము కలదు. ''అరయ రాశిద్వయమ్ము నేకాధిపత్య గతిఁ జెలంగుచు'' (II-236) అను పద్యమును, ''స్త్రీరాక్షసం నకర్తవ్య'' మ్మాదిగాగల వాక్యములును వారి జ్యోతిర్విశారదత్వమునకుఁ దార్కాణములు. ''పూర్ణమునుంతి పెక్కులిల బూర్ణము లున్నవమంది'' (III-385), ''గోపిక లెల్లరున్ నయన గోచరులైన మునీంద్రులైరి'' (XII-165) మొదలైన పద్యములు వారి వేదాంత శాస్త్ర పాండిత్యమును సూచించుచున్నవి. కావ్యమున పోతన కావించిన తాత్త్విక ప్రసంగములును, భక్తిబంధురోపన్యాసములును, వారికావిషయము లనుభవ సిద్ధములని వెల్లడి చేయుచున్నవి.

కావ్యారంభమున నాచార్యులవారు పూర్వాధునిక కవుల నెల్లరను భక్తి స్నేహ పూర్వకముగా స్మరించియుండిరి. కావ్యము నడుమ భాగవత రచనా రంభ సందర్భమున గూడ బూర్వకవిస్తుతి యున్నది. పూర్వకవి స్తుతి యెల్ల కావ్యములందును గనిపించును. కాని యాధునిక కవి పండిత విమర్శకుల నింతగాఁ బేరు పేరు పెట్టి సంభావించిన వారెవ్వరును గానిపింపరు. ఇది శ్రీమదా చార్యులవారి నిరహంకారతను, సర్వకవి పండిత సామరస్యమును జాటుచున్నది.

> ఎక్కడనున్న సద్గుణములేనియు నౌదలఁదాల్చుటందువే
> జొక్కరిగాంచి ముందర నహోయని వెన్కల వెక్కిరింపకే
> మక్కువ భ్రాతృవత్సలత మత్సరమున్విడనాడి యుంటలో
> నిక్కపు బొజ్జబంతులయి నిల్చెదరీ తెలగాణ సత్కవుల్

సరళ హృదయయు లాత్మస్తుతి పరాఙ్ముఖులు గర్వరహిత ప్రతిబాధ్యులుదం
భరహితు లీ తెలగాణన్ వెలయు కవుల్ తొనకనట్టి నిండుఘటమ్ముల్

అని తెలంగాణమునందలి కవుల గుణ గణములు విశదీకరింపఁబడినవి. ఇతరుల మాట యేమోకాని యీ గుణములన్నియు బోతన యందును వరదాచార్యుల వారి యందును మాత్రము సమగ్రముగాఁగాని పించును. స్వభావముచే సదాచార సంపదచే వారిరువును ఋషితుల్యులు. శ్రీమద్భాగవతాంధ్రీకరణము పోతన చేతఁబడుట యెట్టిదో పోతన చరిత్ర ప్రబంధీకరణ మాచార్యులవారి చేతఁబడుట యట్టిది. వారి చరిత్ర పోతన చరిత్రకు ప్రతిబింబము. అందుచేతనే వారీ చరిత్రము ననుభవసిద్ధము నట్లింత మధుర సుందరముగా వెలయింపఁజాలినారు. సప్తమాశ్వాసమున శ్రీనాధుడు పోతన కవిత్వమునుగూర్చి-

అచ్చపు సంస్కృతాంధ్ర మహదబ్ధుల మందరముల్ మధింపగా
వచ్చు సుధారసమ్ములకు వన్నెలు దిద్దెడి కావ్యధార క
మ్మచ్చునఁదీయు తీవియల మచ్చుల నిచ్చు మనోజ్ఞశైలిపూ
ల్విచ్చిన నందనోపవన వీధులఁగాదను పద్యగద్యముల్ (VII-118)

అని కావించిన ప్రశంస శ్రీ వరదాచార్యులవారి కవిత్వమునకు అన్వయించును. ఈ పోతన కావ్యమువారి చిర తపః ఫలము. వారెంత శ్రమపడి దానిని రచించిరో యంత శ్రమపడి దానిని ప్రచురించిరి. శ్రమయంతయు వారిది; ఫలము మాత్రము రసాస్వాదన పరాయణులైన యాంధ్రులది.

మహి నస్తమింపని మార్తాండ బింబమ్ము క్షయ మెఱుంగని పూర్ణ
చంద్రముండు
దేవ మానవ స్థావర తిర్యగాళి సమత నిజకావ్యకృత పర్ణశాలనుంచి
యక్షరామర పదవులనందజేయు వరదుడె కవీంద్రుడన
వేయివాక్కుఁది లేల (II-164)

ఇందలి 'వరదుడె' యను పదమునకు 'వరములొసంగు వాడె' యనుట కంటె 'శ్రీ వరదాచార్యుడే' యని చెప్పుట యుక్తముగా నుండునని నా యభిప్రాయము. ఏ తత్కావ్యామృత రసము నాస్వాదించిన పిమ్మట సహృదయులు నా యభిప్రాయముతో నేకీభవింపకపోరని విశ్వసించుచున్నాను.



# విశ్వనాథ సత్యనారాయణ గారి
# ఝాన్సీ రాణి
## -డాక్టర్ ముమ్మిడి కోటేశ్వరరావు

భూమిక :- ఇది చరిత్రకు తాత్త్వికార్థం చెప్పిన కావ్యం కనుక ఆ చరిత్ర తత్త్వ విచారణ ఆవశ్యకమౌతున్నది.

సరళరేఖ - వృత్తం గణితశాస్త్ర ప్రసిద్ధాంశాలు. విశ్వ గమనం సరళ రేఖగా ఉన్నదనడం భౌతిక దృష్టి. వృత్తగతి అనడం తాత్త్విక - శాస్త్రీయ దృష్టి. కళలోనూ ఇంతే. సరళ రేఖల్లో చిత్ర శిల్పాదులుండవు. వృత్తాలు - కోణాలే కళా సూత్రాలు. వృత్తం కంటికి ఆనందహేతువైనట్లు సరళరేఖలు కావు. ఎందుకంటే సరళ రేఖలో విశ్రాంతి స్థానం బిందువులేదు. మనస్సుకేది విశ్రాంతి స్థానమో అదే ఆనంద బిందువు. కావ్యంలోనూ బీజం ప్రారంభం కాగా అదే పరిణమించి కార్యంగా - అంత్య బిందువుగా రూపొందడం వల్ల కావ్యం ఎక్కడ బయలుదేరిందో అక్కడకే చేరుకొంటున్నది. బీజం వృక్షమై మళ్ళీ బీజం కావడంతో సృష్టి ఒక సుడి తిరుగుతున్నది. ఇదే నృత్యం - నాట్యం. భరత మహర్షి అలంకార శాస్త్రమనక నాట్య శాస్త్రమని ఎందుకన్నాడు? విశ్వమంతా వృత్తగతే కనక-కాలమూ, దేశంతోపాటే వృత్తాకారగమనం చేస్తున్నది కనక-నాట్యం. నాట్యమంటే వలనా వర్తనాదుల సుడి. ఛందోవృత్తం-ఆనందం ఒకసారి గిఱ్ఱున సుడి తిరగడం. ఇందుకే సృష్టిని 'నర్తక'మని వేదమన్నది. కాబట్టి వృత్తం సౌందర్యం. సర్వ చలనమే సౌందర్యం. కనక చరిత్రకూ ఈ తాత్త్వికార్థం చెప్పక తప్పదు.

గత 18-19 శతాబ్దాల అవగాహనకు సృష్టి సరళరేఖావగతిగానే కన్పించడం వల్ల చరిత్ర అంటే ఒకనాటి సంఘటనగానే వ్యాఖ్యానించుకోక తప్పలేదు. దేశగతమైన-కాలబద్ధమైన ఒక సంఘటన పూర్వాపర సంఘటనలకు కార్య-కారణత్వాలు పొందుతున్నదని భావించడం జరిగింది. అంటే భూతం వర్తమాన కారణం. ఇది భవిష్యత్ కారణం. ఈ కారణ కార్యవాదం భౌతికమూ- త్రిమానబద్ధమూ (Three dimensional) ఆధునికుల శాస్త్రీయ దృష్టికిది ఆనలేదు- అశాస్త్రీయమైనందువల్ల.

"We can no longer say the past creates the present, past and present no longer have any objective meaning, Since the four dimensional continuous can no longer be shorply divided in to past, present and future.

"If we still wish to think of the happenings in the phenomenal world are governed by the casual law, **We must suppose that these happenings are determined in some substratum of the world which lies beyond the world of phenomena"**

(Sir James Jeans)

కేవల చారిత్రక వాదులు భౌతిక కారణ కార్యవాదులు. కాని ఇదే సంపూర్ణ సత్యం కాదు. ఈ ప్రత్యేక సంఘటన ఒక దేశ కాల బద్ధంగా జరిగినందువల్ల అది మొత్తం విశ్వగతితో సమైక్యం పొందక తప్పదు. ఈ ప్రత్యేక ఘట్టాన్ని ప్రత్యేకంగా వ్యాఖ్యానించడం కాక దానికి వెనుక ఉన్న మహా దేశ కాలాల చట్రంలో పెట్టిచూస్తే దాని ఉనికిలోని యధార్థ సత్యం తెలుస్తుంది. కావ్యంలో ప్రత్యంశం పూర్వాపర సమన్వయం సంపాదించడం పేరే శిల్పమంటే. ఇందుకే విమర్శకుడు అఖండకావ్య సృష్టినే వ్యాఖ్యానిస్తాడు తప్ప ఎక్కడికక్కడే చూడడు ఈ దృష్టి అనగా ఖండదృష్టి - కువిమర్శ. పూర్ణసత్యం కానందున. కాబట్టి మహా దేశ కాలమన్న చట్రంలో ఒక ప్రత్యేక సంఘటనను బంధించి చూస్తే ప్రత్యేకత పోయి పూర్వాపర సమన్వయం పొందుతుంది. అంటే ప్రతి ప్రత్యేక సంఘటన దానంతటది కారణత్వమూ-కార్యత్వమూ పొందుతూ ఆ మహా దేశ కాల స్థితిలో ఇది ఒక ప్రతీకగా మిగులుతుందే తప్ప వ్యక్తిగా మిగలదు. విశ్వదృష్ట్యా ప్రతి సంఘటనా కారణ-కార్య స్వరూపం. ఈ దృష్టిని ఆర్థర్ ఎడ్డింగ్టన్ Symmetrical relation అన్నాడు. (In A Short History of Religion and philosophic Thought in India- by Swamy Krishnanada.)

పై గ్రంథంలో స్వామి కృష్ణానందగారు ఇలా అన్నారు:

Arthur Eddington introduces a distinction can-sation which is the commonsense meaning of the

relation of cause and effect in which there is the notion of the temporal antecedence of cause to the effect and that he calls causality which is the Symmetrical relation of the totality of events in the universe, which is a complete system of reciprocally connected events. Whitehead holds a similar view when he considers reality to be of the nature of an organisnic process. Here the three-dimensional or spatio-temporal view of history gives way to the **truth of a universal situation**, which though it may appear as extra-mental to individual observing centres, is involved in the very constitution of the observers, and hence incapable of observation at all.

P. 48-49.

కాబట్టి విశ్వగతి ప్రతి సంఘటనకు మధ్య పరస్పర సంబంధంతో బంధితమై వున్నది. దేనికది ప్రత్యేకంగా చూడడం అశాస్త్రీయం. ఒక గొలుసులో ప్రతి లంకె పూర్వాపర బంధన సూత్రమైనట్లు, ప్రతి సంఘటనా కాలంతో దేశంతో బంధితం. కాబట్టి ఆ ప్రత్యేక సంఘటన ఒక విశ్వగతి ప్రతీక తప్ప రాశి నుండి వేరు చేసిన ముక్క కాదు. రాశిదృష్టి శాస్త్రీయమైనట్లుగా ఇతరం కాదు.

Causation among things is to be understood as the individualastic reading of the consequences of an indivisible consciousness appearing as the witness of objects which have it has their existence and content. The function of this universal principle as an unbroken continum appears, where it is manifest in individuals, as the law of causal relation. The dynamic self-expression of the absolute in the world of objeets involves among them a living connec-

tion which appears in this manner. Causation has a m·aning in the empirical world, but is meaningless to the absolute. The mechanistic senses of man cannot observe the teleological purpose hidden in the Universe, an aim towards which all evolution is directed. (P. 49-50)

జీన్స్ అన్న చివరి మాటల్లో భౌతిక సంఘటన ఒక అతీత ప్రపంచంలో సునిశ్చితమై వుండాలన్నమాట ఈ కావ్య పీఠికా వ్యాఖ్యాన సూత్రం.

ఈ దృష్టితో ఈ కావ్యంలోని చరిత్ర ఒక విశ్వ బృహద్గతితో సమైక్యం పొందిన ఒక చారిత్రక సంఘటనగా కవి వ్యాఖ్యానించడం ఒక 'బృహన్మతి' (బృహస్పతి) (మతివివిషద్గురున్నను-అని కవి తనను గురించి చెప్పుకొన్న మాట) ప్రజ్ఞా వికాసం. అందుచేత ఝాన్సీరాణి అపజయం కూడా ఒక ప్రముఖ ఘట్టమై విశ్వసామూహిక గతితో సమైక్యమై పోవడంచేత అపజయానికి ప్రాధాన్య వివక్ష లేకుండా పోయింది. అంతేకాదు జయాపజయాలు రెండూ విశ్వగతి సూత్రాలే తప్ప-వెలుగు చీకట్లలాగా-తదన్యం కాదని సునిశ్చితమైనవి. అంటే చారిత్రక సంఘటనకు తాత్త్వికార్థకల్పన చేయడం జరిగింది. ఇందుకే కాలమన్న సూత్రం మీద కథ ప్రవర్తించింది. (వేయిపడగల్లో గణాచారి కాల సూత్రం. అంటే కవికి మహాదేశకాల దృష్టి ఒకటున్నది. అది సంఘటనా ప్రేరకమని-జయాపజయాలు ఆ ప్రేరణ శక్తి యొక్క విలాసమని కవిదృష్టి).

చతుర్యుగ పర్యంతమైన మహాకాల విషయం ప్రతి నవలలోను, కావ్యం లోను కవి ప్రస్తావించడం ప్రసిద్ధమే. ఈ కావ్యంలో పీఠికంతా కాలవర్ణనే. కనక ఒక చిత్రాన్ని - కావ్యనాటక సంఘటన, సన్నివేశాదులను-దేశకాల నేపథ్యంలో బంధించి చూస్తేనే కావ్యార్థబోధ జరుగుతున్నది. (మద్రాసు బీచిలో "కార్మిక విజయ" మన్న శిల్పమున్నది కదా ! దాన్ని చూడడమెలాగ? ! దగ్గరగాపోయి చూస్తే అదొక బొమ్మగానే, వ్యక్తిగానే గోచరిస్తుంది. అది శిల్పి దృష్టిని వ్యక్తీక రించదు. దూరంగా రోడ్డు కీవలకు వచ్చి ఆకాశం నేపథ్యంగా చేసికొని చూస్తే ఆ వాతావరణానికనుకూలంగా ఆ శిల్పి ఆ శిల్పాన్ని ఎలా మలిచాడో తెలుస్తుంది. ఇది కళాదృష్టి. కావ్యంలో నాటకీయత అంటే ఆ నేపథ్యానికి ఆ సంఘటనను అలా ఒదిగించడమే.)

అలాగే చారిత్రక సంఘటనను కూడ మహా కాలప్రవాహంలో సమన్వయ దృష్ట్యా చూడడమే యధార్ధ దృష్టి. ప్రతి సంఘటన ఒక మహత్ ఘటన (Cosmic event). ప్రతి వ్యక్తి ఒక మహద్వ్యక్తి (Cosmic being) తత్ప్రతీక. ఇదే తత్త్వదృష్టి ఇదే పురాణదృష్టి కవిదృష్టి. కేవలచరిత్ర కారుని దృష్టికాదు.

## ఝాన్సీరాణి

I ఇది తొమ్మిది ఆశ్వాసాల కావ్యం. నాల్గు రోజుల్లో వ్రాసింది. ఇంచు మించు ప్రతి ఆశ్వాసంలోను 50 పద్యాలు, (8-9 ఆశ్వాసాలు 38-21 పద్యాలు) కొన్ని ఆశ్వాసాలు (ఉదా:- 1, 2, 5, 6, 7) రెండేసి ఖండాలుగా అంటే షుమారు 25-25 పద్యాలుగా రచింప బడ్డాయి. మిగిలిన వాటిలో ఆ విభాగం లేదు. ఎందుకో. బహుశా తొందర వల్ల జరిగిందేమో. ఎందుకంటే ప్రతి ఆశ్వాసమూ 1- అని ప్రారంభింపబడడం - దాదాపు అన్నీ (8-9 తప్ప) ఏబదేసి పద్యాలుండడం వల్లా 25 తర్వాత 2 (ద్వితీయ ఖండం) అని వ్రాయడం మర్చిపోయి వుండవచ్చునను కోవడం వల్లా - అలా అనుమానించవలసి వస్తున్నది. ఏమయినా ఒక విభాగ దృష్టి స్పష్టంగా కన్పిస్తున్నది.

II ప్రతి ఆశ్వాసమూ ఒక ఋతువర్ణనాత్మక సీసపద్యంతో ముగియడం చూడ తగ్గ విషయం. అంటే ఆలోచించ తగ్గది.

ఈ రెండు విషయాలు కవి నిర్మాణ దృష్టిని సూచించేవి. ఆ నిర్మాణంలో ఒక ప్రమాణముంది. ఆ ప్రమాణమే కావ్య నిర్మాణ సూత్రం. అదిలేని వాడు కవి కాడు.

కావ్యానికొక మూర్తి ఉంటుంది. అది మలచబడి - చెక్కబడి - నిర్మింప బడ్డదా? లేక ఏదో వ్రాయబడ్డదా? కాబట్టి ఆ మూర్తి నిర్మాణంలో ప్రమాణ ముండాలి.

(భారతీయ శిల్పంతో ఆయా మూర్తులకు దైవ- మానవ- రాక్షసాది జాతుల మూర్తి నిర్మాణంలో నిర్దిష్ట ప్రమాణమున్నట్లు- కొన్నిచోట్ల శాస్త్ర ప్రమాణం కావచ్చు. కొన్నిచోట్ల స్వతంత్ర ప్రతిభ కావచ్చు. స్వతంత్ర ప్రతిభ అనకూడదు నిజానికి ప్రతిభ స్వతంత్రం కనుక-)

కావ్యం ఒకచోట ప్రారంభమై మరొకచోట అంతమౌతున్నది కదా? ఎందుకు? ఎక్కడో ఒకచోట కాక తప్పదు కనకనా! (ఇలా అనేవాడు కవీ కాడు, విమర్శకుడు కాడు) అరిస్టాటిల్ అన్నాడు- 'కథలో లేక కథకు ఒక ప్రవాహదశ- పాటు (Magnitude)' వుండాలని, అంటే ప్రారంభాంతాలకు ఒక నిర్దిష్ట ప్రమాణముందన్నమాట. నాటక శిల్పంలో నాందీ భరత వాక్యాల మధ్య కావ్యముండాలన్న నియమంగానీ- ప్రారంభం బీజం- అంతం ఫలాగమ మన్న నియమంగానీ ఆ ప్రమాణ వ్యంజకాలు.

ఈ కావ్యం—

విశ్వాధారము కాల మేసమయ మావిర్భూతమౌ దత్కళా
శశ్వల్లక్షణ మావహిల్లు, ఘటనా సర్వస్వమం దంబుజా
తాశ్వేతంబులకున్ మొయిళ్ళకు వియన్మర్త్యస్థలీ యాత్రలో
నాశ్వాపాతము పండు వెన్నెల ప్రభాహారిచ్ఛటల్ తెచ్చెడున్.

అన్న పద్యంతో ప్రారంభమై—

అథమ పరివంచనా ప్రథమావతార
మూర్తి గ్రీష్మండు చనుదెంచె మొదటజనుల
నిస్సహాయుల జేసి మండించి మండి
పిదప బడమటి గాలితో బిచ్చలించి.

పద్యంతో అంతమౌతోంది. ఈ ప్రారంభాంతాలు ముడివేస్తే ఆ కాలం గ్రీష్మం. బాధపడక తప్పదు. ఆ గ్రీష్మని పేరు ఆంగ్లేయుడు- వానిప్రభుత్వం. దీని దుశ్చేష్టలను ప్రతిఘటించిన స్వాతంత్ర్య యోధురాలు మరణించడం కాల ప్రభావం. అదంత శక్తిమంతం. ఇది కావ్య సూత్రం.

దీన్నిగూర్చి కవి వ్రాతలివి- ఝాన్సీ లక్ష్మీబాయి దేశ స్వాతంత్ర్యానికై పోరాడిన వీరవనిత. ఆమె మరణించింది.

-ఆమె చేసిన మహాప్రయత్నం విఫలమైంది. దీనికి కారణం కాలం పరమేశ్వర స్వరూపం. పరమేశ్వరుణ్ణి నిందించాలి యిలా జరిగినందుకు— అందు వలన ఆ కథ కనుగుణంగా కాలవర్ణన చేశాను.

(నేను- నా సాహిత్య రచనలు-మహతి)
విశ్వనాథ (యువభారతి)

కాబట్టి కథ అలా ఎందుకు జరిగిందన్న ప్రశ్నకు కవి సమాధానం కాలం. అది పరమేశ్వర స్వరూపం కనుక. ఇది సూత్రంగా కావ్యరచన జరిగిందన్న మాట. ఇందుకే కావ్యంలో చివరి ఆశ్వాసాల్లో ఝాన్సీ పీష్వాతో అన్నది.

''విశ్వాధారము''- పద్యమే. (చివరి రెండు వాక్యాలు మార్పు)

''దురగ్ర శ్వేతాస్యుల కేదియేని పొసగెన్ గాలంబె కల్పించెఁగా
దా శ్వభ్రంబుల బూడ్చి పెట్టెదము గామా! వారినీపాటికిన్.''

ఈ మాట నాయిక తన ఓటమికి కారణాన్ని చెబుతూ అన్నది. 'జయాపజయాలు దైవాధీనాలు' అన్న మాటలోని దైవం కాలమే. దీనికవి రెండు ముఖాలు అని అంగీకరించిన వాని దృష్టి చాల విశాలం. (సృష్టి వినాశాలు రెండూ దైవ కర్మలే ననుకొన్న వాని జీవిత నిర్వచనంలో ఉన్న ఔదార్యమూ- వైశాల్యమూ ఇతరున కుండవు.) ఇందుకు కాలవర్ణన ఆవశ్యకమైనది.

అష్టమాశ్వాసంలో—

కృతయుగ ధర్మమెట్లు ప్రయికిం జననిచ్చు స్వకాలమందు దు
ర్మతి కవి సర్వపాపపరిరంభణ శీలుడు పైన నీశ్వరుం
డతులిత కృష్ణపక్ష శశిహాస్యుని గాంచుచు ధైర్యమూని దోః
ప్లుతిగని లేచె నొంటె మెడవోలిక వక్రత దాల్చు శక్తియై. (32)

కాలవర్ణన యిలా ప్రతి ఆశ్వాసంలోనూ వస్తుంది. ఇదంతా కవికున్న నిర్మాణదృష్టికి వ్యంజకం.

ఇది ప్రధాన సూత్రం. ఇందులో తాత్కాలిక భావవ్యంజకమైన శిల్ప సూత్రం మరొకటుంటుంది. అది సామూహికమైతే సమష్టి శిల్ప సూత్రమైతే ఇది వ్యష్టి- అక్కడకక్కడ సమన్వయించే సూత్రం. ఈ వ్యష్టి- సమష్టి సమన్వయమే విశ్వధ్యేయమూ- తత్సదృశ కావ్యధ్యేయమూ.

కలికాలశక్తి వక్రం. అది ఒంటె మెడ వంటిది. సందర్భం రాణి ఆంగ్లేయులతో యుద్ధము చేస్తున్నది. అందులో ఒంటెలున్నాయి. కాబట్టి పోలిక. అలంకారం ప్రస్తుతాన్ని ఆకర్షిస్తూ - అంటే ఉపమేయాంశంతో - ఉపమానాంశంతో - అప్రస్తుతమైన సమష్టితో - సమన్వయిస్తున్నది.

ఇలాగే చివరి ఆశ్వాసంలో చివరి గ్రీష్మవర్ణన పద్యం మొత్తంమీద అంతర్గతంగా వున్న కథా సూత్రాన్ని ధ్వనిస్తూ ప్రస్తుతోపయోగం పొందుతున్నది. రాణితో ఆంగ్లేయులు చేసిన యుద్ధం- 1857 మార్చి 23 'ఝాన్సీ' దగ్గర, 1857 ఏప్రిల్ 25 'కల్పి' దగ్గర జరిగాయి. అంటే గ్రీష్మకాలం. కాబట్టి చారిత్ర కాంశం - కావ్య సూత్రంతో - వ్యష్టి సమష్టితో సమన్వితమౌతున్నది.

ఆశ్వాసాంత ప్రతి ఋతువర్ణనా ఇంతే. కాల సూత్రాన్ని వ్యంజించటమే గాక ప్రస్తుత కథాంశాన్ని సూచిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. | ఆశ్వాసాంతం | — | వసంత ఋతువు. |
| 3. | ,, | — | వర్షం. |
| 4. | ,, | — | శరత్తు. |
| 5. | ,, | — | హేమంతం. |
| 6. | ,, | — | శిశిరం. |
| 7. | ,, | — | వసంతం. |
| 8. | ,, | — | లేదు. |
| 9. | ,, | — | గ్రీష్మం. |

ఈ క్రమానికి - కథాక్రమానికి సమన్వయమున్నది. ఇది వ్యష్టి శిల్పం.

## కథోన్మీలనం

**2. ఆశ్వాసం :** లక్ష్మీబాయి వారణాసిలో జన్మించడం, తల్లిదండ్రుల వృత్తాంతం. నానాసాహెబ్ దగ్గర ఖడ్గవిద్య నేర్వడం. వారి స్నేహం. ఆంగ్లేయుల దుశ్చేష్టలు చూచి బాధపడడం.

3. నగరోత్సవవేళ ఆంగ్లేయాధికారి తన గుఱ్ఱబ్బండిని జనంమీదుగా తోలించడం. అది చూచి లక్ష్మీబాయి వాడికి బుద్ధి చెప్పడం. ఈ విషయం చూచిన ఝాన్సీరాజు గంగాధరరావు మంత్రి ఆమెకూ రాజుకూ వివాహ ప్రయత్నం చేయడం. వివాహం జరగడం.

4. రాణికి సుతోదయం. అతడు మరణించడం. దత్తత స్వీకారం. డల్హౌసీ సిద్ధాంతాన్ననుసరించి ఇది చెల్లదని - రాజ్యం ఆంగ్ల సామ్రాజ్యంలో విలీనం కావాలని ఆంగ్లేయులనడం. రాజ ప్రతినిధి దత్తత స్వీకారోత్సవములో పాల్గొనడం.

5. రాజు మరణించడం – దత్తత చెల్లనేరదని ఆంగ్లేయులు పట్టుబట్టడం. రాణి ఆంగ్లేయుల నెదిరించడం.

6. భారతీయులకు ఆంగ్లేయులకు కల్గిన వైషమ్యాలు- పరస్పర హింస.

7. రాణి యుద్ధ ప్రకటన.

8-9. యుద్ధం - రాణి మరణం.

3వ ఆశ్వాసం : వర్షర్తు వర్ణన. ఇది రాజు రాణి వివాహానంతర విహార వర్ణనకు - వారి శృంగార రసానికి పోషణకనుగుణంగా చేయబడింది. శృంగారానికీ వర్షర్తు వర్ణన ఉద్దీపనంగా వర్ణింపబడి శృంగారం ధ్వనింపబడడం పరమౌచితీమంతంగా ఉంది.

4వ ఆశ్వాసం : శరదృతువు కేదార సస్యలక్ష్మి వర్ణనా ముఖముగా చేయబడడం. తల్లిగా మారిన (ఝాన్సీ) లక్ష్మివర్ణనలో పర్యవసింప చేయటం ధ్వనిత రమణీయాంశం.

ఇక్కడ ఆంగ్లేయుల ప్రతిఘటన వుందిగదా! ఈ వర్ణన కుదురుతుందా? అన్న ప్రశ్న కవికే కలిగి ఉండేవి. కాకపోతే చివరి పద్యానికి ముందున్న పద్యం ఇలా వ్రాయబడటం జరగదు.

పైకి శరదా తపములు జాల్వారినట్లే
లేత నవ్వులజిగి పిసాళించు చుండ
వెస ఫరంగి తాంబూలము స్వీకరించె –

ననటం తర్వాత శరద్వర్ణన కనుకూల కథాంశ సంవిధానం చేయటమే. ఇంతే కాక, శరదృతు వర్ణనలో -

అనయ పథజన నేత్రకుట్టన నిమిత్త
మైన పిచ్కలన మేచి యూహలకు నూహ
సొగసు సంపాదనము సేయుచున్నదదిగో
**శరదమలమూర్తి కేదార సస్యలక్ష్మి.**

**అనయపథజనులు 'దొంగ వర్తకుల గుంపు' - ఆంగ్లేయులని ధ్వనించటమే ప్రస్తుతాంశం.**

5వ ఆశ్వాసం. హేమంత వర్ణన మిక్కడ పంటచేను నాశన హేతువుగా వర్ణితం కావటం- ఆగ్లేయులు దత్తత స్వీకారం చెల్లనేరదని ఝాన్సీని తమ పాలనలోనికి గ్రహించడం ప్రస్తుతాంశం.

**6వ ఆశ్వాసం.** 'శైతులొక్కొక్కొ డొక్కొక్కొ దాపు పొందె
చెప్పనొకరీతిగాని శైశిరము వలన'— అన్న

**శిశిరవర్ణన** ఆంగ్లేయులు భారతీయులను హింసించిన ప్రస్తుతాంశ వర్ణన. వారు పెట్టిన బాధలు-

ఆదివరకు చంపియెఱుగని యతడొకండు
చంపుటెట్లుండునో చూడ జంపెనొకని — ఇత్యాది పద్యాల్లో

వర్ణింపబడటం చూచుకోవచ్చు.

**7వ ఆశ్వాసం.** వచ్చిన వసంతమది గ్రీష్మవైభవమ్ము
ప్రాణ బాధావహమ్మును భ్రాంతిదమ్ము
నర్థ మెరుగని జనము తాపాపనోదనమ్ము
కృత ప్రయత్నమ్ము తప్త శరీరమయ్యె.

ఇక్కడ ఆంగ్లేయుల పరిపాలనారీతులను ప్రతిఘటించిన రాణి తాంతియా తోపీ సాయంతో సేనలను సమీకరించడం విషయం. దత్తత స్వీకారోత్సవ మన్న వసంతం గ్రీష్మవైభవంగా మారి అది భ్రాంతిదమై పోతున్నది. భారతీయ ప్రయత్నం వ్యర్థమన్న ఆగామి కథా సూచన.

**8-9 ఆశ్వాసాలు :-** ఏకాశ్వాసమే కాని కల్పని- కాంచన గంగను రాణి ఓడిపోవడం 8-లో చెప్పి, 9-లో ఆమె గ్వాలియరులో మరణించట మన్న విషయం చెప్పటంకోసం- ఈ వేర్పాటుకోసం రెండుగా కథ విభక్తమైనది.

కాబట్టి 9-చివర గ్రీష్మవర్ణన వచ్చింది.

2-7 ఆశ్వాసాంతాలు వసంత వర్ణనాంతాలు. ఎందుకని? మొదటిది రాణి జన్మించినప్పటిది. రెండవది ఆమె జన్మకారణం ఆంగ్లేయులను ప్రతిఘటించటమే కనక ఆ సందర్భంగా వచ్చిన వర్ణన. 2 వ ఆశ్వాస ఋతువర్ణనలో-

అది నవదశా చైత్రమాసాపరాహ్ణ
జరఠలురదా తపమ్ములు సందడించె— నన్న చోట

'నవదశ' మాటలోని-నవ-ఆశ్వాస విభాగ సూచకంగా రావడం విచిత్రమైన మాట.

ఎందుకంటే, పైన వ్రాసినట్లు 8–9 ఆశ్వాసాలు కలిపి ఏకాశ్వాసంగా చేయవచ్చు. కాని కవి అలా చేయలేదు. (వేయిపడగల్లో-37-అధ్యాయాలుగా

వ్రాసినట్లు-ఇది నాట్యశాస్త్రాధ్యాయ సూచన. నాట్యం మోక్షవిద్యగా గిరికద్వారా కవి చెప్పడం స్పష్టమేకనుక అధ్యాయ సంఖ్య ప్రతీకార్థం కలదే. ఈ విషయానికి నాట్యశాస్త్ర పీఠిక-బరోడాప్రతి-చూడాలి.)

కాబట్టి నవదశ-కథావిభాగ సూచకమే. అయితే నవాత్మకంగా కథ నెందుకు మలచాలి? రామాయణ కల్పవృక్షంలో ప్రతి కాండ ఐదేసి ఖండాలుగా చెక్కబడడం పంచసంధి విషయ సంబంధంగా - అధ్యాత్మ విద్యాసంబంధంగా చూడదగ్గ విషయం. అలాగే ఇక్కడ? ఈ ప్రతీకార్థ దృష్టి కవికున్నది-అనటానికి వేయిపడగల అధ్యాయ సంఖ్య-పంచ ఖండాల విషయం సాక్ష్యం.

సృష్టి నవాత్మికగా ఆర్షభావముంది. జన్మ - వికాసం - మరణం - ఈ పరిణామాత్మకమైన విశ్వం నవాత్మకం. అష్టతత్త్వాలు అష్టమూర్తులు - పరిణామాత్మక, క్షర ప్రపంచ విషయం. చలనశీలం. దాని కాధారమైన తత్త్వం నవమ తత్త్వం. ఈ కథలో ప్రథమాశ్వాసమంతా నాంది. రాబోయే 8 ఆశ్వాసాలు కథ-జగద్విషయం కాగా మొదటి ఆశ్వాసం భవిష్యత్కథాధార సూత్రంగా సుసంఘటితమైనది.

## ప్రతీకాత్మకత

ఈ కావ్యం ప్రతీకాత్మకం. కన్పించని అర్థానికి-కన్పించే వస్తువు ప్రతీక. వస్తు బాహ్యరూపం వేరు. అంతరసత్త వేరు. అది వాస్తవం. ఇది సత్యం. అది భౌతికం-భౌమం-ద్రవ్యాత్మకం. ఇది అభౌమమైన భావాంశం. రెండూ కలిస్తేనే సృష్టి-చేష్ట-కర్మ. అయినా ప్రధానం మనస్సే-భావమే-సత్యమే. అది కథలో ఈశ్వర విషయకంగా చెప్పబడింది. ఝాన్సీరాణి జన్మకది అభౌమ-భావరూప-పూర్వవిషయం. కథ నిలా చెప్పడం వల్ల ఒక చారిత్రక సంఘటన పౌరాణికాంశం లేక కథగా మారిపోతుంది. పురాణమంటే ఒక చారిత్రక విషయాన్ని నిత్యమైన అంశంగా వర్ణించటం. వాస్తవికాన్ని సత్యంగా మార్చటం. అప్పుడది నిత్యకథగా అవతరిస్తున్నది. ఇందుకే అత్యాధునిక కళలో పౌరాణికాంశాలు ప్రతీకలుగా అవతరిస్తున్నవి ఇది ఆధునిక మనస్తత్త్వశాస్త్రం చేసిన విషయమే.

'విశ్వాధారము కాలము'- ఈ పద్యంలో ఘటనా సర్వస్వమందు కాల లక్షణ ముంటుందన్నమాట విచారణీయాంశం.

ఘటన – సంఘటన వకటే. ఇది చారిత్రక ప్రవాహంలో ఏకదేశాంశం. కాలం ప్రవాహం కాగా ఒక చరిత్రలోని ఒక ఘట్టం సంఘటన. ఆ ఘటన కాల ఘటితమైన ప్రత్యేకాంశం. కాబట్టి చరిత్ర కాలనిర్ణీతమైన గతివిశేషం. కావ్య సంఘటన వెనుక కాలం నేపథ్యంగా ఉండి తీరుతుంది. (కావ్యంలో ఋతువర్ణన మిదే) నిత్యజీవితానికి ఇంతే. ఆ దృష్టి వ్యావహారిక మనస్సునకందదు. శాస్త్ర విషయం కనుక.

ఈ ప్రథమాశ్వాసంలో అన్నీ ప్రతీకలే. అవి రాబోయే కథలోని పాత్రలు. దానికివి భావరూపాలు. ఇవే అక్కడ పాత్రలుగా రాబోతూ ఉన్నవి. కాబట్టి బీజరూపాలు.

వర్షామేఘం × శుష్కసితమేఘం (2 వ పద్యం)
శ్వేతాబ్దం × తెలిమొయిళ్ళు (1)

మొదటిది భారతీయ భావనకు–రెండవది ఆంగ్లేయ భావనకు – లేక ఆంగ్లేయ జాతులకు ప్రతీకలు. కాని కాల మహత్త్వం చేత వానికి లేని గొప్పదనం వీటికి వస్తున్నది. ఎలా? మానవ జీవితంలోని వైచిత్రి ఇదే. ఇది వ్యామోహ లక్షణం (చూ. 5 వ పద్యం. తర్వాత కథలోనూ ఉంది.)

శుష్కసిత మేఘముల కబ్బు బుష్కలత్వ
మమృత సస్యోపరి ప్రభుత్వాతిశయము
నవ్యసస్యేందిరా నిదానంబులైన
ధర్మవర్షి మేఘంబు లధఃకరించి. (2 వ పద్యం)

అన్నపద్యం ద్వారా–తర్వాతి పద్యం ద్వారా ఆ వైచిత్రి హేతువు చెప్పబడింది.

సతత వినీల మేఘపరిషత్తులు మిన్నుల గొల్వుదీర్చి సం
గత మధుదానధారల జగంబును దన్పక ధర్మరాజులై
కృతకము లీ మొగిళ్ళగమి కింసఖముల్ చని శ్లేష్మలట్లయా
చితముగ వెక్కవెక్కబడి జీవనముల్ నిలబెట్టుకొన్నవై. (7)

చంద్రగిరి పాలకుల కాలంలో మొదటిసారిగా పాశ్చాత్యుల చెన్నపట్టణంలో కోట కట్టుకోవడానికి అనుమతి పొందటం - చంద్రగిరికో చర్చి కట్టుకోవడాని కనుమతి పొందటం చారిత్రక సత్యం. వెంకటపతిరాయలు తన ఆస్థానంలో క్రీస్తు బొమ్మను పెట్టుకొన్నట్లూ చరిత్ర చెప్పిన సత్యమే. వీరు దానధారల జగ

త్తును తన్నిన మేఘాలు. నాడు వెన్క వెన్క కొదిగిన ఉల్లి మొయిళ్ళు వారు. ఇలా చారిత్రకసత్యాలను దూరదూరాల్లో సూచిస్తూ సాగుతుంది మొదటిఆశ్వాసం. ఎక్కడా కథ వుండదు. అంతా ప్రతీకామార్గాన ధ్వనించడమే.

ఆత్మవస్తువు స్వచ్ఛమే అయినా వికారం పొందడం సృష్టికారణం. ఆ వికృతి పోను పోనూ అధర్మంగా వికసించి చతుర్యుగ పర్యంత మహాకాలంగా వృద్ధిపొందుతున్నదట! ఇందులో కృతత్రేతలు ధర్మరూపాలు. ద్వాపరం ధర్మాధర్మాలకు సమబలం కాగా కలి కేవల అధర్మరూపమౌతున్నదట. ఇది 19 వ పద్య భావం.

అర్థమేమిటి? ఎందుకు చెప్పినట్లు?

శ్రీకృష్ణదేవరాయల వారన్నారు–''అలసతఁ బరున్న మనుజుండు కలియుగంబు

ద్వాపరంబెన్న కూర్చున్నవాడు - త్రేత
ఉత్థితుడు, మఱియాఁ్ఱు, కృతమటన్న
సముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినమె.''

బ్రాహ్మణాలు వేదప్రతీకార్థ వివరణ గ్రంథాలు. కాలం మానవగతికి - మనోగతికి (అది వృత్తి. ఇది ప్రవృత్తి. ఇది దానికి మూలం) ప్రేరణ సూత్రం. సంకేతం. చతుర్యుగాలు ప్రతీకా దృష్టిమీద చెప్పబడ్డ విషయం. దానికి భౌతిక వాచ్యార్థంలేదు. మానవ మనః ప్రవృత్తి బాహ్య చేష్టగా పరిణమిస్తున్నది. ఇందుకే మానవుడు మనస్సునకు బందీ. వాడు అస్వతంత్రుడు. కాల నియతికి లోగిపోతున్నాడు. ఆ మానవ ప్రవృత్తిని కాలరూపంలో చెప్పిన పద్యం పైది. ఈ దృష్టితో విశ్వనాథ పద్యం చూడాలి.

ఎందుకీ భావన ఇక్కడకు తెచ్చినట్లు? ప్రస్తుతయుగమూ - భారతీయుల ఓటమీ- పాశ్చాత్యుల గెలుపూ- వకటే నన్న భావికథా సూచన కోసం చేయబడ్డ వర్ణన. కావ్యమలా ఎందుకు ముగిసిందో హేతు కల్పన చేయడం. ఇది ఐతిహాసిక కవి లక్షణం తప్ప ప్రబంధకవి లక్షణంకాదు. అంటే భారతాదుల్లోనే ఈ విషయాలు చూడదగ్గవి. విశ్వనాథ ప్రబంధకవి కాడు. అందుకే ఆయన పద్యం ప్రబంధ పద్యం లాగా గేయం కాదు. పాఠ్యం. మంతవ్యం.

మృతి భయము లేదు ధర్మాని కితరమునకు
మృతి భయము తక్క వేఱు లేదెంత యైన

సాహసము చేయు ధర్మంబు సమయ మొకడు
తన కననుకూల మౌటచే దగ్గగాని—(23)

ధర్మం=అమృతం. అధర్మం=మృతి. ఇవి వేద ప్రతీకలు. అది నిత్యము. సామూహికము. ఇది అనిత్యం. ఏకదేశం. వ్యష్టి. అది సమన్వయ సూత్రం. ఇది విచ్ఛేద- విభాజన సూత్రం. అది ప్రత్యేకాంశలన్నిటినీ ఏకోన్ముఖం చేసే జ్ఞాన శక్తి. ఇది కేంద్ర బిందువును చెల్లాచెదరు చేసి సమష్టిని విచ్ఛేదించి వ్యష్టిగా తీర్చే అజ్ఞాన శక్తి. ఇదే దేవతా - దైత్యభావ ప్రతీకార్థమున్నూ. ఇందుకే కవి కావ్యంలోని యుద్ధాన్ని దేవ-దైత్య భావ సంఘర్షణగా చిత్రించవలసి వచ్చింది. ఇది పురాణ ప్రతీకం. పురాణం ధర్మ స్వరూపం - ప్రతీక. వైరం అధర్మభావ ప్రతీక. (పురాణ విద్యా విషయం వేరుగా చూచుకోదగ్గది.)

ఇలా సాగిన నాంది చివరిపద్యం స్రగ్ధర. చాలా చిత్రమైన పద్యం.

"శత్రురక్తం సంధ్యాచ్ఛవికాగా- అది కల్పించిన వ్యక్తి నిజయశ-
చ్చంద్రికలు దిగంత వ్యాప్తి పొంది సురజనులకు తృప్తిహేతువైనది."

ఈ భావమెంత సుశ్లిష్టమో వివరించ నక్కరలేదు. కర్తలేని పద్యం. అధ్యాహారం చేసుకోవాలి. ఎవరు?- ప్రస్తుతం ఝాన్సీ లక్ష్మీబాయి. చరిత్రలో- కాలఘట నలో- ప్రాచీనులు- అర్వాచీనులు ఎందరో? అంతా దేవతా మూర్తులే. స్వాతంత్ర్య- ధర్మ- సముపార్జనలో అసువులొడ్డిన అమరవీరులంతా కర్తలే ఈ పద్యానికి- భావానికి. ఆ సంధ్యాకాంతి- యశచ్చంద్రికా- శివమూర్తి చిహ్నాలు. కాలసూత్ర విధాత లక్షణాలు. ఇవే 1-41 పద్యంలో వివృతమైనది.

బహుఖండంబులు— చంద్ర శకలానందంబుగా మౌళిపై
విహరింపంగను జేయు శ్రీ శివు కృపావిర్భూతి మౌగ్ధ్యంబహో!
సహియించున్ బహుదేశతా హృదయ సంధ్యాచంద్రికా వల్లరిన్—

అన్నచోట సంధ్యాతాండవమూర్తి వర్ణన ధ్వనిస్తూ- అదంతా ఆయన కృపా మౌగ్ధ్యంగా చిత్రించాడు. నీకు కాలం రెండుగా కన్పిస్తున్నా- వానికి లేదు. క్రీడానృత్యమే.

[ఇక్కడ కృపామౌగ్ధ్యమన్నమాట తిక్కన్న గారిది.
బలమత్తాకృతియైన- అజాత శత్రుని కృపామౌగ్ధ్యంబ
చాలంగ, వారలకేలా నయవిక్రమోచిత విచార క్లేశముల్ సంజయా!

ఈ పద్యం విశ్వనాథచేత అనేక సభల్లో శిల్పిభూమిగా వ్యాఖ్యాతం కావడంవల్ల ఆ మాట అనుకోకుండా ఇక్కడ చోటు చేసుకోవటం మాట అలా వుంచి ఎంత అందంగా పొసగిందో చూడదగింది.]

భగవత్ కృపామౌగ్ధ్యంచేత అజ్ఞానం జ్ఞానమై అధర్మం ధర్మమైన సంగతి- అది రాజ్యపాలన చేయటం ఎలా సంభవమైనదో ప్రథమాశ్వాస ద్వితీయ ఖండవస్తువు. ఇది ప్రస్తావన వంటిది.

ఇందులో పులి- దేవి వాహనమైన మృగేంద్రం. దేవి ఆజ్ఞచేత ఝూన్సీ లక్ష్మీబాయిగా పుట్టినదని చెప్పబడింది. దేవి ఈ అధర్మాన్ని సహించలేక పులి నాజ్ఞాపించిందట. అది లక్ష్మీబాయిగా జన్మించినదట. దేవి కోపాన్ని చూచిన శివుడు నవ్వుకొన్నాడట. ఎందుకు? కాలధర్మవేత్త కనుక. ఇది తెలిసీ దేవి కోపం వహించటాన్ని చూచీ అది జయించదన్న సూచనగా.

ఈ కల్పన భావ్యర్థ సూచకయే గాక- లక్ష్మీబాయి స్వభావ పవిత్ర క్రౌర్యానికీ- సూచనమౌతున్నది.

ఈ ఖండం పులి వర్ణనతో ప్రారంభమై పులిగర్జతో ముగుస్తుంది. ప్రథమాశ్వాస ప్రథమ ఖండాంతంలోని స్రగ్ధరలోని విషయానికి పులి కర్త.

ఇలా నాందీ ప్రస్తావనలుగా సంతరించబడ్డ ప్రథమ- ద్వితీయ ఖండాలు భవిష్యత్కథా ప్రపంచానికి బీజస్థానం. దేవతా- కారణ- లోకం. ఇదే భౌతిక ప్రపంచంగా పరిణమిస్తూ- కావ్యంగా ద్వితీయాశ్వాసం నుండి అవతరిస్తుంది.

ద్వితీయాశ్వాసం కథాప్రారంభం. పూర్వాశ్వాసం న్యాయంగా భూమిక తప్ప ప్రథమాశ్వాసం కాదు. కాని కవి అలాగే పేర్కొన్నాడు. కాబట్టి భూమిక కథాధారమైన బీజన్యాసాంకంగా పై రీతిగా వివేచించవలసి వచ్చింది.

''ఆ పులి యెందు బుట్టుటను నట్టి విచారణ''తో కథ మొదలు. పార్వతీ దేవి హస్తకమలంతో తల రాచుకొన్నదట. అక్కడ గంగ తగిలింది. దేవి పులిని ఆజ్ఞాపించింది భాగీరథీతీరంలో కాశిలో పుట్టుమని ఈ కల్పన చమత్కారంగా ఉంది. విశ్వనాథ రచనలో బాహ్యదృష్టి కాక్షేపణగా కనిపించే అంశ మొకటుంది. ఉదాహరణకు కవి రచన ఇలా ఉంటుంది. ''ఆ కొండ ఆ ఊరికి తూర్పున చెరువు కెగువగా నున్నది. అది అక్కడే ఏల ఉండవలయును? ఉండవలయును గనుక ఉన్నది'' అంటే ఏమిటర్థం ? ఉండవలయును గనుక - ఈ వాక్యార్థం - ప్రకృతిలో - కాలంలో - ఏది ఎక్కడ

వుండాలో అది అక్కడే వుంటుంది. అంటే విశ్వఘటన, ఒక నిర్మాణాత్మక మైన మహా నాటకం తప్ప అర్థంలేని కొకికికి కవి రచన కాదు. విశ్వభ్రమణం యాంత్రిక మనుకొన్నమాట 19 వ శతాబ్దిమాట. 20 వ శతాబ్ది మాట— ఒక మహా మనస్సుచేత అది నియంత్రితమౌతున్నదే తప్ప లక్ష్యరహిత గమనం కాదు. ఒక మహా విజ్ఞాన శాస్త్రవేత్త అంటున్నాడు—

"పూర్వశతాబ్దాల్లో సృష్టి స్వచ్ఛందమనుకున్నాం కాని ఆలోచిస్తే ఒక బృహన్మనస్సు వెనకవుండి దీన్ని నడిపిస్తున్నట్లు తోస్తుంది."

(సర్ జేమ్స్ జీన్స్)

ఇదే 'కవిర్మనీషీ' – అన్న మంత్రార్థం. కవి మనీషి-ప్రజ్ఞావంతుడు కనుక. ఏది ఎక్కడ వుండాలో దాన్ని అక్కడే సంఘటిస్తున్నాడు కనుక. కాల దేశాధిష్ఠానంగా విశ్వమొక సంఘటన తప్ప అఘటన కాదు. ఇందుకే ఒక మన సత్త్వ శాస్త్రవేత్త అన్నాడు. ఏదీ accident కాదు. నీకు కావచ్చు. దాని పరమార్థం తెలియదు కనుక. తెలిసిన ఆ బృహన్మనస్సున కది Incident-సంఘటన. సన్నివేశం. ఈ కావ్య శబ్ద జాలానికి మూలతత్త్వ మది. జగత్తును నాట్యంగా-నాటకంగా చూస్తే ప్రతిదీ సత్‌ఘటన-సత్ నివేశం.

ఇది విశ్వనాథ పై వాక్యార్థం.

లక్ష్మిబాయి కాశిలో జన్మించటానికి హేతువుగా ఆ కల్పన ఉపయోగించ టమే కాక ఆమె భర్త గంగాధరరావు పీష్వా కనక-శివుడు కనక – దేవీ వాహ నాంశం అతనినే భర్తగా వరించింది. శివుడు కాలస్వరూపుడు-వేత్త, కనక పులి జన్మవేళ నవ్వుకొన్నాడు. నిర్మముడై-ఆత్మస్వరూపుడై. ప్రకృతి స్వరూ పిణియైన పార్వతి కోపించి పులిని లక్ష్మిగా జనింపచేసింది. ఇది కాల విరుద్ధ మని శివుని నవ్వున కర్థం. గంగాధరరావుకి పేరు రాలేదు - చరిత్రలో అతని భార్యకే ప్రసిద్ధి. ఇలా ఒక కల్పన చేస్తే కథ అలా ఎందుకు జరిగిందో - పాత్ర చేష్టలలా ఎందుకున్నాయో వీటన్నిటినీ అది సమర్థిస్తే—అప్పుడది చమ త్కారం. (ఇది అలంకారిక శబ్దం తప్ప అసాంకేతిక-వ్యావహారిక శబ్దం కాదు)

తృతీయాశ్వాసంలో మరొక సంఘటన.

నగరంలో ఉత్సవం జరుగుతున్నది. ప్రజలంతా వేడుక చేసుకొంటున్న సమయంలో ఒక ఆంగ్లేయాధికారి జనమున్నారని చూచుకోకుండా వేగంగా

గుఱ్ఱబ్బండిమీద వస్తున్నాడు. ప్రజలంతా భీతులై పారిపోతుండగా లక్ష్మీబాయి ఆ గుర్రాల కళ్ళాలు పట్టుకొని ఆపి వాడి దురంతాన్ని ఎదురిస్తుంది. వాడు కోపంతో కశతో ఆమెను తాడించబోగా ఆమె తప్పుకొని—

బాధ యన్నదెల్ల ప్రాణులకును సమా
నంబ యచటఁదెలుపు నలఁపు లేదని — బోధిస్తుంది.

ఈ సంఘటన మూడర్థాలతో ముడిపడి వున్నది.

1. ఝాన్సీ లక్ష్మీబాయి తెల్లవారి దురంతాలను మొదటిసారిగా ఇదే చూడడం. ఆమెకో శౌర్యలక్ష్మి నర్తించటానికిదే ప్రారంభం ప్రథమ సంఘటన (బుద్ధజీవితం పంచ ఘట్టాలుగా విభక్తమైనట్లు).
2. ఈ సంఘటను గంగాధరరావు మంత్రి చూచి ఆమెను ఝాన్సీ ప్రభువునకు భార్యగా చేస్తాడు. రాబోయే కథకు రాణి శౌర్యలక్ష్మీనర్తనానికితడు-పరోక్ష గురువు, ప్రారంభకుడు.
3 ఆంగ్లేయుల దుష్ప్రవర్తన కది సూచకమై- ఆంధ్రప్రశస్తిలోని మాధవ వర్మ కథతో వ్యతిరేక సంవిధానకాన్ని సంతరిస్తున్నది.

ఎక్కడి మాధవవర్మ! ఎక్కడి ఈ ఆంగ్లేయుడు! ఇందుకే ప్రథమా శ్వాసంలో భారతీయ ఆంగ్లేయబుద్ధి జాతిని గూర్చి వర్ణిస్తూ కవి—

వినీల మేఘాలు ధర్మరాజులై వార్ధులు దానం చేయగా-
కృతకసిత మేఘాలు తర్వాత తమ జీవనాన్ని నిలబెట్టుకొంటూ
వర్షాలకూ పండిన పంటకు తామే హేతువులన్నట్లు- విహరిస్తున్నవి.

ఈ భావం రెండు జాతుల బుద్ధిస్వభావాన్ని సూచిస్తున్నది. ఇందుకే పై సంఘటనలో ఝాన్సీ లక్ష్మీబాయి వాడికి ధర్మ ప్రబోధం చేసి వదిలిపెడుతుందే తప్ప మాట్లాడకుండ చంపలేదు.

ఇదొక ప్రతీకా దృష్టి. వ్యక్తులను లోపింపజేసి వ్యక్తిత్వంలోని స్వభావాలకు ప్రతీకలు సృష్టించడం. అంటే సంఘటన భావదృష్ట్యా చూడదగిందే తప్ప ఏకదేశగత, ఏకవ్యక్తి విషయికమైన సంఘటనగా చూడకూడదు. అదీ ఉంది. ఇది ఏకదేశ విషయం. ఆ దృష్టితో మొదటి రెండర్థాలు చెప్పబడి-ఇక్కడ దేశ కాలాతీత భావ విషయంగా- ప్రతీకగా వ్యాఖ్యానింపబడుతున్నది. లేకపోతే మాధవవర్మతో పోలిక ఎలా కుదురుతుంది? ఆ కుదరటానికి లక్ష్మి

బాయి చేసిన ధర్మోపన్యాసం కారణం. అది ఆ జాతి లక్షణంగా కవి భావన కనక. ఇందుకే దత్తత చెల్లనేరదని వార్త తెల్పిన ఫరంగితో లక్ష్మీబాయి—

ఇట ధర్మమ్ము నధర్మ మియ్యవియు రెండే యీ యనంతత్వవి
స్ఫుట కాలమ్మున యందు నొక్క నియమసంబొం బట్టి మీ వంటిలం
పటులే తాదృగనేక దృష్టకృతి సామ్రాజ్యంబు సాధించు దు
ర్ఘటముల్ కార్యము లాచరించెదరు దౌరాత్మ్యంబు నిత్యంబుగన్.

ఆ నిత్యమైన సాక్ష్యమే
ఈ నేల పురాణములుగ నెసలారు మహా
జ్ఞాన స్థానములైయా
జ్ఞానము నీ వంటి తెలివి చాల దెఱుంగగన్. (5-43)

ఈ మాటలనగల జాతి స్వభావమేలాంటిదో ! ఆ స్వభావం మీద అధార పెట్టి కవి ఆ పాత్ర నిర్మాణం చేయడం ఆలోచనామృతం. (ఇక్కడ పురాణ శబ్దం కవి వాడటంలోని ఔచిత్యం కూడా చూడదగిందే. కాల లేశ లేశ ఖండాలను ఏకం చేసి అఖండ కాలంగా చూడగల దృష్టికి కాల సనాతనత్వం-మహా కాల (శివ) స్వరూపం — అవగతమౌతుంది. ఈ దృష్టి - అఖండ- ఏకదృష్టి. దాని పేరే జ్ఞానం. ఇది పురాణం. తద్వైరం ఖండదృష్టి ఇక్కడ అఖండ భావన లేదు. అవయవ దృష్టి తప్ప - అవయవి దృష్టి లేదు. "ఆధునిక కాలంలో పరిశోధన పేరు మీదుగా జరుగుతున్న విద్యావ్యాసంగమంతా ఖండదృష్టి మీద అధారపడినట్టిదే ఇది మంచిది కాదు' అని ఒక చోట కీ॥ శే॥ ఆనంద కుమార స్వామి గారన్న మాటలోని అంతర సత్యాన్ని భావించి - చూచిన వారికీ ఖండాఖండ దృష్టి తెలుస్తుంది)

ఈ దృష్టితోనే కవి లక్ష్మీబాయి - ఆంగ్లేయుల యుద్ధాన్ని దైవాసుర సంగ్రామంగా పేర్కొన్నాడు. దైవాసుర సంపద్విభాగమన్న గీతాధ్యాయం మానవ మనోగత ధర్మాధర్మ భావ సంకేత వర్ణనమే. దైవం Centrepetal force అసురుడు Centrifugal force.

(Petnes-Seeking. Fugus-Flying)

కేంద్ర బిందువున కున్ముఖంగా బాహ్య ఖండాలను అన్వయించేది దైవం. ధర్మం. అది అనేకత్వాన్ని ఏ కోన్ముఖంగా చేసే శక్తి కేంద్ర బిందువు నుండి బహిర్గమనం చేసి అనేక దృష్టి కంటిపెట్టుకొని కేంద్రాన్ని విస్మరించి అనే

కత్వాన్ని సత్యమనుకొనే దృష్టి ఆసురీయం. అజ్ఞాన-అధర్మ-సంకేతం. ఒకటి బాహ్యాంభ్యంతర సమన్వయవాదం. మరొకటి కాదు. అది అనురాగ దృష్టి. ఇది ద్వేష దృష్టి. భిన్నత్వంలో ఏకత్వం చూడడం పేరే ధర్మమూ-దైవమూ. కానిది చీకటి. అసురుడు. ద్వేషమంటే సమన్వయం లేకపోవడం. దేనికదిగా చూచుకోవడం. ఇతరంతో విరోధపడటం. ఇదే భౌతిక-నాస్తికదృష్టి (అస్తి=ఉన్నది అది అవిజ్ఞేయమూ - ఆంతరమూ-భావాతీతమూ-శబ్దాతీతమూ. కనుక దర్శన యోగ్యమే తప్ప లౌకిక ప్రజ్ఞ కందదు. దాని పేరు అస్తి.

"వాక్, మనో నేత్రాలకది అందదు. అది 'ఉన్నది'- అంతే"

(కఠం. 2-3-12)

ఇది కేంద్రంగా బాహ్యజీవితాన్ని - అనేకత్వాన్ని - తదున్ముఖంగా దానికిది ప్రతీకగా భావించి మలుచుకొనేవాడు ఆస్తికుడు. అది భావమైతే ఇది శబ్దం. శబ్దం భావ ప్రతీక. లేక వ్యంజకం. శబ్దంలో నిగూఢంగా ఉన్న వ్యంజన శక్తిని సూత్రాన్ని దర్శించగలమే తప్ప - అనుభవించగలమే తప్ప-వ్యాఖ్యానించలేం ఇందుకే ధ్వనికారుడన్నాడు.

"కేవల శబ్ద శాస్త్ర పరిజ్ఞానంచేత ధ్వన్యర్థ దర్శన భావన లేదు''

అదొక వేరే శక్తిచేత లభిస్తున్నది.

## రసదృష్టి

కావ్యం వీర రసాత్మకం కావాలి. కాని కాలేదు. అంటే వీర రసం-అలంకారిక దృష్టి. కాల విచారణమన్న తత్త్వవివేచనకు అంగభూతమై పోవడం వల్ల (కాలవర్ణన ప్రతి ఆశ్వాసంలోనూ వస్తుంది. ప్రధానంగా అది రాణిద్వారా జరగడం గమనార్హం). రసం గుణీభూతమై – అప్రధానమైపోయింది. కవికిది తెలిసి చేసిన పని. కాబట్టి దోషమనడం అజ్ఞాన విలసనం. నాయిక మరణిస్తున్నది. ఉత్సాహం విజయాంతం కాలేదు. మరణాంతమౌతున్నది. కాబట్టి కవి కాలతత్వ విచారణమీద కావ్యాన్ని ఆధారపెట్టి మలచుకోక తప్పలేదు. అలాకాక వీరరసానుకూలంగా ఎందుకు చేయకూడదు? అలాంటి వీరుల మరణం విజయం క్రిందే లెక్కగదా? అని వాదించుకోవచ్చు. నిజమే, కాని కవి కథను కేవలాలంకారిక దృష్టితోనే చూస్తే అలాగే చేయవచ్చు. కాని కవి ఆ కథా సంఘటనమన్న ఏక దేశ వృత్తాన్ని - ఆకుని - మహాకాలమన్న చక్ర దృష్టిలో అంగంగా వ్యక్తీకరించి - ఖండాన్ని అఖండంలో ఒక భాగంగా చూచి స్వాతంత్ర్య సమరం

అపజయం పొందడం కాలదృష్ట్యానే తప్ప స్వాతంత్ర్య వీరుల లోపంవల్ల కాదన్న విశాల దృష్టిచేత - వీరరసం తత్త్వదృష్టికి లొంగిపోయింది. ఇదొక నూత్న నిర్మాణం.

పరగ దదేక దేశపు స్వభావ విచారణ చేసి మూలమై
పరగు మహాపదార్థపు స్వభావము నుత్తము లేర్పరించుకొం
దురు మఱి మధ్యముల్ గురునితో దొలిపస్తువు నేర్చి యేర్పరిం
తురు కలితైక దేశమగు తొల్తటి దాని స్వభావ మచ్చటన్.
అక్కట! యేక దేశమున యందలి మోహమె సర్వవిద్యయై
యక్కట మూలవస్తు పరమార్థ మెఱంగగ లేకపోయెడిన్ -
(1 వ అశ్వాసం)

ఇందుకే కవి ప్రథమాశ్వాసం అలా వ్రాయవలసి వచ్చింది. ఇందుకే కవి తానై ఇలా చెప్పకొన్నాడు:

ఏకదేశవృత్తానికి-అదలా జరగటంలోని పరమార్థాన్ని కవి ఇలా వ్యాఖ్యానించు కోవటం వల్ల కావ్యంలో పాత్ర వ్యక్తిత్వం పెరిగి రసం తరిగిపోయింది. చరిత్రకు కాలతత్త్వదృష్ట్యా అర్థాన్ని చెప్పటం. ఈ కావ్యంలోని ప్రధాన లక్షణం. ఇది ఇతిహాస కవులమార్గం. (అంటే ప్రబంధ, నాటక కవుల మార్గం కాదు. వారిది కేవలం రసమార్గం. కాని మృచ్ఛకటికాదుల వంటివానిలో తత్త్వ విచారణ వుంది. అది రసదృష్టికరంగానే సంఘటితమైనప్పటికీ-).

## శృంగారం

కావ్యంలో ఇది ఏకదేశం. రాణి వైవాహిక ఘట్టం. దీనికి స్థానం. అవి పట్టుమని పది పద్యాలు లేవు. అది కూడ వీరరసభావ స్పర్శతో కూడుకొన్నది. రాజ్యపాలన ఇక్కడ సందర్భం కనుక కవి వీరభావ సహితంగా శృంగార వర్ణన చేయడం ఔచిత్యపరాకాష్ఠ.

"రాణికి రాజ్యపాలన మందర్వది, భర్తతో కలియువేళన్ వింశతి
ప్రాయమున్

రాణి రాజ్యాంగ విషయ ధారా విమర్శ
చేయునప్పుడు దేవతా సింహమూర్తి
లక్ష్మిపతిపద్ద నున్న లలితలలిత
ప్రణయ మాధుర్య సామ్రాజ్య పట్టమహిషి"

రాణి వీరరస నాయిక. లక్ష్మి శృంగార రసనాయిక. ఈ మాటలు క్రింది పద్యంలో వ్యత్యస్తమైనాయి.

లక్ష్మి రాజ్యాంగ విషయ హేలా ప్రసంగ
రూక్షతంగని గంగాధరుండు నవ్వు
రాణి శృంగార హేలా సరాగమధుర
భావముంగని సతి దలపై ధరించు.

నాయిక వీర-శృంగారమూర్తి కనుక వీరంలో శృంగారమూ - శృంగారంలో వీరమూ ప్రదర్శిస్తుంది. ఈ సందర్భంలో వారి విహారం రమ్యంగా వర్ణితమైనది.

"ఆజానేయము లెక్కి యిద్దఱును మేఘాడంబరంబొప్పగా
రాజత్కేళి గిరీంద్ర కానన ధరాప్రాంతంబు లందేగుచున్-"

(ఈ పద్య ప్రారంభం అయోధ్య కాండలోది. ఋతు వర్ణనలు రామాయణం లోనూ, తెలుగు ఋతువుల్లోనూ వున్నాయి. అవే ఇక్కడి పద్యాలు.)

వారిద్దరూ కొండ శిఖరాలమీద విహరిస్తుంటే పర్జన్య దంపతుల్లాగే ఉన్నారట. ఈ ఔపమ్యం క్రింద వర్షర్తు వర్ణనగా అతరించింది.

"వర్షేందిరయు గేళ పాళమ్ము నందలి
మెరుపు బూవులు చూపె మేదినికిని."

ఇది శృంగారోద్దీపనమైనందువల్ల సముదితమూ-సముచితమూ నైన వర్ణన తర్వాతి అశ్వాసం-

ఉర్వీనాథున కయ్యె సుతోదయంబు-తో ఆరంభం కావడం చమత్కారంగా ఉంది. 3½ ఆశ్వాసాల మధ్య 12 మాసాల కాలం భ్రమించింది. 4-చివర శరదృతు వర్ణన. మరుసటి ఏడాదిలో వచ్చిన శరదృతు వనుకోవాలి. కాని కావ్యంలో కాలం-లోకంలో కాలం వకటి కాదు. కావ్యకాలం భావలోకం లోది. లోకకాలం భౌతికం. కాబట్టి ఋతు వర్ణనలన్నీ-ఒక ఏడాదిలోనివైనా కాక పోయినా కావ్యభావనా పథంలో వున్న శ్రోతకు ఆ జిజ్ఞాసలేదు. క్రమమొక్కటే భావ్యం తప్ప ఏ ఏడాదిలోదైనా నష్టం లేదు. (ఒకప్పుడు నాటకాంకాల మధ్య ఈ కాలం గోల విపరీతంగా ఉండేది - ఈ దృష్టితోనే ఇది పాశ్చాత్యం-19వ శతాబ్ది విమర్శ. ఆధునికం కాదు. ఉత్తర రామచరిత్ర ప్రథమాంకానికి - ద్వితీ

యాంకానికి నడిమి కాలం 12 ఏళ్ళు. ఎలా? అని కర్మార్కర్ పండితుడు బాధ పడ్డాడు చాల అనవసరంగా. (ప్రేక్షకునికి ఆ అంకం తర్వాత ఈ అంకం వెంటనే వస్తున్నపుడు 13 ఏళ్ళో-12 ఏళ్ళో అనుభవంలో లేదు. కాని దాని విమర్శ కావ్య విమర్శ కాదు)

చివరకు రాణి మరణిస్తుంది. అక్కడ కవి రస వర్ణన చేయవచ్చు. చేయలేదు. ఈ కావ్య నిర్మాణాని కది విరుద్ధం కనుక.

యుద్ధంలో ఆమెను పొంచి వెనుకపాటుగా చంపటానికి యత్నిస్తాడు ఒక శత్రువు. ఆ పద్యం తర్వాత—

రాజకీయంబులందున రణమునందు
మ్లేచ్ఛనీతియే మఱి విడంబించుచుండు—నని వ్రాసి
పరమ మాహేశ్వర మహః ప్రపాలితాత్మ
ధునియునై దుష్టకాల రోధో నియమిత
''నా వసుధ వందయేండ్లు నిండవు ఫరంగి''
కనుచు శపియించి రాణియు గనులు మూసె.—నని

కావ్యం ముగించాడు ఈ ముగింపు ఎంత అందంగా ఉంది! ఇంకొక మాట ఏది వ్రాసినా దాని అందం చెరిగి పోతుంది.

వంద ఏండ్లు అన్నమాట ఎంత ఉచితంగా పవిత్రంగా వుంది! ఆ మాట అన్నది 1857 ఏప్రియల్ నెలలో సరిగ్గా అలాగే జరిగింది. వంద మానవ జీవితావధిగా వేదమంటున్నది.

ఎపుడు ఆత్మహంతో వాడికి శతపర్యంత జీవితం లేదు. పరిపూర్ణ జీవితం లేదు. లౌకికా లౌకిక సమన్వయరూప పూర్ణవృత్తం జీవితం. ఆ పూర్ణత్వం శతం. అది లేనివాడు కనుక వాడంతరించాడు. తెలిసిన వ్యక్తి గనుక అలా శపించ గలిగింది.



# ముదిగొండ వీరభద్రమూర్తి గారి
# వందే మాతరం

-డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు

ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యం పది కాలాలపాటు ఆగామితరాలకు అందించే ఉత్తమ కావ్యాలలో వందేమాతరం నిస్సందేహంగా ఒకటి. ఇది చాలా గొప్పకావ్యం. ఇరవయ్యో శతాబ్దపు ప్రాతినిధ్యం వహించే మహా కావ్యాలలో వందేమాతరం ఇంకా కొన్ని శతాబ్దులవరకు భావుకజన ప్రీతిపాత్ర మవుతుంది. ఈ కావ్య వస్తు గౌరవాన్నిబట్టి, రచనా శిల్పాన్నిబట్టి, కవితా శక్తినిబట్టి ముదిగొండ వీరభద్రమూర్తిగారు ఈ తరం కవులలో ఘనమైన స్థానం సంపాదించుకున్నారు.

మనకు బాగా తెలిసిన ఇటీవలి భారతదేశ చరిత్రలో బౌద్ధమత ప్రాభవం, కళింగయుద్ధం, ఆదిశంకరుల జననం తర్వాత అంతటి చరిత్ర ప్రాధాన్యం గల ఘట్టం భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనం. గడచిన వెయ్యేళ్ళ భారతదేశ చరిత్రలో అత్యంత ప్రధానమైన ఘట్టం, పరమోజ్జ్వలమైన ఘట్టం ఇది. మన దేశ చరిత్ర గతి నే పూర్తిగా మార్చివేసిన ఘట్టం ఇది. భారతీయులు ఒక జాతిగా సుసంఘటితమై ఆసేతు శీతాచలం స్వాతంత్ర్య సమరశంఖారావంలో తమ గళాలు విచ్చి మ్రోసిన చరిత్ర ఇది. సత్యాగ్రహ మంథాచలం త్రచ్చి తెచ్చిన సుధావిర్భావ ఘట్టమిది. కలకాలం స్మృత్యుజ్జ్వలంగా తరతరాలు సంభావించుకోవలసిన భారతమిది. రామాయణమిది. మహాభాగుల భాగవతమిది.

దీనికి వీరభద్ర మూర్తిగారు 'వందేమాతరం' అని పేరు పెట్టారు. స్వాతంత్ర్య సముపార్జన దీక్షకిది పంచాక్షరిగా పని చేసింది. 1857 లో సిపాయిల తిరుగుబాటు తర్వాత 1905 లో వంగదేశాన్ని విభజించిన ఘట్టం వరకు భారతదేశ చరిత్రను కథావస్తువు చేసుకున్నారు కవిగారు. చరిత్రకు సాహిత్యాకృతి కల్పించటం చాలా కష్టం. సాహిత్యాన్ని చరితార్థం చేయగల కవి

మహా ప్రతిభావంతుడై ఉండాలి. ఈ కావ్య నిర్మాణాన్ని చూస్తే శ్రీ వీరభద్ర మూర్తిగారి కటువంటి ప్రతిభ పుష్కలంగా ఉన్న విషయం తెలిసిపోతుంది. ఈ అర్ధశతాబ్ది ఆధునిక భారతదేశ చరిత్రలో ఎన్నెన్నో ఘట్టాలు, ఎందరెందరో నాయకులు, అతివాదులు, మితవాదులు పరస్పరం సంఘర్షించిన సన్నివేశాలు. ఏకవాక్యత లేదు ఇతివృత్తంలో. అయినా మహా ఫలాభిముఖంగా ఉద్యమాలెన్నో పొంగి పరవళ్ళు తొక్కాయి. దేశభక్తి కూడా ఒక నవీన మతోద్యమ రూపాన్ని సంతరించుకొన్నది. దేశంలో సాంఘికార్థిక రాజకీయ మత నైతిక ఆధ్యాత్మిక సాధనలన్నీ భారతమాత గళంలో అలంకరించే స్వాతంత్ర్యోద్యమ తారహారంలో పేటలే అయిపోయినవి. ఈ హారాన్ని అందరూ కలిసి గుచ్చాలి. తొందరగా అమ్మ మెడలో అలంకరించాలి అని ఆబాలవృద్ధం తహతహలాడింది. అయితే స్వాతంత్ర్యోద్యమ స్వరూపం 1905 వ సంవత్సరం వరకూ స్పష్టంగా ఒక స్వరూపాన్ని ధరించలేదు. సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతీయుల ఆదర్శం. దాన్ని సాధించి తీరుతాం అని దాదాభాయి నౌరోజీ, బాలగంగాధర తిలక్ మహాశయులు వంగ విభజనను ప్రభుత్వం ఉపసంహరించుకొనేటట్లు సాగించిన మహోద్యమంలో విస్పష్టంగా ప్రకటించడంతో స్వాతంత్ర్యోద్యమం ఒక ప్రధాన ఘట్టం చేరుకొన్నది. ఈ అర్ధశతాబ్ది చరిత్రను, ఆ కాలపు భారతీయుల సామాజిక పథయాత్రను త్యాగమయ సాహస జీవితాన్ని వీరభద్రమూర్తిగారు కావ్యబద్ధం చేశారు. ఈ కావ్యాన్ని రచయిత 18 ఖండాలుగా విభజించడం ఇది ఆధునిక మహాభారత మన్న స్ఫురణం వ్యంజింపచేయడమే. 18 సంఖ్యకు భారతీయ సాహిత్య ప్రస్థానంలో విశిష్టమైన స్థానం ఉన్నది.[1] వందేమాతరం మహాకావ్యంగా నిబంధింపచేయటానికే పద్దెనిమిది ఖండాల విభాగమూ, అందుకు వొదిగే కథ, వర్ణనలు, శిల్ప నిర్మాణమూ రచయిత ప్రతిభాసముపేతంగా రాశీకరింపచేసుకున్నారు.

---

1. శ్రీ మద్రామాయణం బాలకాండ 18వ సర్గంలో శ్రీరామావతార వర్ణనం. భగవద్గీతలో 18 అధ్యాయాలు. భారతయుద్ధం 18 రోజులు జరిగింది. ఇరుపక్షాల సైన్యాం 18 అక్షౌహిణులు. ఉపపురాణాలు. 18 ధర్మశాస్త్రాలు 18. ''తతోజయ ముదీరయేత్'' భారతానికి జయమనే నామాంతరమున్నది. సంఖ్యాశాస్త్రాన్నిబట్టి 'జయ'మంటే 18 'వందేమాతరం' కావ్యం కూడా భారత స్వాతంత్ర్య జయధ్వానం.

మహాభారత యుద్ధంలోని మహావీరులకు తీసిపోరు భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న మహావీరులు. అయితే ఎటొచ్చీ హింస, రక్తపాతం, కుట్రలు, కుహకాలు, ఆధునిక మహాభారతయుద్ధంలో వెనకటి యుగంలోవలె సంభవించలేదు. ఆ మహాభారతయుద్ధం పద్దెనిమిదిరోజులు జరిగి పద్నాలుగేళ్ళ వ్యవధానంలో ఫలితానికి వచ్చింది. ఈ ఆధునిక మహాభారత యుద్ధం సుమారు నూట నలభై సంవత్సరాలుగా రాజుకొంటూ వచ్చింది.

''ప్రతి తరంలోనూ ఆ తరానికి వినిపించాల్సిన వీరగాథ ఉంటూనే ఉంటుంది. దాన్ని వినిపించే కవికూడా ఉంటూనే ఉంటాడు,'' అని కురుక్షేత్ర మనే తన మహాకావ్యానికి ఉపోద్ఘాతంరాస్తూ నానాలాల్ అనే గుజరాతీ మహాకవి అభిప్రాయ పడ్డారు. ఈయన ఈ శతాబ్దివాడే. ఆధునిక గుజరాతీ కవితకు ఈయన ప్రస్థానా చార్యుడు. లయాత్మకమైన శైలినిరూపించి నవకవితాయుగ కర్తగా కీర్తితుడైనవాడు. పదివేల చరణాలతో పన్నెండు పర్వాల కురుక్షేత్ర మహాకావ్యం రచించాడు నానాలాల్. కథను పాత్రలను వ్యాస మహా భారతం నుంచే స్వీకరించినా ఒక స్వతంత్ర మహా కావ్యంగా రూపొందించారు దీనిని ఆకవి. బైబిల్‌నుంచే కథా స్వరూపాన్ని గ్రహించి మిల్టన్ కవీశ్వరుడు 'ప్యారడైజ్ లాస్ట్' రచించినట్లుగా మహాభారత గాథేతి వృత్తంనుంచి కురుక్షేత్ర రూపొందించారు నానాలాల్. 'మహాకావ్య ఆకృతిని గూర్చి నాభావన ఏమిటంటే అది మహాపురుషుల,మహావీరుల అద్భుత సాహస పరాక్రమ ప్రదర్శకమైనదివ్యగాథగా ఉండడమే' అని ఆ కవీశ్వరుడు తన మహాకావ్య ఉపోద్ఘాతంలో వివరించారు.[2]

వీరభద్రమూర్తిగారి వందేమాతం పద్దెనిమిది ఖండాలుగా విభక్తం కావటం ఆధునిక మహాకావ్యమిది అనే స్ఫూర్తిని సముద్దీపితం చేస్తున్నది. దాదాభాయ్ నౌరోజి, లాలా లజపతిరాయ్, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణ గోఖలె, అరవింద ఘోష్, రామకృష్ణపరమహంస, స్వామి వివేకానంద మహాపురుషులు, మహావీరులు. వాళ్ళ చరిత్ర అద్భుత సాహస పరాక్రమ, త్యాగ సంభరితమైనది. ఈ మహాపురుషుల దివ్యోజ్జ్వల జీవిత చారిత్రక ఘట్టాలను, వారి ప్రబోధాలను, కవితా పుష్పదామకంగా సంగ్రథితం చేశారు. ఈ మహాకావ్యమొక గజమాల.

---

2. నానాలాల్-యు. ఎమ్. మనియార్-భారతీయ సాహిత్య నిర్మాతలు-అనే పరంపరా ప్రచురణలు, సాహిత్యఅకాడెమి-న్యూఢిల్లి-1979.

వందేమాతరం అంటే తల్లికి కైమోడ్పు. ''తుమిదుర్గా దశప్రహరణ ధారిణీ, కమలా కమల దళవిహారిణీ, వాణీ విద్యాదాయినీ, నమామిత్వాం'' అని బంకిం చంద్రుడు గానంచేశాడు.[3] అంటే భారతమాతనే ముగురమ్మల మూలపుటమ్మగా భజిస్తూ గానం చేశాడాయన. 1857 వ సంవత్సరంలో ప్రథమ స్వాతంత్ర్య విప్లవం విఫలమైపోయిన తర్వాత జాతీయతాశక్తిని సమీకరించుకోక పోతే భారతమాత దాస్యశృంఖలావిచ్ఛేదం సాధించలేము అని భారతీయ మేధావులు, కవులు, కళాకారులు గ్రహించారు. అందువల్ల ఈ దేశమే మన తల్లి అని, ఆమెను అర్చించటమే దేశీయుల కర్తవ్యమనీ, ఇహ పరదాయకమనీ వారు బోధించసాగారు. అటుతర్వాత ఒక అర్ధ శతాబ్దిలో వంగదేశ విభజన ఘట్టానికి చేరే సమయానికి ఆసేతు శీతాచలం 'భారతమాత' అనే గాఢ భావం రూపొందింది.

---

3. బంకించంద్ర ఛటర్జీ (1838-1894) ప్రముఖస్వాతంత్ర్యోద్యమ నిర్మాత. ఆధునిక భారతీయ సృజన సాహిత్య నిర్మాతలలో అత్యంత ప్రతిభావంతుడు. మేధావి. ప్రాక్పశ్చిమ సాహిత్య సాంస్కృతిక సమన్వయ విశారదుడు. 1875 వ సంవత్సరంలో 'కమలాకాంతర్‌దప్తార్' అనే ఆయన నవలలో 'అమర దుర్గోత్సవ' అనే ఘట్టంలో సర్వశక్తిసంపన్న, దశభుజ అయిన శ్రీ మాత స్వరూపానికి రేఖా చిత్రాకృతి జరిగింది. 1874 వ సంవత్సరంలోనే వందేమాతరం గీతం రచితమైందనీ, అటు తర్వాత 'ఆనందమఠం' నవలలో సందర్భోచితంగా ఈ గీతం ప్రవేశించిందనీ విమర్శకులు భావిస్తున్నారు. 'ఆనందమఠం' నవల 1882 లో వెలువడింది. వందేమాతరం గీతం 1886 లో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రెసు సమావేశం (కలకత్తా)లో పాడినట్లు వేత్తలంటున్నారు. అరవిందునిపై ఆనందమఠ ప్రభావం చాలావుంది. బంకించంద్రుడు తన ముగ్గురు కూతుళ్ళకు శరత్‌కుమారి, నీలాబ్జకుమారి, ఉత్పలకుమారి అని పేర్లు పెట్టాడు. మన వీరేశలింగంగారికి 1893 లో, బంకించంద్రుడికి 1892 వ సంవత్సరంలో ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం 'రావుబహదూర్' బిరుదు నిచ్చింది. కలకత్తా విశ్వవిద్యాలయ తొలి పట్టభద్రుడు బంకిం చంద్రుడు. 1858 లో 20 సం. ల వయసున ఆయన పట్టభద్రుడైనాడు.

వంగదేశంలో భక్తి ఉద్యమంద్వారా జనసామాన్యంలో గేయ సాహిత్యానికి బాగా ప్రచారం లభించింది. చైతన్యుడు, అటుతర్వాత శక్తి పూజాపరులు, అసంఖ్యాకమైన గీతాలద్వారా భక్తిసంస్కృతిని ప్రచారం చేశారు. శ్రీ రామకృష్ణ పరమహంస, రామప్రసాదసేన్ రచించిన కాళికాదేవికి సంబంధించిన గీతావళిని ఎప్పుడూ పాడుతూ వుండేవారట. అటుతర్వాతి కాలంలో కవులు దేశభక్తి గీతాలు రచించి సభలు సమావేశాలలో గానంచేయడ మనే సంప్రదాయం కూడా వంగ దేశంలో ప్రారంభమైంది.

దేశ సంస్కృతిని, సంపదను కీర్తిస్తూ దేశభక్తిని ప్రబోధించే గీతాలు స్వయంగా పాడి కవులు దేశీయుల చైతన్యాన్ని ఆ రోజుల్లో ఉజ్జీవింపచేశారు. అధునిక భారతదేశంలో అన్ని ఉద్యమాలకు ముందంజ వంగ రాష్ట్రానిదే.

దేశ సంపదను విదేశీయులు ఏ విధంగ కొల్లగొట్టుకొని పోతున్నారో, దేశం ఏ విధంగా దరిద్రస్థితిని చేరుతున్నదో, ఈ విషమ పరిస్థితులను అరికట్టా లంటే ఏంచేయాలో ముందుగా ప్రబోధించింది కూడా వంగరాష్ట్రమే. దేశీయ పరిశ్రమలు క్షీణించిపోకుండా చూడవలసిందిగా నాటి దేశభక్తులు ప్రబోధించారు.

''ఈలాటి వారిలో బెంగాలు రాష్ట్రంలో ఈ కార్యక్రమాన్ని నడిపించిన వాడు నబగోపాల్ మిత్ర. ఇతనికి ఈ విషయంలో 1866 ప్రాంతాన జాతీయ భావాభివృద్ధి సంఘం అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించిన రాజనారాయణ బోసు మార్గదర్శి. ఆ రోజులలో ఇంగ్లీషు విద్య నభ్యసించిన బెంగాలీ యువకులు పాశ్చాత్య సంస్కృతిపట్ల వ్యామోహం కలవారై విచక్షణారహితంగా పాశ్చాత్యు లను అనుకరించడం పరిపాటిగా ఉండేది. ఈలాటి వ్యామోహంనుండి వారిని విముక్తులనుచేసే ఉద్దేశంతో బోసు తన సంఘాన్ని స్థాపించి కొంత విజయాన్ని సాధించాడు. అతడు చూపిన మార్గంలో నడిచే ఉద్దేశంతో మిత్ర 1867 లో కలకత్తాలో హిందూమేల అనే సంస్థను స్థాపించాడు. ఒక బెంగాలీ ప్రజలలోనే కాక యావద్భారత ప్రజలలో జాతీయ చైతన్యం కలిగించడమే అతని ఉద్దేశం.

''ఇందుకుగాను అతడు ఏటేట దేశంలోని వివిధ ప్రాంతాలలో తయారైన వస్తువుల ప్రదర్శనాన్ని ఏర్పాటు చేసి స్వదేశ వస్తువులపట్ల ప్రజలకు గాఢాభి మానం కలగడానికి దానిని ఒక పటిష్ట సాధనంగా ఉపయోగించాడు. ఈ ప్రదర్శనలు 1880 వరకు చాల విజయవంతంగా కొనసాగాయి. ప్రదర్శనలతోపాటు

అతడు కవి సమ్మేళనాలను కూడా ఏర్పాటు చేసేవాడు. బెంగాలీ భాషలో ప్రధానంగా జాతీయ గీతాలను రచించినవారు ఈ సమ్మేళనాలలో పాల్గొన్నకవులే. బంకించంద్రుసికి వీరు మార్గదర్శకులయ్యారు.''4

వందేమాతరం మహాకావ్యంలో వీరభద్రమూర్తిగారు నవగోపాల్‌మిత్రాచే కుమార సంభవం కథ చెప్పించారు. ఈ మహాకావ్యం ఆద్యంతాలు వంగదేశ రంగస్థలాలు. కాళీఘట్టంలో కథ ప్రారంభమై కలకత్తా కాంగ్రెస్‌తో కావ్య పరిసమాప్తి అవుతున్నది. దీనివల్ల కావ్యానికి ఒక ఏక వాక్యత, సమావర్తులత్వం, నిర్మాణ శిల్పం భాసమానమవుతున్నాయి.

ఏక నాయకాశ్రయమైన ఇతివృత్తమూ, నాయకుని సాఫల్య వైఫల్యాలు, పతాక సన్నివేశం మొదలైన ఘట్టాలు కూర్చడానికి లేకపోయినప్పటికీ పద్దెనిమిది ఖండాలలో అంతస్సూత్రం ఉండనే ఉంది. అదేమిటంటే మాతృమూర్తి పారతంత్ర్యనిగళచ్ఛేదనం. అందువల్ల రసనిష్కర్షకూడా చేయవచ్చు. ఈ మహాకావ్యంలో ప్రతీయమానమయ్యే రసం భద్రవీరం. వీరభద్రం అనికూడా అనవచ్చు. వీరం లేనిదే భద్రం లేదు. ఇవి రెండూ పరస్పర సమాశ్రయాలు. వీరపూజ, వీరస్మరణం, వీరుల మార్గ దర్శకత్వం ఉండాలి ఏకాలంలోనైనా ఏ దేశంలోనైనా, ఆ కాలం, ఆ దేశం భద్రతాస్థితిని ప్రాపించటానికి అని ఈ కావ్యం ప్రబోధిస్తున్నది మహాభాష్యంలో మంగళార్థక శబ్దాన్ని వీరశబ్ద పర్యాయ వాచిగా ప్రయుక్తం చేసినట్లు విజ్ఞులు పేర్కొన్నారు 5

మంత్రశాస్త్ర పరంగాకూడా వీరశబ్దం సాధకపర్యాయపదంగా ప్రయుక్తం వీతరాగుడు నిర్భయుడు నిర్ద్వంద్వుడు నిష్కుతూహలుడు...అయివీరుడు అని కులార్ణవ తంత్రంలో వీరశబ్దం వ్యాఖ్యాతమైనట్లు భారతదేశంలో వీరారాధన తత్వ

4. భారత స్వాతంత్రోద్యమ చరిత్ర - రెండవ భాగము (1858- 918) : ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య ; పుటలు 56 - 57 -'976.

5. ''వీరారాధనం భారత వర్షానికి నూతనం కాదు. మంగళాదులు, మంగళ మధ్యాలు, మంగళాంతాలు అయిన శాస్త్రాలు ప్రసిద్ధి చెందుతున్నవి. ఆయుష్మత్పురుషకాలు, వీర పురుషకాలు అవుతున్నవి. (వాటిని చదివిన వారు ఆయుష్మంతులు వీరులూ అవుతున్నారు.)'' అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు-పల్నాటి వీరచరిత్ర పీఠిక - 68 - 70 (1938)

రత్వం గురించి ఉమాకాంత విద్యాశేఖరులు తమ పల్నాటి వీర చరిత్ర పీఠికలో ప్రస్తావించారు.

వందేమాతరం కావ్యంలో ధర్మవీరులు, దయావీరులు, దానవీరులు, భద్ర వీరులు ఎందరెందరో ఉన్నారు. వారి అద్భుతచరిత్ర మీ కావ్యం.

ఏతావతా అష్టాదశ పర్వనిర్వహణ సంభృతమై పెనుపొందిన ఆధునిక మహాకావ్యం వందేమాతరం. సుందరోజ్జ్వల వృత్తము. మహాఫలము.. వీరంలేనిదే భద్రంపొంది పొసగదన్న మహాధ్వనిరాత్మకము. వీరభద్ర మూర్తితము. వీర భద్ర స్ఫూర్తితము.

కవితాశక్తి పుష్కలంగా ఉన్నవారు వీరభద్రమూర్తిగారు. అందువల్ల చరిత్రకు కావ్యత్వాన్ని, సాహిత్యానికి చారితార్థ్యాన్ని అనుసంధానింపగలిగారు.

క్షామ ఖండము, హోలీ ఖండము, కుమారసంభవ ఖండము, శౌర్య ఖండము, రానడే ఖండము, ఫాడ్కే ఖండము, హైదరాబాద్ ఖండము, దయానంద ఖండము, కాంగ్రెస్ ఖండము, పరమహంస ఖండము, వివేకానంద ఖండము, లోకమాన్య ఖండము, అరవింద ఖండము, భవానీమందిర ఖండము, ఇంగ్లాండ్ ఖండము, బెంగాల్ ఖండము, ఉద్యమ ఖండము, స్వరాజ్య ఖండము అనేవి ఈ కావ్యంలోని పద్ధెనిమిది ఖండాలు.

మొదటి ఖండం క్షామ ఖండం. భారతదేశాన్ని అతి భయంకరంగా పీల్చి పిప్పి చేసిన కరువుల గూర్చిన వర్ణన ఈ ఖండంలో కనపడుతుంది. బ్రిటిషువారి పరిపాలనలో భారతదేశం క్రమక్రమంగా దుర్భరమైన దరిద్రస్థితిని చేరుకున్నది. దేశసంపదనంతా తెల్లవారు కొల్లగొట్టారు. బంగారు రాశులన్నీ విదేశానికి తరలి వెళ్ళాయి. దేశీయ పరిశ్రమలన్నీ నాశనమైనాయి. రైతులెందరో వ్యవసాయ కూలీలైనారు. భారతీయ కళా సంపద అంతా రూపరిపోయింది. కులవృత్తులన్నీ కూలిపోయాయి. పరిశ్రమలన్నీ పాడైపోయినాయి. తరచు కరవురక్కసి విలయ తాండవానికి భారతభూమి రంగస్థలమైంది. 1757 వ సంవత్సరంలో రాబర్ట్ క్లైవ్ మూర్షిదాబాద్ లండన్ నగరమంత పెద్దదిగాను, అంత జనసంఖ్యకలదిగానూ ఉన్నదనీ, అంతేకాకుండా లండన్ నగరంలోకన్నా మూర్షిదాబాదులో అధిక ధనవంతులున్నారనీ వ్రాశాడు. అటువంటిది నూరు సంవత్సరాలలో వ్యాపార వాణిజ్యరంగాలలో భారత దేశాన్ని బ్రిటిషువారు సర్వశక్తులా దోచుకున్నారు.

మాంచెస్టర్ నగరంలో మంచినీటి సౌకర్యంకోసం ఒక్క సంవత్సరం ఖర్చుచేసిన ధనం భారతదేశంలో పదేళ్ళ కాలంలో కూడా విద్యాభివృద్ధి నిమిత్తం బ్రిటిషు వాళ్ళు ఖర్చుపెట్టలేదు. అంతేకాకుండా భారత దేశం ప్రజానీకం కనీవినీ ఎరుగని పన్నులెన్నిటినో విధించి గ్రామీణ వ్యవస్థను, ఆర్థిక జీవనాన్ని ఛిన్నాభిన్నం చేశారు. 1850 ప్రాంతాలకు మన దేశంలో సంభై శాతం ప్రజలు చాలీచాలని ఆహారంతో ఒకపూట తిండికోసం దేవులాట అనుభవించవలసిన వారైనారు. 1857 కు పూర్వం తెల్లవాళ్ళకు భారతదేశం పట్ల ఏ కొంచెమో సుహృద్భావం, స్వప్రయోజన కాంక్షతోనే కావచ్చు-వుంటూవుండేది. ప్రథమ స్వాతంత్ర్య విప్లవంతో అది పూర్తిగా తుడిచిపెట్టుకొనిపోయి విద్వేషం పెచ్చుపెరిగిపోయింది. భారత దేశం తమకు దైవదత్తమనీ, ఆ దేశ ప్రజలను ఎంతగా పీడించినా అది అన్యాయంకాదనీ, అందుకా ప్రజలు దైవవంచితులై ఆ కష్టాలు అనుభవించాల్సిందేననీ భావించసాగారు. భారతదేశంలోని వివిధ ప్రాంతాలు 1860-1908 మధ్య కాలంలో ఇరవై సంవత్సరాలు తీవ్రమైన క్షామానికి గురి అయినాయి. 1876 నుంచి 1900 సం॥ల మధ్య సంభవించిన క్షామ పరిస్థితులలో భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో తిండిలేక కోటి ఏడులక్షలమంది ప్రజలు చనిపోయినట్లు అంచనా.[6] 1897 వ సంవత్సరం సంభవించిన తీవ్రమైన క్షామంలో 70 వేల మైళ్ళ భారత భూభాగంలో రెండుకోట్లమంది ప్రజలు అష్టకష్టాలు అనుభవించారు.

---

6. "విపరీతంగా పెరిగిన ధరలనుపెట్టి తిండిగింజలను కొనగల సామర్థ్యం లోపించడమే దీనికి ప్రధాన కారణం. ప్రజలు అనుభవించవలసిన దారిద్ర్యానికి ఇంతకంటె తార్కాణం అవసరంలేదు."

-భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర - ద్వితీయభాగం-పుట 47 - శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య - 1976.

"దేశములో కరవులు వచ్చినవి. అవి ఆహారధాన్యములు పండని కారణముల చేతకన్న వాటిని కొనుక్కొనేటందుకు తగిన ధనము లభింపమిచేత లక్షల కొలది ప్రజల మరణములకు కారణభూతములైనవి. క్షామదేవత, మృత్యుదేవత లిద్దరును దేశములో తాండవిస్తూండగానే ఢిల్లీలో దర్బారు జరిపి ఇంగ్లండు రాణిగారు "ఇండియా చక్రవర్తిని" అని బిరుదమును తాల్చిరి" - పుట 6 - కాంగ్రెసు చరిత్ర - భోగరాజు పట్టాభి సీతారామయ్య- (అను. కొడాలి ఆంజనేయులు-1935)

వందేమాతరం కావ్యం 1860 వ సంవత్సరం వంగ దేశంలో నీలిమందు వ్యాపారాన్ని గుత్తాధిపత్యం కింద వశం చేసుకొన్న బ్రిటిషు పెట్టుబడిదారులు, భారతీయ రైతులను ఏ విధంగా బాధలు పెట్టిందీ వర్ణిస్తూ ఆరంభమైంది. బ్రిటిషు యజమానులు పెట్టే బాధలను సాత్విక నిరోధంతో రైతులు ఎదిరించారు.

వీరభద్రమూర్తి గారి కవితాత్మలో పరిహాసకుశలతకు ప్రత్యేక స్థాన మున్నది. అది ఎటువంటి గంభీర సన్నివేశంలోనూ, కరుణావిలమైన ఘట్టం లోనూ ఏ మాత్రం సందర్భపడినా తొంగిచూస్తూనే ఉంటుంది. తమ గోడు వినిపించడానికి, మొరపెట్టుకోవటానికి వెళ్ళిన రైతులను రాస్కెల్స్ అని ఈసడించారుట బడా పెట్టుబడీదారులైన తెల్లదొరలు. అప్పుడు రైతులన్నారుట 'అంత పెద్ద బిరుదులు మాకెందుకు లెండి మీరే ఉంచుకోండి' అని. ఆ వల్లడి రోజు లెట్లావున్నాయట.

"పిలిచిననుంబయి జూచుట
తలపింపద తప్పుగాగ దమకించిసభ
స్థలమున నల్లని రేకను
తిలకింపన్ గోరి ప్రజలు దృష్టినిగుడ్పన్"

ఏమిరా పిలుస్తుంటే పైకి చూస్తావు అని తెలగునుడికారం. దీన్ని ఈ విధంగా ప్రస్తావించారు కవిగారు.

---

"The Period from 1876 has been called the seed time of Indian nationalism. Lord Lytton held his famous Delhi Durbar in 1877 at a time when the people of south India were suffering terribly from the destruction brought about by famine... An appropriate comment was made in these words." Nero was fiddling while Rome was burning".

—The Nationalist movement in India and its leaders—V.D. Mahajan-1962, PP-5-6.

ఎంత కరవైన ధనికుడు కొంత కొంత
తట్టుకొనవచ్చు, దీనుని తరము కాద
ఆపగా ప్రవాహము కోతకాగవచ్చు
గండశిలకొంత, తరువున కాగవశమె.

ధనికుడు ఒట్టి బండరాయిలాంటివాడని ధ్వని.

ఆ కరవు ఎంత భయంకరంగా ఉన్నదంటే ఒక్క చినుకు వర్షం పడలేదు.

పానీయంబే మృగ్యము
స్నానీయ జలమ్ము మాట శంకరుడెరుగున్
గానంబడియె శివాలయ
మై నభము విభూతి పండ్లునై చిరుమొగిళుల్-

ఇక్కడ భక్తి భావంతో పాటు చమత్కృతి కూడా తరంగితమవుతున్నది. ''పరమేశా గంగ విడువు పార్వతిచాలున్'' అని శ్రీనాథుడిదిగా చెపుతున్న చాటువు తెనాలి రామకృష్ణుడు చెపుతున్నట్లు కనిపిస్తున్నది. రససిద్ధుడైన మహాకవి ధూర్జటికి పండు వెన్నెలలో ప్లావితమవుతున్న ఇలావలయమంతా క్షీరధారలతో స్నపితమవుతున్న మరకతలింగమూర్తిగా సాక్షాత్కరించిందట. మన వీరభద్రమూర్తి గారికి పింజమొబ్బులు విభూతి పండ్లలాగా కన్పించాయి. అంటే వాన కాలంలో కూడా దూది పింజెల్లాగా మబ్బులు తేలిపోతున్నాయని అర్థం.

ఎర్రన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు అన్నారు విశ్వనాథకల్పవృక్షావతారికలో పూర్వకవి స్తుతిపరంగా. అట్లానే వీరభద్రమూర్తిగారు సర్వపూర్వ మహాకవి మార్గేచ్ఛా విహారుండు అని అనవచ్చేమో! ఏమంటే శ్రీనాథుని రస ప్రసిద్ధధారాధునిత్వం, తెనాలి రామకృష్ణుని స్నిగ్ధవర్ణముగ్ధాకృతి, చతురపదవిన్యాసధన్యాసిక అయిన కవితాతత్త్వం, వీరభద్రమూర్తి గారి కవిత్వంలో సాక్షాత్కరిస్తాయి. రామకృష్ణునిదే అయిన పరిహాసకుశలత సరేసరి.

ఈ మొదటి ఖండంలోనే వంగదేశ పీడిత జనాళిని శ్రీ రామకృష్ణ పరమహంస ఏ విధంగా ఆదుకొన్నదీ హృదయంగమంగా వర్ణించారు కవిగారు. ఈ పద్దెనిమిది ఖండాలలోను అనుస్యూతంగా భారతదేశానికి, కాళికాదేవికి అంటే మహాశక్తికి ఒక అభేదాన్ని ధ్వనింప చేస్తూనే ఉన్నారు వీరభద్రమూర్తిగారు. ప్రజలలో మాతృ దేశారాధనను, చైతన్యోద్దీప్తమైన భక్తి తత్పరతను పెంపొం

దింప చేయటానికి కిందటి శతాబ్ది ఉత్తరార్థంలో బంకిం, రామకృష్ణ పరమహంస, వివేకానంద, అరవింద, తిలక్‌లు దేశ భక్తిని మతోద్యమ స్థాయికి పర్యవసింప చేశారు.[7] అందుకే రామకృష్ణ పరమహంసను వర్ణిస్తూ "కాళిన్ సేవించుటలో కాళిన్ సేవించుటొకటె యని యతడు" కాశీ ఘట్టంలో వసించి కరవు పీడితు లను వోదార్చాడని వర్ణించారు. ఈ ఖండంలోనే దాదాభాయి నౌరోజి భారత దేశాన్ని ఉద్ధరించడానికి భారతదేశంలోనూ, ఇంగ్లండ్‌లోనూ చేసిన కృషిని వివరించారు. కావ్య సమాప్తంలో కూడా దాదాభాయి నౌరోజి కాంగ్రెసు సంస్థను ఏవిధంగా పటిష్టం చేసిందీ, ఒక మహోన్నత లక్ష్యం వైపు గమింపచేసిందీ ప్రసక్తం చేశారు. ఇందువల్లకూడా ఈ మహాకావ్యానికి ఒక సౌష్ఠవం, ఒక ఏక వాక్య సుందరాకృతి చేకూరుతున్నాయి.

రెండో ఖండం హోళీ ఖండం. వసంతోత్సవ వర్ణన వ్యాజాన వంగ దేశంలో ప్రబుద్ధమవుతున్న రాజకీయ చైతన్యాన్నంతా ఈ ఖండంలో కవిగారు చక్కగా వర్ణించారు. అప్పుడు కొందరు పగటి వేషాలు ధరించి వర్తమాన రాజకీయ పరిస్థితులను, దేశ దౌర్భాగ్యాన్ని సమీక్షించినట్లు చేసిన కల్పన మనోహరంగా ఉంది. అందులో ఒక వేషగాడు నాటి వైస్రాయి లిట్టన్ వేషం ధరించి వచ్చి బ్రిటన్ భారతదేశానికి చేసిన చేస్తున్న మహోపకారాలను, సేవలను అభివర్ణించాడు. కవిగారు ఈ ఖండంలో సమృద్ధంగా ఇంగ్లీషు పదాలను తెలుగు శైలిలో ప్రతిభావంతంగా కూర్చారు. శైలి అనుపద లలితమై సహజ

---

7. "Durga, Kali, Bhawani and other Hindu gods and goddesses were revived and it was believed that they alone could give the inspiration that was necessary for the emanicipation of the country" - P. 18-The nationalist movement in India and it Leaders- V. D. Mahajan. 1962.

" ఈ మన దివ్య భారతమాతయే మన అధిష్ఠాన దైవతముగ నుండు గాక ...... ఈ దేవతను మనము అర్చించిన పిమ్మట తక్కిన దేవత లందరిని పూజించుట కర్హులమగుదుము" అని స్వామి వివేకానంద ప్రబోధించారు - భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర - ద్వితీయ భాగం - శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య. పుట 85-1976.

ధారా సమన్వితమై మనోజ్ఞంగా ఉంది. సురేంద్రనాథ బెనర్జీ, ఉమేష్‌చంద్ర బెనర్జీ, నరేంద్రనాథ దత్తు అనే పూర్వాశ్రమ నామశోభితుడైన వివేకానంద స్వామి, దేవేంద్రనాథ టాగూర్, రవీంద్రనాథ టాగూర్‌లను కవిగారు ప్రస్తావికంగా ఈ ఖండంలో పరిచయం చేస్తారు. సురేంద్రనాథ బెనర్జీ ఉపన్యాస సభా వర్ణనంతో భారతీయ ప్రజల నుద్దేశించి ఆయన చేసిన ప్రబోధంతో ఈ ఖండం ముగుస్తున్నది.

మూడవ ఖండం కుమార సంభవ ఖండం. హోళీ ఖండం యొక్క కొనసాగింపు ఈ కథ. కామదహనం అయిన తర్వాతనే కదా కుమార సంభవం. కలకత్తాలో సంజీవనీ నామాఖ్యమైన ప్రజా సంస్థ ఉన్నది. ఈ సంస్థ వారు ప్రతి సంవత్సరం హిందూమేల పేరున ఉత్సవాలు జరుపుతారు. రవీంద్రుడు, రాజనారాయణ బోసు, బంకించంద్ర చటర్జీ, నవగోపాల మిత్ర, అమృత బజారు పత్రికాధీశుడు శిశిరకుమార ఘోష, ప్రథిత యశస్కుడైన ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు ఈ సమితిలో సభ్యులు. హిందూ దేశాభిమాని (హిందూ పేట్రియట్) పత్రికా సంపాదకుడైన క్రిస్టదాస్ పాల్ ఈ సమితి పట్ల చాలా అభిమానం చూపేవాడు. 1874 వ సంవత్సరం నాటికే భారత దేశానికి అంతరంగ స్వపరిపాలనం కావాలని ఉద్ఘాటించినవాడు క్రిస్టదాస్ పాల్. భారతదేశంలో జాతీయతా చైతన్యాన్ని, దేశభక్తిని ఈ మహామహులందరూ ఎంతగానో ప్రజ్వలింపచేసినారు. ఆనాడు బరోడా సంస్థానాధిపతి అయిన మల హరిరావు గైక్వాడు పైన ఇంగ్లీషు ప్రభుత్వం తీవ్రమైన అభియోగం మోపి ఆయన్ను పదవీచ్యుతుణ్ణి చేసింది. తన సంస్థానంలోని ఇంగ్లీషు రెసిడెంట్‌కు విషప్రయోగ ప్రయత్నం చేశాడని గైక్వాడ్‌పై మోపిన అభియోగం. అప్పుడు అమృతబజారు పత్రికను నడపుతుండిన శిశిరకుమార్ ఘోష్ "పెట్టె నేమి యొకని, కొక జాతినే నపుంసకము సేయుపాటి దోసమా! యది యని చాటె ఘోష" అని వీరభద్రమూర్తిగారు వర్ణించారు.

ఈ ఖండంలో వీరభద్రమూర్తి గారి కవితా శక్తి లాస్యం చేసింది. పుంస్కోకిల కొసరి కొసరి కూసినట్లు ఆయన సకలోహవిహార కవితారామంలో వసంతశోభ వెల్లివిరిసిందీ ఖండంలో. ఈ కథేతివృత్తాన్ని ప్రస్తావికంగా స్వీకరించడంవల్ల ప్రాచీన మహాకవుల ప్రజ్ఞాప్రాభవాలు వీరభద్రమూర్తిగారిలో ఎంతగా కుదురుకున్నాయో, వ్యంగ్యరసధ్వని శేవధిగా కమనీయ కవితా సిద్ధి

నాయన ఎలా సాధించారో ఈ ఖండం దర్శింపచేస్తున్నది. పద్ధెనిమిది ఖండాల ఇతివృత్తంలో ప్రస్తావికంగా సకలర్తు వర్ణనం చేశారు వీరభద్రమూర్తిగారు. కుమారసంభవ ఖండంలో కథ పరిచితపూర్వమైనదే. కాని దానిని నిర్వహించ దంలో అనేక సొగసులు చూపారు కవిగారు.

హోళీ ఉత్సవ సమారంభ సమావేశంలో హిందూమేలావారేర్పాటు చేసిన సభకు రాజనారాయణ బోసు అధ్యక్షత వహించి భారతదేశ పూర్వప్రాభవాన్ని, భారతదేశంలో విలసిల్లిన మత ఔన్నత్యాన్ని, సంస్కృతిని కొనియాడి, నవగోపాల మిత్ర ఇప్పుడు మీకొక కథ విన్పిస్తారు వినండి అని సభ్యుల ఆసక్తిని ఇనుమ డింపచేశారు. ఇప్పుడు నవగోపాలమిత్ర సభాసదులకు కుమారసంభవ కథను చెప్పారు. కామదహనోత్సవానికి ఫలశ్రుతి గదా ఆ కథ.

కథ ఎత్తుగడ నుంచీ ఇంగ్లీషు వారి ప్రభుత్వం తారకాసురుడి రాజ్య పాలనంతోను, భారతమాతను శైలరాజకన్యగాను, సుసంఘటితమూ ఏకీకృతమూ కావలసిన భారత జాతీయశక్తిని ఎదురుచూస్తున్న కుమారస్వామి జనన సన్ని భంగానూ ధ్వనింపచేస్తూ కథను నడిపారు.

హిమగిరి తపస్వియైన మహేశు కడనె
హైమవతియున్న, దవ్వారికైక్య మొదవ
జేయ సంభూతుడౌ నొక శిశువు చంపు
తారకాసురు ననుచు విన్నారు సురలు.

ఎవ్వడు వాడు? హరుని మది
జవ్వనిపై మరులు గొలుపు సామర్థ్యముతో
నివ్వటిలెడువాడు, శిలన్
పువ్వులతో గొట్టి రెండు పొనరుచు వాడున్.

అని దేవతలంతా గుజగుజలు పోయినారు.

మహిషవాహను నెరుగుదుమ, వరుణమతి
పెనుతుపానులో బడెను, కుబేరుని బుణి
పట్టికాస్థులు తండులధ్వంసు, ఒగ్ని
కేమి తెలియు బూడిద, యింద్రు డెరిగిపలికె.

ఈ పద్యంలోని కాకువు మనోహరం. తెనాలి రామకృష్ణుని కవితా వైఖరి ఇది.

సాదరంగా సగౌరవంగా మదనుణ్ణి రప్పించి ఎదురేగి కైదండ ఇచ్చి మర్యాద చేశాడు ఇంద్రుడు.

"ఇగురువిలుకాడు నొడివె పల్కుగురు! పల్కు
యెవరు వారు నన్నెరుగని పౌవరు వారు''— అంటూ

''ఓ హరి సా హరిన్ బెనగి యో హరి వాడెవడైన యోగిదా
సోహమనున్ శివోహమనునా! యమృతంబిడి చూడు త్రావునా!
దాహము దాహ మంచు వనితాధర శీధువు త్రావుగాసిమ
ద్బాహువు వేని ద్రోయవలె పల్కుము నాల్గిటినుండి మూటికిన్''—

నాల్గిటి నుండి మూటికిన్- అనే ప్రయోగంలో చాలా సొగసున్నది. 'వాడి కేమిటో మూడింది', 'నీకివాల్టితో మూడిందిరా' అనటం తెలుగు నుడికారం. మూడటమంటే కామ పరతంత్రుడు కావడమన్నమాట. ఇక వాడెంతటి గొప్ప వాడైనా మూడిందా గజేంద్రుడి దైన్యాన్ని అనుభవించవలసి ఉంటుంది. తెలుగులో మూడటానికి ఇంత అర్థమున్న విషయం వీరభద్రమూర్తిగారు మహాద్భుతంగా వ్యంజింపచేస్తున్నారు. ధర్మార్థ కామపురుషార్థులలో కామం మూడోది. సృష్టిస్థితి లయలలో ఇంద్రియోత్సేకమే లయమన్న ధ్వని. సత్వ రజస్తమస్సులలో తామసమే మూడోది. కైవల్యాధివైకల్యవ్యధి అవుతాడు మూడినవాడు. నేను తలచుకున్నానా ఎంతటి వాడికైనా కీడు మూడిందే అని ప్రగల్భిస్తున్నాడు మన్మధుడు.

''అనగ వృద్ధశ్రవుడు స్వకీయ పరకీయ
రాజకీయ రంగమ్ముల రంగువేసి
కొన్న తలయూపి పొగడును మిన్నుచూపి
హిమధ రాగము చూపి యిటులు వేడె''

ప్రతిపద బుద్ధిమత్ చమత్కృత మీ పద్యం. పరిహాస భాసురం. సమకాలీన రాజకీయాలపైన ఒక చురక వేస్తున్నారు వీరభద్రమూర్తిగారు. ఇంద్రుడికి ఎన్నెన్ని అనుభవాలతోనో తలపండింది. అయినా రంగువేసుకుంటూ ఉంటాడు ఎప్పటికప్పుడు. అతడిపట్ల వృద్ధశ్రవత నిరర్థకం. వాడు రాజకీయాలలో మొనగాడు. అందుకని మన్మధుణ్ణి పొగడుతున్నాడు.

నీ రాచరికము కాదని
యీరేడు జగాల బ్రతుకు నెవడు సుమశిలీ!
పౌరుష మర్థం బై జడ
దారి యతడు నీవు లాగు దారికి రాడో!

శంకరార్ధాంగ సౌందర్య శరీరాయై నమోనమః అని వ్యంజన.

ఈ ఘట్టంలో ఇంద్రుడి, మన్మథుడి పరస్పర సౌమనస్యం, పరస్పర ప్రగల్భాలు హృదయంగమ వ్యంగ్యార్థ పరిపోషకాలు. కావ్యానందనందనారామ విహార అభిరామాలు.

మన్మథుడు భరోసా ఇస్తున్నాడు.

ఆ జడదారి కెంజడలయందున మబ్బులు గూండ్లు కట్టుకో
నీ జముడేని వానిగని నిక్కిన రోమము నిల్వు గ్రుడ్లు నై
వాజమగాని తజ్జటిని పట్టి తపంబుడిపింతు వజ్రపా
ణీ! జవరాలి మోవిగొనకేవిసమానునొ చూతమాపయిన్-

ఈ పద్యం రసానందతుందిలం. వాడెంతవాడైనా సరే జుట్టు పట్టుకొని వంగదీస్తానని డాబులు పల్కుతున్నాడు మన్మథుడు. ఇంద్రుడు పైన సుమశిలీ! అని తనను ముద్దుచేశాడు. వజ్రపాణీ అని ఎద్దేవా చేస్తున్నాడిప్పుడు ఇంద్రుణ్ణి మన్మథుడు. 'వాని సిగసాంబరమయ్యా' అంటే అయితేనేం వాడి జుట్టు నేను పట్టుకొంటాను అని కోతలు కోస్తున్నాడు మన్మథుడు. 'జవరాలి మోవిగొనకేవి సమానునొ చూతమాపయిన్' అనటం మనోహరం. భాగవతంలో పోతనగారు 'సర్వమంగళ మంగళసూత్రమ్మునెంతమది నమ్మినదో' అన్నారు. 'భవాని త్వత్పాణిగ్రహణ పరిపాటీ ఫలమిదమ్' అని స్తుతించారు శంకర భగవత్పాదుల వారు. మంచి ముత్యాలహారంలాంటి పద్యం రచించారు వీరభద్రమూర్తిగారు.

ఇంకా తన బాణాల గొప్పతనం గురించి మన్మథుని బడాయిలు చాలా ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ఇదుగో అరవిందం, ఇదే అశోకం, ఇది చూతం, ఇది నవమల్లిక, మరేమో ఇది నల్లకలువ, వీటిబారి తప్పించుకొన్న వారెవరూ లేరు అంటూ స్మరుడు,

"రెండే కాళులు తాముప
రుండిన మంచమునకందురో ! మొండి ఘటాల్
రెండే కాదున్నవి నా
ల్గండీయనిపించి వదలు నరవిందమిదే"- అని స్వీయౌద్ధత్యాన్ని చాటు కొన్నాడు. తాపట్టిన కుందేలుకు మూడేకాళ్ళనటం తెలుగునుడికారం. నా మంచానికి రెండేకాళ్ళన్నది వీరభద్రమూర్తిగారి నుడి పడికట్టు. ఏ మంచానికైనా రెండుకాళ్ళు అసహజం. శోభస్కరంకాదు. ఏ మంచానికైనా శోభనాలుగుకాళ్ళు అనటంలో ఓహో అనిపించే రహోమాధుర్య శృంగార స్ఫురణం ఉంది.

స్థాణువు చిగిరించాలి. మొండి ఘటాలు సృష్టిశోభాహేతువులు కావు. దాంపత్య జీవితం అక్కర్లేదనే వాడిది మొండిబతుకు అని వ్యంగ్యం.

కుబేరుడు తారకుడి ఆగడాలను గురించీ, వానివల్ల భయవిమోచనం గురించీ మన్మథుడితో ఇట్లా విన్నవించుకొన్నాడు.

"ఆరక్షఃపతి పేరు తారకుడు, కొండంతౌ బలంబున్నయే
నీరేజాస్యకొయెంత భీమునకొ జన్మింపన్ గుమారుండువా
డేరాపాడగలండురక్కసుని, నాడే సర్వ సంక్షేమముల్
వీరాగ్రేసరయంచుయక్షపతి చెప్పెన్ గంధభృత్పాణియై"

పూర్వ పూర్వ మహాకవికృత సర్వాంగీణమైన సాధు సాధు రీతులన్నీ వీరభద్ర మూర్తిగారి కవితలో గుబాళిస్తున్నాయి. కోహినూరులాంటి పద్య రత్నాల కాంతులు దువాళిస్తున్నాయి. లౌకికానాంహిసాధునాం అర్థం వాగనువర్తతే, ఋషీణాంపునరాద్యానాం వాచమర్థాను ధావతి అని అభిజ్ఞవాణి.

ఈ పద్యం కవిగారి కవితా తపస్సు పండించింది.

కొండంతౌ బలంబున్న యే నీరేజాస్యకొ అనటం హృదయంగమమైన అర్థ విస్ఫురణం, 'నీరేజాస్య' అనటం వర్ణనా సౌందర్య పరమావధి. "భీమఃపరశు హస్తశ్చమృగపాణి జటాధరః" అని అష్టమూర్తి అష్టోత్తర ప్రశంస.

నీరేజాస్య అని హిమాచల వర్ధనిని సంభావించడం కాళిదాసు కవితా సౌభాగ్యాతిశాయినిగా ఉన్నది. కుమార సంభవంలో శైలరాజకన్య తపస్సు చేసిన వర్ణనోదంతాన్ని వీరభద్రమూర్తిగారి ఈ పద్యం స్ఫురింపచేస్తున్నది.

హేమంత ఋతువులో కంఠదఘ్నంగా నీటిలో నిలిచి ఆ తల్లి తపస్సుచేస్తూ వుంటే ఆతల్లి వదనాంభోజం ఒక్కటే ఆ కొలనుకంతా శోభస్కరంగా ఉండి, ఆ సరోవరలక్ష్మి సంరక్షించుకొంటున్న బీజసంపదకు ఆకరంవలె భాసించిందట. నిశిరాత్రివేళ కంఠం లోతున తపస్సులోఉన్న ఆమె అధరస్పందనలే కమల దళాలను తలపింపచేస్తున్నట్లు ఆమె ముఖ సౌగంధ్యమే పద్మ సౌగంధ్యాన్ని ఆ కొలనుకు సంక్రమింపచేస్తున్నట్లూ వర్ణించాడు కాళిదాసు. హిమవృష్టికి పద్మాల రేకులన్నీ రాలిపోయి సరోవరాలు కళా విహీనంగా ఉంటాయి. పార్వతీదేవి తపస్సుకు నిలయమైన సరోవరానికి మాత్రం పద్మశోభ విలుప్తం కాలేదు అని కాళిదాసుని వర్ణన. వీరభద్రమూర్తిగారు 'నీరేజాస్య' అని హిమగిరినందనను సంభావించడంలో ఈ కాళిదాసు కావ్య సౌందర్యాన్నంతా ప్రతీయమానం చేశారు.

కామదహనం జరిగిపోయింది.

శివుడు హిమవత్పర్వతం నుండి బిచాణా ఎత్తివేసి వెండి కొండకు వెళ్ళే ప్రయత్నంలో ఉన్నాడు, ఆయన పరివారమంతా తలావొక రీతిగా జరిగిన వృత్తాంతాన్ని విశ్లేషించారు.

అంశమైన జీవాత్మతదంశితోడ
గలుపుటకు మండి కామమ్ము కాలిపోయె
మధురభక్తి రహస్యమియ్యదనె చండి
యౌర నీ తెల్విమండినదనె శివుడు.

వీరభద్రమూర్తిగారి పరిహాస ప్రియతకు ఈ మాటకారితనం నిదర్శనం.

ఈ కుమారసంభవఖండం పాతకొత్తల మేలు కలయికకు కవికల్పనా విహారభూమిగా వీరభద్రమూర్తి గారికి బాగా అక్కరకు వచ్చింది. వర్ణనలలో

---

* 'ముఖేనసా పద్మసుగంధినా నిశి
ప్రవేపమానాధర పత్రశోభినా
తుషార వృష్టిక్షత పద్మసంపదం
సరోజ సంధానమివాక రోదపామ్.' 5-26

'హిమగత నళినీ వనష్టశోభావ్యసన పరంపరయాని పీడ్యమానః' అని అశోకవనంలో జనకరాజనందినిని వాల్మీకి వర్ణించాడు.

కొత్త సొగసులు చూపారు. భావనలో కొత్తసోయగాలు పోయినారు. శైలిలో అపూర్వమైన రామణీయకతను సంధానించారు. ఒక లలితమైన కూర్పు, మృదులమైన భావ సౌభాగ్యం ప్రసరింపచేశారు.

భారతమాత వేరుగిరివల్లభజాతయు వేరుకాద త
త్సారతపమ్ము శక్తియ ప్రజాళి సమైక్య సమృద్ధ చిత్తవి
స్ఫారితశక్తి యయ్యదియ పౌరుషరూపము కన్న తల్లిరా
వేరయటంచు దైవమును పిల్చుకవచ్చు గృహీతపాణియై (3-148)

కుమారసంభవకథా కథనంద్వారా కథకుడు నవగోపాల్ మిత్రా సదస్యులకు బోధించిన పరమార్థమిది. ఈ సభను ఒక కంట కనిపెట్టటానికి వచ్చిన ఆంగ్లేయాధికారి మధ్యమధ్య బుజాలు తడుముకోవటం, తెల్ల మొగంవేస్తూ ఉండటం పతితృమానసహాసోత్సాహ సమధిగతంగా వీరభద్రమూర్తిగారు రచించారు. మరుని పూవుటమ్ములకు మనసు చెదరిన శివుడు పార్వతిని సానురాగియై వీక్షించినప్పుడు ఆమె "సృష్టికందని యందాల బరువుమోయు చూపు బదులు చూచిందట." ఆయనకు కుసుమాంజలిని సమర్పించటానికి ముందుకు వంగిన తల్లి ఓంకారాన్ని తలపింపచేసిందట. పార్వతీ దేవి తపస్సు, శివుడు వచ్చి ఆమె అభిప్రాయము తెలుసుకోవటం, శివుని వివాహం అతిలోక మనోహరాలుగా వర్ణితాలు.

కుమారస్వామి జన్మించాడు. ఆయనకు ఆరు మొగములు.

ఆయనకు భారతీయ జాగృత నవ చైతన్య శక్తితో అవినాభావం అని కథకుడు సభాసదులకు వినిపించాడు.

నవభారత జాగృత చైతన్యం ఆరు ముఖాల ప్రవర్ధమానం కావాలి.
అవి "సత్యముపాయమున్ జదువు శౌర్యము నభ్యుదయంబు ధైర్యమున్."

అటు తరువాత శౌర్య ఖండంలో కథారంగస్థలం పూనాకు మారింది. వాసుదేవ బలవంత ఫాడ్కే మహారాష్ట్ర వీరుడు. "1879 లో మహారాష్ట్రంలో వాసుదేవ బలవంత ఫాడ్కే ఒక తిరుగుబాటు లేవదీసినా దానికి ప్రజల సహకారం లభించకపోవడంతో అది విఫలమైందని" స్వాతంత్ర్యోద్యమ చరిత్రకారులు భావించారు. ఈ శౌర్య ఖండంలో వీరభద్రమూర్తిగారు ప్రసక్తానుప్రసక్తంగా ద్వారబంధాల చంద్రయ్య అనే తెలుగు విప్లవవీరుడి చరిత్రను కూడా వర్ణించారు. ఆంగ్లేయుల దౌర్జన్యం, అహంకారం, అధికార మదాంధతలను ఎదిర్చి, వాళ్ళకు

గుణపాఠం బోధించారు ఫాడ్కే, చంద్రయ్యలు. శౌర్యఖండమని పేరు పెట్టి నందుకు ఇందులోని కథ, ప్రస్తావిక వర్ణనలు, ప్రకృతి సర్వమూ తదభిముఖం గానే పరిపోషకాలైనాయి. వసంతర్తు వర్ణనం చిత్తగించండి.

రెమ్మనుండి వెడలు తుమ్మెదపిండు పి
స్టలున వెడలు గుండ్లు బలెనెసంగ
నిలిచిపోరు యోధునిన్ దలపించెర
సాలతరువునాటి సమయమందు.

ఆంగ్లరాజ్య పాలనంలో భారతీయుల గోడు ఎలాంటిదో వర్ణితం.

పన్ను లొకదెయయ్యు బర ప్రభుత్వము కన్న
పాము మేలు, చచ్చువాడు బ్రతుక
వచ్చు పాము విషము వలన, పరప్రభు
తన్ గతించు మనునతండు కూడ - ఈ విధమైన హృదయస్పృక్కు

అయిన గాథ జాతీయాభిమానం సర్వేసర్వత్ర వీరభద్రమూర్తిగారి రచనలో ప్రాబోధికంగా ప్రకరణోచితంగా ఈ కావ్యమంతటా వర్ణితమైంది.

ఆటు తరవాతది రానడె ఖండం. భారతదేశంలో వ్యవస్థీకృతమైన సామాజిక చైతన్యాన్ని ప్రోదిచేసినవాడు రానడే మహాశయుడు. సాముదాయిక మైన చైతన్యవాణిని రాజ్యాంగబద్ధమైన సభలు సమావేశాల ద్వారా, ప్రభుత్వానికి అర్పించే మహజర్ల ద్వారా, చట్టబద్ధమైన సంస్కరణల ద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకొనిరావడానికి ఆధునిక భారతదేశంలో రానడే మహాశయుని కృషి ఆ తర్వాత తరం వారెందరినో ఉత్తేజితులను చేసింది. సంఘ సంస్కరణ పట్ల, ఉదార రాజ్యాంగం పట్ల ఎక్కువ ఉత్సుకత చూపి కృషి చేసిన వేత్త రానడే. గోపాలకృష్ణ గోఖలే తనకు ఆదర్శంగా, రాజకీయపథ ప్రదర్శకునిగా రానడేను ఎంచుకొన్నాడు. గాంధీజీ గోఖలేను తన రాజకీయ గురువుగా భావించుకున్నారు. పూనాలో సార్వజనిక సభను స్థాపించి, రాజకీయ, సాంఘిక సంస్కరణలకోసం దేశభక్తుల నెందరినో తర్ఫీదు చేశాడు రానడే. ఈశభక్తికన్నా దేశభక్తి, అంతకన్నా ఆత్మశక్తి పెంపొందితే తప్ప భారత ముక్తి సాధించలేమని ప్రబో ధించిన మహానుభావుడు రానడే. మహారాష్ట్రంలోను తద్వారా భారతదేశంలోను దేశీయ పరిశ్రమలు, అంటరానితనం నిర్మూలనం, స్త్రీల హక్కులు ప్రబోధించిన వాడు రానడే.

ఈ విధమైన రాజకీయాలు, సంఘ సంస్కరణ, మత సంస్కరణ ప్రయత్నాలు, ఇంగ్లీషు పార్లమెంటు పనిచేసే విధానం లోన అగ్గి రాజి సాయుధ, విప్లవానికి తెగించే దేశభక్తుల తీవ్ర యత్నాలు పద్యాలలో మేలి శైలితో, ధారా శుద్ధితో నిర్వహించడం ఎంత కష్టం.

ఏ విషయాన్నైనా ఎంతటి సిద్ధాంతాన్నైనా, రాజకీయ విసంవాదాలనైనా నిర్వచనంగా ప్రసన్నమైన పద్యపు నడకతో నిర్వహించారు వీరభద్రమూర్తిగారు. ఈయన ఛందోరహస్యవేది. అనల్ప కవితా శిల్పజ్ఞుడు. అపూర్వ వృత్త రచనా చాకచక్యదక్షుడు. గంభీర భావావేది. మాలిని, వియోగిని, అనుష్టుప్పు, మంజరి, ద్విపద మొదలైన ఛందాలన్నీ అందంగా నిర్వహించారు మూర్తిగారు. గేయం కూడా రాయడం వీరి నవ్య భావాదృతికి తారకాణ.

తరువాతది ఫాడ్కే ఖండం. ఫాడ్కే విప్లవవీరుడు. ఈ ఖండంలో కుంఫిణీ ప్రభుత్వంలోను, తరవాత రాణిగారి ప్రభుత్వంలోను భారతదేశం పడిన బాములు ఆర్థికమైన దోపిడి, దేశీయ పరిశ్రమల నాశనం, రైతుల ఇక్కట్లు, కరువులు, కాటకాలు, సాంక్రమిక వ్యాధుల బాధలు, ఇవన్నీ దేశం పారతంత్ర్యంలో మగ్గటంలోనే ముడిపడి ఉన్నాయని వాసుదేవ బలవంతరావు ఫాడ్కే సాయుధ విప్లవానికి పూనుకొన్నాడు. ప్రజారాజ్య స్థాపనకోసం ఉత్సహించాడు. మహారాష్ట్రంలోను, సరిహద్దులైన కర్ణాటక, నిజాం ప్రాంతాలలోను ఆయన సాగించిన రహస్య సాయుధ విప్లవగాథ ఈ ఖండంలో వర్ణితం. తరవాత ఖండం హైదరాబాద్ ఖండము. "దీనిని చక్కగ జెప్పం, బూనుట యొక దొడ్డ కావ్యమును వ్రాయుటయే, యౌను కథించెదటూకీ, గా నా నేర్చిన కొలందికతి పయచరితల్" అన్నారు కవి. ప్రథమ స్వాతంత్ర్య విప్లవం చెలరేగటానికి సుమారు ఏభై సంవత్సరాలకు పూర్వమే నిజాం సంస్థానం ఇంగ్లీషువారి సార్వభౌమాధికారానికి లోబడింది. అయితే అటు తర్వాత సుమారు ఏభై సంవత్సరాలు జాగీర్దారులు, చిన్న చిన్న సంస్థానాధిపతులు ఇంగ్లీషువారి అధికారాన్ని రూపుమాపటానికి తిరగబడుతూనే ఉన్నారు. బీజపుర్, బీదర్, ఆదిలాబాద్, గుల్బర్గ్ ప్రాంతాలలో ఇటువంటి తిరుగుబాట్లు సంభవించాయి. ఈ విప్లవ గాథనంతా శ్రీ వీరభద్ర మూర్తిగారీ ఖండంలో వివరించారు. భాగ్యనగర వర్ణనంలో హిందూ మహమ్మదీయ మిశ్ర సంస్కృతి, అందచందాలు, కవితాకమనీయంగా వర్ణించారు కవిగారు.

అటు తరవాత రంగస్థలం దయానంద ప్రబోధిక క్షేత్రానికి మారింది. గడచిన ప్రకరణాలకథ అనుస్యూతంగానే సాగుతూ ఆ కాలిక ప్రాధాన్యాన్నిబట్టి, ప్రధాన ఘట్ట ప్రాధాన్యాన్నిబట్టి, చారిత్రక సన్నివేశ ప్రాముఖ్యాన్నిబట్టి, ఆ ఖండానికి పేరుపెట్టినట్లుగా కనబడుతుంది. ఈ ఖండంలో వాసుదేవబలవంతరావు ఫాడ్కే సాయుధ పోరాటం విఫలమై ఆయన కారాగారబద్ధుడు కావడంతోపాటు, తప్పించుకోవటం, మళ్ళీ బంధితుడుకావడం, ఆరోగ్యభంగమై స్వర్గతుడు కావటం వర్ణితం. ఫాడ్కే స్వర్గతితోనే దయానంద నిర్యాణం కూడా జరిగింది. భారత దేశానికి దయానందుని బోధలు చేకూర్చిన జవసత్వాలు, సంఘటిత ఆత్మశక్తి, ఉత్సాహ ప్రభు మంత్రశక్తులు ఎటువంటివో ప్రసక్తం చేస్తూ సంగ్రహంగా దయానందీయ మత సాంస్కృతి కోద్యమం ఈ ఖండంలో వర్ణితం.

ఆదిశంకరు తరువాత నంతవాడు
''హెర్కులసు'' బోలు బలవంతు డెడమచేత
బరుగిడెడి గుర్రములబండి బట్టియాపి
నాడు, పర ఖడ్గము విరిచినాడు స్వామి-

తిలకాయ మానమైన పద్యమిది ఈ ఖండంలో. పరమోత్తేజకరమైన శైలి. ఈ ఖండం శ్రీఖండం వాసనలు గుబాళింపు.

కవిగారు ఎక్కడ ఏ ధ్వని నిక్షేపించారో, ఎక్కడ ఏ చెళుకు కూర్చారో, ఎక్కడ ఏ కళుకు తళుకు మంటుందో ఒక కంట కనిపెడుతూ చదివితే ఆ కుతూహలం మనస్సుకి హాయి చేకూరుస్తుంది. వీరార్చనము విగ్రహార్చనము రెండూ కూడా భారతీయులకు ప్రీతి పాత్రాలేనని చెపుతూ దయానంద మతం అందువల్లనే ఇంకా వ్యాప్తి చెందలేదని తిలక్ అభిప్రాయం. ఈ ఖండంలో తిలక్ రంగస్థలం మీదికి రావడం కనిపిస్తుంది.

ఇటు తరవాతది కాంగ్రెస్ ఖండము, భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తిలక్ మహాశయుడు, గోఖలే విబుధుడు సూర్య చంద్రులు. వారి సముజ్జ్వల చరిత్ర ఈ ఖండంలో వర్ణితమైంది. 'సార్వజనిక సభ', 'దక్కన్ ఎడ్యుకేషనల్ సొసైటీలు' ఆధునిక భారతదేశానికి గోఖలే, తిలక్‌ల ద్వారా ఎంతటి ఉత్తేజాన్ని చైతన్యాన్ని కలిగించాయో లలితలలితంగా, మృదుల మృదులంగా, ఈ ఖండంలో కవిగారు వర్ణించారు. ఆ తర్వాత కాంగ్రెసు సంస్థ పుట్టుటకు దోహదం చేసిన పరిస్థితులేమిటో, ఆక్టేవియస్ హ్యూమ్ భారతీయ విద్యార్థులకు

చేసిన ప్రబోధం, కాంగ్రెసు మొదటి సమావేశం వర్ణించారు వీరభద్ర మూర్తిగారు.

అతి మానవచర్యా విర
హిత మౌ రామాయణం బిదే, దాయాదుల్
దితి నొందనిది మహా భా
రత మిదె, కాంగ్రెస్ చరిత్ర రవణము భువికిన్. (9-45)

ఈ కాంగ్రెస్ ఖండంలో ఇంకొక విశేషం కూడా ఉంది. ఈ పద్దెనిమిది ఖండాల కావ్యమాలలో ఇది తొమ్మిదో ఖండం. మధ్య నాయకమణి అన్నమాట. కాంగ్రెసు సమావేశాలలో తీర్మానాలు, సంవాదాలు కవితా రూపంలో చెప్పడం కష్టం. అయినా వీరభద్ర మూర్తిగారి కవితా శైలిలో ఎక్కడా శ్లథత్వం కనపడదు.

అటు తరవాత పరమహంస ఖండం, రాజకీయాలు, సాంఘికోద్యమాల నుంచి సంస్కృతి, మతం, నాటి భారతీయాత్మ నేవిధంగా ప్రభావితం చేశాయో, సారపు ధర్మము, సమగ్ర దర్శనము, పరిపూర్ణ జీవితము రామకృష్ణ పరమహంస ఆనాడు జాతికి ఏవిధంగా ప్రబోధించాడో చాలా ప్రతిభావంతంగా వీరభద్రమూర్తిగారీ ఖండంలో నిక్షేపించి చూపారు.

రామకృష్ణ పరమహంస ప్రబోధ పరమార్థ సారాంశమిది :

జ్ఞానము భక్తి కర్మయుతి సాగవలెన్ సుమి , ఐకమత్య శో
భా నిరవద్యమీ త్రికము, భారతి లక్ష్మియు నాదిశక్తియున్
దానగు కాళికాంబను సదా భజియించుటలో నిబద్ధమై
బోనము వోలె సిద్ధమగు మోక్షము జాతికి, వేడి రెంటికిన్. (10-12)

రామకృష్ణ పరమహంస ఆధునిక భారతదేశ చరిత్రలో నూతన సాంస్కృతిక శకాని కారంభకుడు. భారతదేశ పురాభవ్య ఖ్యాతిని మరోసారి నిరూపించిన మహానుభావుడు రామకృష్ణ పరమహంస. రామకృష్ణ నిర్యాణం రెండో కాంగ్రెసు సమావేశము 1886 లో సంభవించాయి. మూడోదైన కాంగ్రెసు సమావేశం మద్రాసులో 1887 లో జరిగింది. 1891 లో నాగపూర్‌లో కాంగ్రెస్ సమావేశం పనప్పాకం ఆనందా చార్యులవారి అధ్యక్షతన జరిగింది. ఆనందాచార్యులవారి చాతుర్యం, దేశభక్తి సమర్థత, స్తుతిపాత్రంగా వర్ణించారు కవిగారు.

తరవాత వివేకానంద ఖండం. ఈ ఖండాన్ని పారతంత్ర్య భారతీయాత్మ శక్తిని వివేకానందస్వామి ఏవిధంగా కటిబద్ధం చేశారో అందుకు వినియోగించారు కవిగారు.

దవనమ్ము కన్న గొప్పది
కవనమ్మిది వాడువారక పరిమళించున్
సవనమ్ముకన్న గొప్పది
కవనమ్మందుగల జ్వాల కగ్గద యెపుడున్ (11-2)

అని వివేకానంద ఖండాన్ని ప్రారంభించటం భావుకాభిరామంగా వుంది. వీరభద్ర మూర్తి గారి ఈ మహా కావ్యానికి కూడా ఇది వర్తిస్తుంది. ఉత్తమ కవిత్వ లక్షణాలేవో ప్రస్తావికంగా వీరభద్రమూర్తిగారు ఈ ఖండంలో ప్రతిభావంతంగా సమీక్షించారు. ''ప్రకృతికి బ్రతిగ నదొక మహాశిల్ప సృష్టి, కన్నులు లేనివానికి గనుపింపజేయు విశ్వంబు'' అని కవితా కళను పొగిడారు. ప్రకృతిలోనైనా వక్రత ఉండవచ్చునేమో కాని కవి సృష్టిలో మచ్చలేని చందమామ అందాన్నే కాంక్షిస్తాడు పరిణతిగలుగు కవీశ్వరుండు. ''మెదలు కవిత్వంబు మెరుగు మేఘము నందువలె...యదే మర్మమెరిగి కూర్చువాని రచనయందు''—అన్నారు వీరభద్రమూర్తిగారు. మహాప్రతిభావంతులైన పూర్వాపూర్వకవితల్లజు లందరూ తమ కవితాశిల్ప రహస్యాలను ఈ విధంగా భంగ్యంతరంగా వాచ్యం చేస్తూనే వచ్చారు. రవీంద్రనాథ ఠాగూర్ ప్రసక్తంగా ఉత్తమ కవితా ధర్మాలను ప్రవచించారిక్కడ వీరభద్రమూర్తిగారు ''రసమంటే పఠితనో శ్రోతనో విపణ్ణిగా చేసేవాణ్ణి బిడభావ సంగతి యసుమీ'' అన్న నిర్వచనం కావ్యప్రకాశికాకారుడి మతాన్నే సరళీకరించి చెప్తున్నది. ఈ ఖండంలోనే బంకించంద్ర చటర్జీ రచనాశక్తిని గూర్చి కవి నివాళు లర్పించారు. వందేమాతరం సందేశ ధ్వననగీతి అనీ, అదేచాలు బంకించంద్రుడి అమరత్వానికనీ, కేంద్రీకృత దేశశౌర్యగీతమది అనీ బంకింబాబును ప్రస్తుతించారు. వివేకానందుడి ప్రబోధాన్ని, పారమ హంస్యము, అమలము, జాతీయతాభద్రగీతికము అయిన స్వామి సందేశాన్ని ఈ ఖండంలో ప్రసన్నమధురమైన, ఓజోస్ఫూర్తిమంతమైన శైలిలో వీరభద్రమూర్తి గారు వర్ణించారు.

బాలగంగాధర తిలక్, స్వామి వివేకానంద సమావేశ సన్నివేశాన్ని ఈ విధంగా వర్ణించారు:

"అని గుమ్మమ్మున గన్గొనెన్ దిలకు రుంద్రాక్ష స్ఫురత్కాంతిరే
ఖనిశాంతోర్జితమూర్తి నిర్జిత విశాఖున్ ధత్తకాషాయవే
షనిసోష్ణీషుని నొక్కనిన్ గథిత శస్తున్ యౌవనస్థు, న్నమిం
చెను వానిన్, మరికౌగిలించికొనె వానిన్ గల్కటా యంచనన్-"
(11-68).

వంగదేశ యువకుల అస్థిపంజరాల నుంచి వజ్రాయుధాలు గండరించి భారతదేశ శృంఖలాచ్ఛేదం జరుగుతుందన్నాడట స్వామి యెప్పుడో. తిలక్ స్వామిని చూడగానే వెంటనే ఆ ప్రశంస తేవడం, పాత్ర చిత్రణలో కవికున్న నిరుపమానమైన నేర్పుకు నిదర్శనం వివేకానందుడి బోధలు దేశభక్తి శక్త్యుద్దీపితుడైన కవి గారిని ఎంతగా ప్రభావితం చేసిందీ ఈ ఖండంలోని పద్యాలే చెపుతున్నాయి. తమంనుండి మేల్కొనండి, కాని శుద్ధసత్వం ఇప్పుడు పనికిరాదు, కావలయు రజశ్శక్తి కావ్యమునకు కార్యమునకు అని బోధించాడుట దేశీయులను స్వామి వారు.

వ్యష్టి అంటే నష్టి, సమష్టి అంటే పుష్టి అని వివేకానందస్వామి బోధించడం వ్యక్తికి బహువచనం శక్తి అని శ్రీ శ్రీ అన్నట్లుగానే వుంది. చికాగోలో సర్వమత సర్వసంహా సభాభవనంలో స్వామి ఉపన్యాస సారాంశాన్ని ఎంతో కవితాత్మకంగా వర్ణించారు కవిగారీ ఖండంలో.

సమబుద్ధి కవి కలిత కా
వ్యము వలె సర్వమత లక్షణాన్వితమై శి
ల్పము తగ "బేలూరు" మ
ఠమదితనరు బుటువుల యెడారిన్ బ్రపయై (11-192).

ఆధునిక తెలుగు సాహిత్యంలో ఈ వందేమాతర కావ్యం కూడా బేలూరు మఠ మంత దివ్యసౌందర్య మహిత తేజోవిరాజమాన శిల్పశోభా సమన్వితంగా ఉంది. స్వాతంత్ర్యోద్యమాన్ని కీర్తితం చేసే మహాకావ్యమిది. అనన్యం. ధన్యం.

తర్వాతదిలోకమాన్య ఖండం. లోకమాన్యుడు భారత జాతీయ చైతన్యాన్ని ఏ విధంగా గణపతి ఉత్సవాలద్వారా, శివాజీ ఉత్సవాలద్వారా సముద్దీపితం చేశాడో కవిగారెంతో తన్మయీభావంతో గానం చేశారు. "ప్రజను మేల్కొల్పు రాజకీయ జయతత్పపూర్వజుండు నపశ్చిమబుద్ధి తిలకు" అనటంలో

ప్రౌఢి హృదయదరహాస భాసురం. భావుకైకవేద్యం. గణపతిని అర్చించడంలో పరమార్థమేమిటంటే—

మూషికముబొజ్జవేల్పును మోయుటేమి
యనుచు హితులార మీరు నన్నడుగవచ్చు
భరత ఖండోద్ధరణ కార్యభరణమునకు
నలతియును బలవంతుడైనట్టియిదియు (12-58)

అని విప్పి చెప్పాడుట తిలకు మహాశయుడు. "రాణా ప్రతాపసింహుడు, శివాజీ మా నేతలని యెలుంగిడి, మానితులారా తదీయ మార్గులుకండీ' అని తిలక్ దేశీయులను ప్రబోధించడం, ఆయన జాతీయ వీరుడన్న విషయాన్ని స్పష్టపరుస్తున్నది. 'స్వాతంత్ర్యంకన్నా అమృతం చిన్న విషయం అన్నదే భారతంలో ధ్వనిస్తున్నది. ఆ నాటి గరుడుని కథ ఈనాడు మీరు పునశ్చరణం చేయండి' అని తిలక్ ప్రబోధించడం, ఈ ఘట్టంలో తిలక్ మహాశయుని దివ్య సందేశం వీరభద్రమూర్తిగారు మనోమోహకంగా వర్ణించారు.

గాంధీజిని తొలిసారి చూసినప్పుడు తిలక్ ఇలా అనుకున్నాడుట.

ఎవడీతడు హైందవతా
ప్రవిలసనముతోడసీతఫా పుట్టిననే
సవురొనాయన్న బుద్ధిన్
దవిలెనొ బుద్ధుండు ! తిలకు తార్కికుడు కదా ! (12-100)

బుద్ధుడే తిరిగి ఈ తీరున జన్మించాడని అనుకున్నాడుట తిలక్. ఆయన తార్కికుడే కాదు. మహాగణితవేత్త. అందువల్ల సరిగ్గా లెక్క కట్టాడు. ఆధునిక సాహిత్యంలో నవలారచనం, కథారచనంలో ఉండే శిల్పాన్ని వీరభద్రమూర్తి గారు ఈ తిలక్ ఖండంలో చక్కగా పొందుపరిచారు.

తిలక్ మహాశయుడు మాండలే జైలులో నిర్బంధంలో ఉండగా గడచిన గాథలన్నీ ఆయన స్మృతి పథంలో మెదిలాయని వర్ణిస్తూ ఫ్లాష్‌బాక్ కథా కథన పద్ధతిని కూడా ప్రవేశపెట్టారు వీరభద్రమూర్తి గారు ఏటేటా జరిగే కాంగ్రెసు సమావేశాలు,అందులో ఆమోదించే తీర్మానాలు,చర్చలు అన్నీ జ్ఞాపకానికివచ్చాయి తిలకు మహాభాగుని కన్నది ప్రస్తుతంగా ఎన్నో విషయాలు చెప్పారు కవిగారు. భారతీయుడి తలసరిరాబడి ఇంగ్లీషు వాని తలసరి రాబడిలో పందొమ్మిదోవంతు.

భారతీయుడి రోజుకూలి ఒకఅణా, భారతదేశంలో నాటి జనసంఖ్య ఇరవై రెండు కోట్లు, బ్రిటన్ జనాభా నాలుగు కోట్లు-అని రహమతుల్లా సయాని ఎంత చక్కగా చెప్పాడని తిలక్ మెచ్చుకున్నారుట. అరవిందఘోష్ తిలక్ ప్రబోధాలకు ఏ విధంగా ఆకర్షితుడైనాడో ఈ ఖండంలోనే వర్ణితము. ఈ పద్దెనిమిది ఖండాలతో సార్థకంగా ఈ లోకమాన్య ఖండమే బహుమాన్యంగా కూర్చబడింది. అన్నిటికన్నా పెద్దఖండమిదే. దీని తర్వాతదే అరవింద ఖండము. లాలా లజపతిరాయ్, తిలక్ మహరాజ్, అరవింద ఘోష్, వివేకానంద స్వామి, స్వాతంత్ర్యోద్యమ మహారథులలో ఒక పంక్తివారు. వీళ్ళు రాణా ప్రతాప సింహుడు, శివాజీల నిజమైన వారసులు. అవసరమైతే సాయుధ విప్లవం సాగించవలసిందేనని దృఢంగా విశ్వసించినవారు కాంగ్రెసు చరిత్రలో వీళ్ళను అతివాదులన్నారు.

ఎవడు ప్రజాద్రోహి
తుహా పులినిన్ ద్రోవకాచి దున్మినటులు దు
న్మవలెన్వాని, ప్రభుతతో
బవరముకై ప్రోగుసేయవలె నడిదములన్ (12-230)

ఈ సిద్ధాంతాన్ని గాఢంగా నమ్మినవాళ్ళు కాబట్టే వీళ్ళు శక్తి పూజ చేశారు. భారత జాతీయ శక్తిని ప్రబోధం చేశారు. చైతన్యశక్తిని సముజ్వలితం చేశారు.

అదేమిటో తెలుగులో శక్తి అనే పదం జీవ చైతన్య స్ఫురణం. తక్కిన భారతీయభాషల మాట ఏమిటో కాని, జీవశక్తి, ప్రజాశక్తి, చైతన్యశక్తి, శబ్ద శక్తి, కుండలినీశక్తి మొదలైన పదబంధాలలో శక్తి చైతన్యప్రతీక. బొందిలో శక్తి లేకపోతే జీవచ్ఛవమే. అందువల్ల అరవిందఘోష్, తిలక్ మహాప్రభువు, వివేకానందులు శక్తిని అర్చించండి, శక్తిని పుంజుకోండి అని ప్రబోధించారు. ప్రచోదనంచేశారు. బిపిన్‌చంద్రపాల్ ప్రారంభించిన వందేమాతరం పత్రిక, అరవిందుని యుగాంతర్ పత్రిక, భవానీ మందిరం వ్యాసాలు, వంగదేశంలో నాడు యువరక్తాన్ని ఉడుకెత్తించిన అనుశీలన సమితి, భారతదేశంలో మళ్ళీ క్షాత్రేయాన్ని పునరుద్ధరించాయి. వివేకానందస్వామి సోదరుడు భూపేంద్రనాథ దత్తా, అరవిందుని సోదరుడు వారింద్రకుమార ఘోష్, ఉగ్రవాదానికి, సాయుధ విప్లవానికి ప్రజలను రెచ్చగొట్టారు. సమాయత్తులనుచేశారు. పద్దెనిమిదేళ్లుకూడా నిండని ఖుదీరామ్ బోస్ పరమ సంతోషంతో ఉరికంబ మెక్కటం ఏ దేశ చరి

త్రలోనైనా అపూర్వం. వంగదేశం నాంది పతించగానే మహారాష్ట్రం విప్లవోద్యమానికి నడుంకట్టింది. తిలక్ మహాశయుడు ప్రారంభించిన శివాజీ మహోత్సవాలు భారత ప్రజానీకంలో శక్త్యుద్రేక ప్రేరితములైనాయి. అంతేకాకుండా కరువులు కాటకాలు, అధికమైన పన్నులు, దోపిడి విధానాలు ప్రజలను ఎంతగానో బాధించాయి.

లాలా లజపతిరాయ్ మహాశయుడు ఒక చేతిలో శంఖాన్ని మరొక చేతిలో చక్రాన్ని ధరించి సంఘసంస్కరణ, రాజకీయ రణవ్యూహం నిర్వహించాడని వర్ణించడం అత్యంత మనోహరం. నరుడై వచ్చిన నారాయణు డాయన. అందువల్ల ఆయనకు రెండే చాలు చేతులు. సంఘసంస్కరణ ప్రబోధాన్ని శంఖహస్తంతోను, దుష్టశిక్షణోద్బధను చక్రహస్తంతోను ఉపమించడం సొగసులలో కెల్ల సొగసుగా ఉన్నది. ఈ ఖండాలలో రథోద్ధతం, మాలిని, మధ్యాక్కరల వంటి విశేష వృత్తాలు రాయటం వీరభద్రమూర్తిగారి ఛందో రహస్య వేత్తృత్వానికి నిదర్శనం.

అరవింద ఖండంలో అరవింద, తిలక్ మహాశయుల సమావేశం, వారి చర్చలు, అరవిందుని పత్రికా రచనలు ఉత్తేజకరంగా వర్ణించారు కవిగారు. 'ప్రతి పట్టణంలోను బహుశస్త్రశాలలు ఇప్పుడు మనం నిర్మించాలి. యువతను సాముగరిడీలలో ప్రవీణులను చేయాలి. ప్రజలను ఉద్రేకపరచి సమాయత్తులను చేయాలి' అని అరవింద ఘోషు తిలకు మహాశయుణ్ణి అర్థించాడు. అతివాద మితవాద రాజకీయ సంఘట్టనలు, బహిరంతర సంఘర్షణలు, ఉద్యమ స్వరూపం, మళ్ళీ 1896–97 నాటి కరువు పరిస్థితులు, ద్వాోల్బణం ఈ మొదలైనవన్నీ దేశీయ మహాసభ మహాపథ ప్రస్థానాన్ని ఏ విధంగా ప్రభావితం చేశాయో అరవింద, భవానీ మందిర ఖండాలలో వర్ణితాలు. 'చెరగిపోయెనాడు మితాతివాదాంతరమున హద్దుగీత' అని పర్యవసానాన్ని వర్ణించారు.

భవానీ మందిర ఖండంలో వందేమాతర మంత్రం ఏ విధంగా ఉపాసితవ్యమో, అరవిందుల వ్యాసాలు భారతదేశంలో ఏ విధంగా నవతరాన్ని ప్రబుద్ధం చేశాయో వర్ణితం.

"ఈ జగంబను చక్రము నెవరు త్రిప్పు
దురు? భవాని, యా యమ్మయ దుర్గ కాళి

సృష్టి క_ర్తి, భ్రమణమ్మున దృష్టయామె
యొక్కొక్కప్పుడీ జగతి నొక్కొక్క కళగ (14-7)
"జాలి, త్యాగము, ప్రేమయు, జ్ఞానమగుచు
తత్త దర్శనయును తత్తదవసరముల
యా రమాదేవి యారాధ యా భవాని
శౌర్యజననిగ నిల నేడు శక్తియయ్యె (14-8)

ఇదే బంకించంద్రబాబు దర్శనం కూడా.

పౌరుషంబె జ్ఞాన ఫలమని తెలియుడు, శక్తి హీనమై భక్తియు వృథ, యింధనంబులేనిది జ్వలనంబువోలె (14-16, 17) అని అరవిందుడు దేశీయులను భవానీ మందిర వ్యాస భావ భూమిక ద్వారా ప్రబుద్ధం చేశాడు.

భారతదేశం ఇప్పుడు మహిషాసురమర్దని. ఆదిశక్తి, విశ్వజగజ్జనయిత్రిగా ఆమెను ఉపాసించండి అని ప్రబోధించా డాయన.*

శ్రీ రామకృష్ణ పరమహంస శ్రీ వివేకానందుల భాష్యకారుడిగా అరవింద ఘోష్ భారత జాతీయ చైతన్యాన్ని రాజకీయ రంగంలో రగిలించిన వృత్తాంత మిది.

ఏకైవశక్తిః పరమేశ్వరస్య
భిన్నా చతుర్థా వినియోగకాలే
భోగే భవానీ, పురుషేషు విష్ణుః
కోపేచకాళీ సమరేచదుర్గా — అనే సంప్రదాయాన్ని వందేమాతర

పంచాక్షరిలో నిక్షేపించి జాతీయ పారతంత్ర్యభయ నిర్ముక్త మంత్రంగా బంకింబాబు ఆనందమఠం నవల ద్వారా అందించాడు.

అటు తర్వాత ఖండం ఇంగ్లండ్ ఖండం. ఇందులో కవిగారి వర్ణనాశక్తి పరవళ్ళు తొక్కింది. ఇది పదిహేనో ఖండం. ఇంతవరకు పధ్నాలుగు ఖండాలలో కథాగమనం వేరు. ఆ కథా వస్తువు నిర్వహించడం అప్రతిమ ప్రతిభావంతులకు

* Sri Aurobindo Ghosh declared that Nationalism is a religion that comes from God. P. 18- The Nationalist movement in India and its Leaders- V.D. Mahajan-1962.

కాని సాధ్యంకానిది. ఇంగ్లండు ఖండం వచ్చేసరికి వీరభద్రమూర్తిగారికి ప్రకృతి వర్ణనలు, లోకవృత్త చిత్రణం మొదలైన వాటికి అవకాశం కలిగింది. ముద్ద కట్టిన కవి హృదయం ఆయనది. చెట్లను, జొంపాలను, చిగురుటాకులను, పిట్ట లను, కడలి కెరటాలను, పాల వెన్నెలను, రంగురంగుల పువ్వులను, వివిధాద్భుత చిత్ర విచిత్రమైన పక్షిరుతాలను ఈ ఖండంలో వర్ణించారు వీరభద్రమూర్తిగారు. ఈ ఖండంలో సమస్తమైన ఇంగ్లండుదేశ ప్రకృతి వర్ణనలు, ప్రధాన కథా గమ నాభిముఖంగా నిర్వహించడం లోకోత్తరమైన కవితాశిల్ప చమత్కృతి కాదా ! ఇంగ్లండ్‌లో భారతదేశ స్వాతంత్ర్యోద్యమానికి సానుభూతి సహకారాలు సంపా దించటానికి లజపత్‌రాయ్, గోఖలేలను భారత జాతీయ కాంగ్రెస్ రాయబార మంపింది. అది వ్యాజంగా ఇంగ్లండ్‌దేశపు సమస్త ప్రకృతిశోభను కవి అత్యంత ప్రతిభాపూర్ణంగా వర్ణించారు. ఇటువంటిది తెలుగు సాహిత్యంలో ఇంతవరకు ఎక్కడా కానము.

ఓడ ప్రయాణం వర్ణించారు. అంతలో సూర్యాస్తమయమైంది. వెన్నెల వచ్చింది. ''ఆ మృదులమైన వెన్నెల నల్ల నల్ల, శ్రీ 'బెథోవెను' నాల్గవ 'సింఫనీ'వి, నంబడియె మంద వాయు వశంబునన్ సు, ఖస్వన మేడవ స్వర్గంబు కానబడియె'' (15-18) అని వెన్నెల సౌందర్యాన్ని వర్ణించారు కవిగారు. ఈ ఖండమంతా ఆ వెన్నెల సౌందర్యాన్నే పోలివుంది. ఆ సంగీత సౌభాగ్య సమ్మో హకంగానే వుంది. ఇంగ్లీషు దేశంలో పిట్టలు, పూలు, జలవిహంగాలు, ఋతువులు, పూల జొంపాలు, మహావృక్షాలు, సాంస్కృతిక సౌభాగ్య సౌందర్యాలు హృదయా హ్లాదకరంగా వర్ణించారు. ఆయన గొప్పకవి. ఆపైన కవితా లోకైంద్రజాలికుడు. అటుపైన తొలి పూలకారు యౌవన తారుణ్యంలో పదిహేను, పద్దెనిమిదేళ్ళ వయసున ఇంగ్లండు వెళ్ళి ఆ ప్రకృతి రామణీయకతను, అక్కడి ఇరు సంజల రంగుల వాకిళ్ళను, రంగురంగుల పూలను, పులుగులను, పరమోత్సుకతతో దర్శించి ఆ తరువాత ఈ మహాకావ్యంలో సుమారు అరవై ఏళ్ళ తర్వాత ప్రద ర్శించడం వారి కవితాత్మ ఎంత నిర్భరమైనదో రుజువు చేస్తున్నది. ఇంచుమించు నూరు రకాలుగా పక్షులను, వాటి అందచందాలను, రుతాలను, రంగులను వర్ణిం చారు వీరభద్రమూర్తిగారు. ఇక చెట్లు చేమలను గురించి ఇంగ్లీషువారు కూడా పరవశించే వర్ణనలున్నాయి. అక్కడి రైతులు, గొర్లకాపరులు, వాళ్ళ పండ్లు, పంటలు, వంటలు, ఎంతో భావుకతతో వర్ణించారు ఈ ఖండంలో కవిగారు.

'పులుగు ప్రేమింపని యెడంద పలుగురాయి' అని మనోహర కలకూజితంవంటి సందేశం వినిపించారు కవిగారీ ఖండంలో. అక్కడి దాదాభాయినౌరోజీ, శ్యాంజీ కృష్ణవర్మల గారలవద్ద శెలవు తీసుకొని లజపతిరాయ్, గోఖలేలు భారతదేశానికి తిరుగు ప్రయాణం సమకట్టారు. అప్పుడు శ్యాంజీ కృష్ణవర్మ లజపతిరాయ్ కిచ్చిన సందేశం ముందు ఖండంలోని విప్లవోద్యమ చైతన్య రూపకానికి నాందిలాగా వుంది.

అత్యధిక సంఖ్యాకులను అల్ప సంఖ్యులు పాలించటంవల్లనే సంఖ్యా శబ్దం నపుంసకమైంది కదా అన్నారట కృష్ణవర్మ. ఈ విధంగా సుమారు మూడువేల నూటయాభై పద్యాల ఈ మహాకావ్యంలో, ఆధునికేతిహాసంలో, చమత్కారాలు, రసశేవధికములైన ధ్వనులు ఎన్నో పొదిగారు వీరభద్రమూర్తిగారు.

తర్వాతది బెంగాల్ ఖండం. ఇంగ్లండ్‌నుండి తిరిగివచ్చిన గోఖలేను తిలక్ అభినందించిన సన్నివేశం అత్యంత మనోహరంగా వర్ణితమైంది. సావర్కార్ దేశాభిమానం, సాహసం అటు తర్వాత ప్రసక్తం. ఈ బెంగాల్ ఖండంలో వందేమాతరం ఉద్యమం ఏ విధంగా ప్రారంభమైనదో, పికెటింగులు, హర్తాళులు, స్వదేశీ ప్రబోధం ఏ విధంగా విదేశ వస్తు బహిష్కార, సహాయ నిరాకరణ యోగంగా పరిణమించిందో ఉత్తేజకరంగా వర్ణించారు. జాతీయ విద్యను ప్రోత్సహించే సంస్థలను స్థాపించటం, పత్రికా ప్రచారం చేయటం, అఖిల భారత దేశంలో ఈ చైతన్యం ఏ విధంగా వ్యాపించిందో ఈ ఖండంలో వీరభద్రమూర్తిగారు వర్ణించారు. ఇంతలో కర్జన్ వంగదేశాన్ని విభజించడం అగ్నిలో ఆజ్యం పోసినట్లే అయింది. వందేమాతరం గీతం ఆసేతు హిమాచలం జయ జయభేరీ నినాదధ్వానంగా ఏ విధంగా వ్యాపించిందో ఈ ఖండంలో వర్ణితం. వంగ ప్రజలందరూ నర కేసరులైనారని వర్ణించారు కవిగారు. ఈ వందేమాతరం ఉద్యమం తెలుగుదేశాన్ని ఎంతగా దీప్తిమంతం చేసిందో వీరభద్రమూర్తిగారు భావుక సుందరంగా త్యాగ వీర రస సంభరితంగా వర్ణించారు. "కావ్య జీవమ్ము మషి రసము కాదు, మనీషిరసమ్ముకాని" అని నిరూపించారు.

బెంగాల్ ఖండం తరువాతది ఉద్యమ ఖండం. వంగదేశ విభజనను ఉపసంహరింపచేయటానికి ఆ తరువాత దేశంలో సాగిన ఉద్యమాన్ని సాంగంగా వర్ణించిన ఘట్టమిది. అనుశీలన సమితి కార్యకలాపాలను ఒక్క ముక్కలో

చెప్పారు. హరింద్రనాథఘోషు మాటల్లో కవిగారు. 'చెరుకుపిండిన బెల్లము చేయవచ్చు, ప్రభుత చెండిన రాజ్యము పడయవచ్చు.'

చివరి ఖండం స్వరాజ్య ఖండం. కాశీనగరంలో 1905 వ సంవత్సరంలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహా సభ తీర్మానాలతో ఈ ఖండం ముగుస్తున్నది. ఈ సభకు గోపాలకృష్ణ గోఖలే అధ్యక్షత వహించారు. ఈ సభలో అతివాదుల కన్నా వాడిగావేడిగా తెల్లవారి ప్రభుత్వాన్ని హెచ్చరించారు గోఖలే మహాశయుడు. ఈ ఖండంలో తిలక్ మహాశయుని గూర్చిన వర్ణన కవిగారి పలుకు పసందును సహస్రముఖాల అభివ్యక్తం చేస్తున్నది.

మొత్తంమీద తెలుగు సాహిత్యంలో ఈ శతాబ్దంలో వెలువడిన, వెలువడ నున్న మహాకావ్యాలలో భారతీయ చరిత్రాత్మకమైన వాటిలో నిస్తుల ప్రశస్తమైన స్థానమున్నది ఈ వందేమాతరం మహాకావ్యానికి. శిల్పందృష్ట్యా, కవితాత్మదృష్ట్యా ఆధునికసాహిత్యం ప్రభవించిన అనర్ఘ రత్నాలలో చాలా విలువైన కావ్యం ఇది.

వందేమాతరం మహాకావ్యానికి ఇంకెన్నో విశిష్టతలున్నాయి.

అనల్పకవితా శిల్పమర్మజ్ఞుడైన మహాకవి ఆధునికతాస్ఫూర్తిని, మౌలిక మైన ప్రతిభను తన సృజనశక్తికి వాహికలుగా చేసుకొంటాడు. ఆ నాటి కాలం, సామాజిక చైతన్యం, సాముదాయిక సంస్కారం, నాటి కవితాధోరణులు, తన కవితలో ప్రతిఫలింపచేసుకొంటాడు. తిక్కనగారి తర్వాత మళ్ళీ అంత ప్రతిభ గల ఉభయ కవి మిత్రుడీయనేమో ననిపిస్తున్నది. ఇంత కండగల, కమ్మని, కవిత్వం రాసినీ్న వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో మహాకవి ప్రథితములైన మార్గాలన్నీ స్వాయత్తం చేసుకొని వుండి కూడా, హృదయింగమంగా ప్రస్తావన కూర్చారు వచనకవితలో శ్రీ వీరభద్రమూర్తిగారు. నేటి వచన కవులకు సమ వుజ్జీగా, ఇంకా వాళ్ళను మించి పోతూనూ ఆ వచన గీతికను రాయడం, వీర భద్రమూర్తిగారి భవ్యకవితావేశంతోపాటు, నవ్యకవితా పథప్రీతిని కూడా వ్యక్తం చేస్తున్నది.

కవిగారు గొప్ప మాటకారి. పరిహాస ప్రియులు. పీఠికలో ఆ మాట తామే ప్రస్తావించుకున్నారు కూడా. ఊహలో నిత్యతారుణ్య స్ఫూర్తి శ్రీ వీర భద్రమూర్తి. కుమార సంభవ ఖండంలో "కంతూ నేనిప్పుడు ద్రుహిణసభకు అత్యంత త్వరితంగా పోవాలని హస్త స్పర్శాంతంగా వీడుకొన్నాడుట." అంటే షేక్ హాండ్ పురస్సరంగా వీడుకోలిపాడు. అటుతరవాత తుహినగిరి కన్య

తపస్సుకి తట్టుకోలేక శివుడు మాయావటువై "పచ్చితోలు కావిపోడి వలువగ గూడకట్టుకట్టి" (3-156) వచ్చాడుట. ఈ గూడకట్టు షోకిల్లాతనం వీర భద్రమూర్తిగారి ఆధునికతను, హాస్యప్రియతను చాటటం లేదా! ఏ కొంచెం సందర్భం వచ్చినా శ్రీ వీరభద్రమూర్తిగారు పరిహాస కుశలతను చూపుతూనే ఉంటారు. శివుడు అమ్మవారితో చేసిన అధిక ప్రసంగమంతా చాలా నవ్వు పుట్టించేట్లుగానే తీర్చారు. ఇంగ్లాండు ఖండములో కవిగారు చూపిన లోకజ్ఞత మెచ్చదగింది.

"వెండి రూపాయికే పదకొండణాల
కన్న విలువలేదిప్పుడు కాగితమ్ము
రూప్యగౌరవమొందె నిర్గుణము, సగుణ
మైన తీరునకునిది యుదాహృతంబు" (13-22)

ఎంతటి పరిహాస భాసురమైన మర్మస్పృక్కు ఈ వర్ణన.

"పిచ్చివారి వైద్యాలయాల్ పెచ్చుమెరుగు
స్వార్థపరులున్న శాసన సభలకన్న
చెడిన యెద మనసును బాగుజేయు నవ్వి
బాగుపడిన మనసును బాధ పరచునివ్వి" (18-116)

ఒక వైపు కశాఘాతంతోనే ఇంకొకవైపు బాధా వైక్లబ్యంతో కూడిన నవ్వును కూడా సృష్టింపచేస్తున్నారు కవిగారు.

ఈయన ముదిగొండ వంశపు కరీరము. అందుకనే మంచి ముత్యాల పంట. కవితలో షడక్షరిదయగలడు. కాబట్టి సర్వశివంకరమైన కవిత కూర్చినాడు.

మనస్వి కోకిలారామము. దీనికి సాక్షి వందేమాతరము,

"అన్ని రసములకును నాధారరూపయ
య్యష్టమూర్తి వధువు నభినుతింతు"

అన్నారు అవతారికలో.

కళానిధిః, కావ్యకళా, రసజ్ఞా, రసశేవధిః అని తల్లి వినుతి.

ఈ కావ్యం చదవండి. అమ్మ ఈ కవిని అంకమున జేర్చిన వైనం తెలుస్తుంది. శారదనీరదేందు ఘనసారదరహాస ఆరాధనలో మ్రోయు ఘంటకు నాల్కనాదు నాల్క అని కవిగారన్నారు. ఈ కావ్యం చదివిచూడండి. సరస్వతి ప్రసన్నమవుతుంది.

# అనుబంధం

## నోట్స్

"1887 నాటికి వెయ్యి మంది ఐ.సి.ఎస్. ఉద్యోగులలో భారతీయుల సంఖ్య 12 మాత్రమే."

"బంకించంద్రుని వంటి వాడు 18 సంవత్సరాలకాలం డిప్యూటీ కలెక్టర్‌గా ఉండి పెన్షన్ పుచ్చుకోవలసివచ్చింది. అంతకంటే పై ఉద్యోగం అలాంటివారికి కూడా కరువైంది." —పుట 25

1876 లో పోటీ పరీక్షలో పాల్గొనే అభ్యర్థుల వయస్సును 21 నుండి 19 కి తగ్గించారు. అంతటి తక్కువ వయస్సులో భారతదేశంలో ఉన్నతవిద్యను పూర్తిచేసుకొని లండన్‌కు వెళ్ళి పోటీ పరీక్షలో పాల్గొనడం సాధ్యంకాకపోయింది. పుట 29.

1885 లో భారత జాతీయ కాంగ్రెసు నిర్మాణం జరిగిన తర్వాత దాని సాంవత్సరిక సమావేశాలలో ఈ విషయాన్ని గురించి తీర్మానాలు చేయడం మామూలైంది. వీటి ఫలితంగా పోటీ పరీక్షలలో పాల్గొనే విద్యార్థుల వయస్సు 1891 లో 21 కి పెంచబడింది. పుట 30.

1862 లో తపాలాఫీసుల ద్వారా నాలుగు కోట్ల డెబ్బై లక్షల ఉత్తరాలు, వార్తాపత్రికలు, పార్సెలులు బట్వాడా కాగా, 1905–06 నాటికి ఈ సంఖ్య సుమారు 65 కోట్లకు పెరిగింది. పుట 54.

నౌకాయానం సులభం కావడంచేత బరువైన ముడి సరుకులను కూడా చౌకగా బ్రిటన్‌కు ఇతర దేశాలకు ఎగుమతి చేయడమూ, బ్రిటన్ నుండి మరింత చౌకగా వాడకం వస్తువులను భారతదేశానికి దిగుమతి చేయడమూ సులభసాధ్యమైంది.

1878–79 లో 61 కోట్ల రూపాయల విలువగల సరుకులు ఎగుమతికాగా 1906–07 నాటికి వీటి విలువ 177 కోట్లకు పెరిగింది. ఇదే విధంగా దిగుమతుల విలువ 1861-62 లో 22 కోట్లుకాగా, 1906–07 నాటికి 127 కోట్లకు పెరిగింది.

ఆనాటి విదేశ వ్యాపారం ఇంకొక విధంగా కూడా భారతదేశానికి నష్టం కలిగించింది. బ్రిటన్ నుండి భారతదేశానికి దిగుమతి అయిన సరకుల విలువ కంటే భారతదేశం నుండి బ్రిటన్‌కు ఎగుమతి అవుతూవచ్చిన సరకుల విలువ ఎక్కువగా ఉండేది.

ఈ రెండు విలువల మధ్య 1890–91 వరకు సుమారు 18 కోట్ల రూపాయల భేదం ఉండేది. అంటే మనం ఏటేటా 18 కోట్ల రూపాయల విలువ గల సరకులను ఏలాటి ప్రతిఫలాన్ని పొందక బ్రిటన్‌కు ఉచితంగా పంపవలసిన వారమయ్యాము. 1903–04 నాటికి ఈ మొత్తం 37 కోట్లకు పెరిగింది. దీనినే ఆనాటి అర్థశాస్త్రవేత్తలు దాదాభాయి నౌరోజీ, రమేశ్‌చంద్రదత్తు మొదలైనవారు డ్రెయిన్ (Drain) అని చెప్పేవారు. ఇది ఒక విధంగా భారతదేశం బ్రిటన్‌కు చెల్లించే కప్పమని చెప్పవచ్చు. పుట 55

బ్రిటిష్‌వారు భారతదేశాన్నేకాక కెనడా, ఆస్ట్రేలియా మొదలైన దేశాలను కూడా ఆ కాలంలో పాలిస్తూ ఉండేవారు. కాని వాటి పాలనకై బ్రిటిష్‌వారు చేసిన ఖర్చులను బ్రిటిష్ ప్రభుత్వమే వహించేది. ఒక భారతదేశ విషయంలోనే వాటిని భారతీయులు భరించవలసిన వారయ్యారు. ఇందులోని అన్యాయాన్ని, అధర్మాన్ని వారు గుర్తించకపోవడం ఒక విపరీతమని చెప్పడం తప్పదు. ఈ విధంగా 19 వ శతాబ్దంలో ప్రతిఫలరహితంగా భారతదేశం నుండి బ్రిటన్‌కు చేరిన ధనం రూ. 6,080,172,021 లు అని అంచనా వేయబడింది. యంత్ర సహాయాన ఫ్యాక్టరీ, పరిశ్రమలను నడుపుటకు కావలసిన పెట్టుబడి ధనంలో చాలా భాగం బ్రిటిష్‌వారు ఈ విధంగా సంపాదించారు. పుట 56

స్వదేశీ ఉద్యమాన్ని మహారాష్ట్రంలో గణేశవాసు దేవజోషి 1872 ప్రాంతాన ప్రారంభించి పటిష్ఠంగా నడిపాడు. ప్రజలందరూ సాధ్యమైనంత వరకు విదేశ వస్తువులను వాడవలసిందిగా ప్రచారం చేశాడు. దీనిచే ప్రభావితులైన వారిలో కొందరు ఏ పరిస్థితులలో కూడా తాము విదేశ వస్తువులను వాడమని శపథం చేశారు. పుట 57.

1830 నాటికి కలకత్తాలో మూడు బెంగాలీ దిన పత్రికలు, పదమూడు ఇంగ్లీషు పత్రికలు ఉండినవి. దేశంలో వార్తాపత్రికల సంఖ్య 1857 నాటికి నూటికి మించింది. 1876 నాటికి బొంబాయి రాష్ట్రంలో మరాటి, గుజరాతి, హిందూస్థానీ, పారశీక భాషలలో 62, ఈనాటి ఉత్తరప్రదేశ్‌లోను మధ్యప్రదేశ్

లోను 60, బెంగాలులో 28, మద్రాసులో 19 దేశీయ పత్రికలున్నట్లు అంచనా సుమారు లక్షమంది వాటికి చందాదారులుగా ఉండిరి. కాని వాటిని చదివేవారి సంఖ్య ఇంతకంటె ఎక్కువగా ఉండెను– పుట 127:

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర– రెండవభాగము :
కీ.శే. శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య (1976).

అప్పటికి మంచి నిర్మాణబలము లేకపోయినప్పటికినీ ఆ రోజులలోనే 1870 ప్రాంతములకే ప్రజాజీవితమంటే ఏమిటో ప్రభుత్వమునకు తెలిసి వస్తూన్న సంగతి పాఠకులు గ్రహింతురుగాక! ఆనాటికే పత్రికా ప్రచార మెక్కువగా నుండెను. 1875 లో 475 పత్రికలు ప్రకటింపబడుచుండెను. వాటిలో చాలాభాగము దేశభాషా పత్రికలే– పుట 9 – భోగరాజు పట్టాభి సీతా రామయ్యగారి– కాంగ్రెసు చరిత్ర : తెలుగు అనువాదం : కీ. శే. కొడాలి ఆంజ నేయులు–1935

*

"ఇంగ్లండులో భారతదేశమునుండి ఎగుమతి యగు నూలుబట్టలపైనను, ఇతర చేతిపనుల నుండి యుత్పత్తి యగు వస్తువులపైనను నూటికి 80 వంతులు సుంకము విధించుచుండిరి."

*

"పట్టణములందు నూరుమందిగాని, అంతకెక్కువ మందిగాని పారిశ్రామికులు శిల్పులు చేరి చిన్న చిన్న కర్మాగారములందు సమిష్టిగా కృషి చేయుచు సరకు లుత్పత్తి చేయుచుండిరి. ఈ సరకుల వలన తమ కమితలాభములు వచ్చు చున్నందున కుంఫిణీవారు ఈ పరిశ్రమలను ప్రోత్సహించిరి. ఈ సరకుల విలువ వెండి బంగారులలోనే దేశములోనికి వచ్చుచుండెను. మనవారు బంగారు తప్ప విదేశ వస్తువులు మార్పిడిగా పుచ్చుకొనువారు కారు. ఆనాడు మన దేశములోని వస్త్ర నిర్మాణ పరిశ్రమ కొన్నాళ్ళవరకు ఇంగ్లీషు యంత్రముల పోటీలేకుండా ప్రతిఘటింప గలిగెను."

*

ఇంగ్లీషు కుంఫిణీ పరిపాలన స్థాపింపబడగానే గవర్నరు జనరలుగ నియమింపబడిన కారన్‌వాలిసు ప్రభువు చేసిన ఘనకార్యములలో మొదటిది వంగ రాష్ట్రపు రయతులను జమీందారుల చేతులలోని కప్పగించిన శాశ్వత

భూమి ఫైసలా పద్ధతి యొకటి. గ్రామ కట్టుబాటులను నాశనముచేసి దేశమును జిల్లాలుగా విభజించి పన్నుల వసూలును న్యాయవిచారణను చేయుటకు ఇంగ్లీషు కలెక్టర్లను జడ్జీలను నియమించుచు చేసిన క్రొత్త నిబంధన యొకటి. ఇది 1793 లో జరిగెను. భారతదేశ ప్రభుత్వమునందు నాడు మొదలు క్రొత్త పద్ధతి ప్రారంభమై దేశపరిస్థితులు తారుమారగుటకు కారణమైనదని నిస్సందేహముగ జెప్పవచ్చును. *

"కేవలము వర్తకమువలన లాభములు సంపాదించుటకే ఈ దేశమునకు వచ్చిన ఈ విదేశీయ కుంఫిణీ పరిపాలకులు, ఈ దేశములో వసూలు చేసిన సుంకములు పన్నులు శిస్తులు వర్తకమువలన సంపాదించిన లాభములతో పాటు ఇంగ్లండులో నున్న కుంఫిణీ డైరెక్టర్లకు రవాణా చేయవలసి యున్నందువ ప్రజాసౌకర్యముల కొరకుగాని ప్రజల వ్యవసాయ పరిశ్రమల యభివృద్ధి కొరకు గాని విద్యాభివృద్ధికొరకుగాని ఎట్టి సొమ్మును వ్యయము చేయకుండిరి." "ఇంగ్లీషు దొరతనము యొక్క ప్రత్యక్ష ఫలితములు-" శ్రీ దిగవల్లి వేంకటశివరావు, ఆంధ్రపత్రిక 11-6-1941. *

"స్వతంత్ర జీవనము-విశేష సంఖ్యగల మహారాష్ట్రులు దొరతనము వారియొద్ద కొలువు కుదరక, స్వచ్ఛందమై జీవనమును జేయుటకు నిశ్చయించుకొని, అందునకై పునహా పట్టణము నొక సమాజమును స్థాపించిరి. ఆ సంఘము వారి యుద్దేశము దేశముయొక్క భాగ్యమును వృద్ధి జేయుటయు, పాటుపడుటను వర్తకమును ప్రోత్సాహము చేయుటయు. ఇట్టి సమాజములు తక్కిన స్థలములలో గూడ స్థాపింపబడి జనులందరు నైకమత్యము గలిగి పాటుపడిన శీఘ్రకాలము లోపలనే జనులయొక్కయు దేశము యొక్కయు స్థితి మంచిదశకు రావచ్చును- వివేకవర్ధని సం. 1 సం. 5, 18˘5 ఫిబ్రవరి. *

గాయకవారు - గాయకవారు గారి సంస్థానములో రెసిడెంటుగా నున్న కర్నల్ ఫేర్ (Col. l hyre) దొరగారికి విషము పెట్టు నిమిత్తము జరిగిన ప్రయత్నములో మహారాజా రు (His highness the Maharaj.h Mulhar Rac) చేరి యున్నారని తెలిసి, కలకత్తాలో నుండు రాజ ప్రతినిధిగారు (Viceroy) వారిని కావలిలో నుండ నియమించి, వారి సర్వస్వమును స్వాధీనము చేసికొని వారిమీద మోపబడిన నేరమును విమర్శించుటకు ఆరుగురను కమీషన్‌గా నిర్ణయించిరి. అందులో ముగ్గురు యూరోపి

యనులు, తక్కిన ముప్వురును స్వదేశస్థులు సింధియా మహారాజాగారు, జయపూరు మహారాజాగారు, సర్ డింకరు రావుగారు. గాయకు వారి పక్షమున వాదము చేయు కొరకు ఇంగ్లాండు నుండి ప్రసిద్ధుడైన యొక బారిస్టరు (Serjeant Ballontine) రావింపబడెను. వారి రాజధానియగు బరోడా పట్టణమందే విచారణ జరిగి ముగింపబడినది ......

కమీషన్‌లో చేరినవారు గవర్నరు జనరల్గారికి తమ రిపోర్టును వ్రాసి పంపియున్నారు. ఆయన ఈ విషయమై సెక్రటరీ ఆఫ్ స్టేటుగారి యభిప్రాయము నడిగినట్టు తెలియవచ్చుచున్నది. పయి కమీషన్‌లో చేరిన ఆరుగురిలో నలుగురు గాయక వారుగారిని దోషినిగా నిరూపించుటకు సాక్ష్యము చాలదనియు, ఇద్దరు చాలుననియు వ్రాసినట్టు వినికి - వివేకవర్థని సం. 1 సం. 6, 1875 మార్చి.

''దేశమెల్లను బాడయ్యె దేవిడీలు
పేరు మాత్రమెకాని విద్యా రమతును
విధవ భావంబు సమకూరె వ్రేటువడియె
రూఢిగా హిందు దేశపు ప్రొద్దు గుంకె
శాస్త్రములు పుస్తకంబుల శరణు పొందె
దుష్ట జనులెల్ల నుద్యోగ ధుర్యులైరి
లంచములు మించె చేటు కాలంబు వచ్చె
నయ్యె దేశంబు తానధమాధమంబు -

(శ్రీ) వావిలాల వాసుదేవశాస్త్రి - An address in Telugu metre to H.R. The Prince of wales.

* వివేకవర్ధని సం. 2, సం. 9-1876 మే.

''మిస్టర్ గ్లాడ్ స్టోనుగారు 84 ఏండ్ల వారు అయినందునను ఐర్లండుకు ప్రత్యేకమైన పార్లమెంటు నిచ్చుటకు ఆయన చేసిన కృషిని లిబరల్ పార్టీలోని విరుద్ధాభిప్రాయము గలవారు కక్షగట్టి భంగపరిచి నందునను, ఆయనగారి కండ్లు కనపడక పోవడము, చెవులు వినపడక పోవటము సంభవించినందునను, యునైటెడ్ కింగుడంను యొక్క ప్రధాన మంత్రి పనిని మానుకొన్నారు. ఈయనగారితో సమానమైన విద్యాబుద్ధి కుశలతలు గలవారు యునైటెడ్ కింగుడంసులో మరియొకరు లేరు. రాజ్య తంత్రము బాగుగా తెలిసినవారు. జన

క్షేమము మీదనే దృష్టిగలవారు. పరమేశ్వరుడు దీర్ఘాయుస్సు, దీర్ఘారోగ్యము, ఇచ్చి రక్షించునుగాక! మిస్టర్ గ్లాడ్ స్టోన్‌గారికి బదులు ప్రధాన మంత్రి పదవిలో మార్క్వెస్ ఆఫ్ రోజ్‌బరీగారు అమరినారు-యెరల్ అఫ్ కింబర్లిగారు ఫారిన్ సెక్రెటరిగాను, మిస్టర్ ఫౌలర్‌గారు ఇండియా సెక్రెటరిగాను, లార్డురియే గారు ఇండియా అండర్ సెక్రెటరిగాను యేర్పడినారు. సం. 9 సం. 8, 1894 మార్చి- హిందూ జనసంస్కారిణి.

*

"డాక్టరు హంటరు దొరగారు సూచించిన ప్రకారము మన పురోభివృద్ధి కడ్డముగా మూడు వుపద్రవములున్నవి. అందులో మొదటిది బ్రిటిషు గవర్నమెంటు వారు వెనుకముందర చూడకుండా జొరాకరిగా చేసే అపరిమితవు ఖర్చు. రెండవదేమనగా హిందువుల పయిని తమ సీతిమతోద్దేశములను స్థాపింప ప్రయత్నించుట. మూడవది హిందువులను ఐరోపియన్‌లు చూచి సహించలేక పోవడమున్ను గొప్ప హిందువులను యనాదరణ చేయుటయున్ను అయియున్నది. సం. 9, సం. 12. 1894 జూలై, హిందూ జనసంస్కారిణి.

*

"రాజ్య భారకులు అన్యదేశస్థులగుట చేత పాపభీతితో వారు చేసిన చట్టములు దుర్మార్గుల కనువుపడినట్లు సన్మార్గుల కుపయోగము అగుటలేదు. ఇంగ్లీషు గవరన్మెంటు వారు దుర్మార్గులను సన్మార్గులను కనుగొని చక్కగ సన్మార్గుల కనుకూలముగను, దుర్మార్గులకు భయంకరముగను చట్టములు చేయలేక ఇండియాలో దుర్మార్గులను హెచ్చించుచున్నారు...

*

బంగాళా సివిలియన్ బాబూ రోమేష్‌చందర్‌దత్తుగారిని ఒరిసా కమీషనర్‌గాను, కటకము దగ్గర పన్ను కట్టెకి మహల్సుకు సూపరింటెండెంటుగాను ఈ గొప్ప యుద్యోగమిచ్చుట ఇండియా గవరన్మెంటు వారు ఏర్పరచినారు, నేటి వునకిదే మొదలట.

హిందూ జన సంస్కారిణి సం. 11 సం. 8 1895 అక్టోబరు.

1894-95 వ అఫీషియల్ సంవత్సరమున హిందూదేశము నుండి రూ. 4974094 లు వెలగల 689870 ఔన్సుల బంగారు ఇతర దేశముల కెగుమతి చేయబడినది.

27040022 ఔన్సుల తూనికయును రు. 63293296 ల వెలయును గల వెండియును మన దేశమునకు దిగుమతి యయినది.

అక్టోబరు 1895 - హిం. జ. సం. సం. 11 సం. 3.

ఇండియాలోని ప్రజలు స్వతంత్ర పరిపాలనకు అర్హులు కానప్పుడు వారల మీద పన్నులు తెచ్చివేసి యెలెక్షన్ తెచ్చిపెట్టి బుద్ధిలేని కక్షలకు ఎడము కలిగించినారు గాని అన్యము కానుపించటలేదు-ఇండియాలోని ప్రజలకు నెమ్మది, సౌఖ్యము ముఖ్యముగ చూడక, యురోపులోని పద్ధతులను ఇండియా మీద తెచ్చిపెట్టి నిందాపాత్రులగుచున్నారు- ఇండియన్ నేషనల్ కాంగ్రెసునకు ప్రసిడెంటుగ ఈ తూరి బాబు సురేంద్రనాథ బానర్జీగారు ఏర్పరుపబడ్డారు- స్వామి వివేకానందముగారు అమెరికాలో అనేకులను హిందూమతము మీద శ్రద్ధ కలవారినిగా జేసి యిప్పుడు ఇంగ్లెడులో మిస్టరు టి. స్టర్డి, అద్వైతి యింట దిగియున్నారు.

గవర్నరు జనరలులు, గవర్నరులు దేశసంచారము చేయుట పేరు పెట్టుకొని, ప్రజలకు పెక్కు ఖర్చులు తగిలించుచున్నారు. ఇంగ్లీషువారి పనులకు డబ్బు ఖర్చులేదు- ఇండియనులకు అన్ని పనులకును డబ్బు ఖర్చుపడిననేగాని యేదియు జరగదు.

హిం. జ. సం. సం. 11 సం. 4–1895 నవంబరు.

ఇండియాలో వానలు కురియుచుంటే పంటలు పండుచున్నవి. వానలు లేకుంటే కూటికి గుడ్డకు కరువు వచ్చుచున్నది- కరువు రాగానే జనము చచ్చిపోవుచున్నారు- రాజ్య పరిపాలకులు కాపుల దగ్గర కష్టకాలము కొరకని ఒక దమ్మిడి యయినను నిలువపడనియ్యక పన్నుల పేరు పెట్టి లాగివేయుచున్నారు-దేవునికిని, గవరన్మెంటుకును, మంచి బుద్ధి యున్నట్టు తోచడము లేదు- మంచి ప్రజలు గల మంచి దేశము మంచి గవరన్మెంటు లేక పోవడము చేత కూటికి గుడ్డకు లేనిదగుచున్నది. చదువు సంధ్య అక్కరలేని పోలీసు సర్వే, సెటిల్‌మెంటు, వుద్యోగాలకు యురోపియనులను ఇంగ్లెండు నుంచి తేవడములో, ఇంగ్లీషువారి కుండెడి అల్పబుద్ధికి, అనేకులు వ్యసనమును పొందుచున్నారు.

మిస్టర్ గంధీని సౌత్‌ఆఫ్రికన్ కాలొనీలవారు చావమొత్తినారు. ఇప్పుడు ఇంగ్లెండులో రాజ్య పరిపాలనా కార్యములను జరిపెడి కన్సర్వేటివు గవరన్మెంటు నపుంసకత్వము కలదని తోచునట్లు పనులు చేయుచున్నారు.

గవరన్మెంటువారి రాజ్య పరిపాలనా పద్ధతులు చక్కనివి కావని వారి యురోపియన్ వుద్యోగస్తులే మొరపెట్టుచున్నారు-వీరు వుద్యోగాలు విడిచి పెట్ట గానే ప్రజలతో కలిసి పనిచేయుచున్నారు. గవరన్మెంటు వారెందుకు ఇంత వెగ టుగా యింత పట్టుదల చూపుచున్నారో! దుఃఖకరము-సం 12 సం. 7 1897 ఫిబ్రవరి. హిం. జ. సం.

ఇండియాను యేలు వారందరును నవుకరీలేగనుక వీరు పైయధికారుల మెప్పు పొంది పై యుద్యోగములను పొందవలెనని పన్నులు హెచ్చించి ప్రజలను బాధించి వసూలు చేసి, ప్రజాక్షేమమును చూడకున్నారని ప్రజలను కొనుచున్నారు. సం. 15, సం. 10 హిందూ జన సంస్కారిణి, 1900మే.

*

"మనము సవారీ మోయుటకే గాని యెక్కుటకు దగమది నిశ్చయము. మన సురేంద్రనాథ బెనర్జీగారు గావుకేకలు వేసి యింగ్లిషు మాట్లాడుట, మన గోఖలే గారింగ్లడు చేరి తద్దినములు జరిపించుటకు మనము పొంగుటయే కాని పులి దాసరికి పెట్టదనునట్లు మనలను దయతో సమానముగ నెన్నడు ఇంగ్లీషు వారు చూడ నొల్లరు.

స్వరాజ్య మబ్బినగాని మనకు బౌరుషజ్ఞాన కీర్తులు కలుగనేరవు. శిరస్సు లేని మొండెము నత్యంగన మొనర్చినట్లు స్వాతంత్ర్యము లేని దేశమున సోషల్ కాన్ఫరెన్సేల ?.........

వ్యవసాయ మభివృద్ధి చేసికొని పంటలు పండించుకొనుచుంటయు, వర్తక మభివద్ధి చేసుకొనుటయు నీ రెండుమార్గములే మన దేశమునకు దగిన పనులు-పుట 219-అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు స్వీయ చరిత్ర 'నా ఎరుక' 1976.





# YUVABHARATHI

greatfully acknowledges the financial assistance extended by

**THE ASHOK KUMAR SANGHI CHARITABLE TRUST HYDERABAD**

*for*

the 'ITIHASALAHARI' programme, 1982



Ashok Kumar Sanghi Charitable Trust, started in 1970, runs Gopilal Murlidhar Sanghi College of Commerce, Hyderabad.



Ashok Kumar Sanghi Charitable Trust .

* gives scholarships/book etc., for post-matric education;
* encourages self employment of physically handicapped persons through interest free loans;
* assists deserving projects/institutions/persons in the field of education, literature and medicine.

* Started on 1st October, 1982, the 34th Birthday of its Founder at Mehdipatnam "Ashok Kumar Sanghi Memorial Polyclinic-Cum-Diagnostic Centre"

The trust has at its disposal a lakh of rupees per year for rendering assistance. Suggestions are requested.

Please write to:

G. L. Sanghi,
Managing Trustee of the Trust,
1-8-582, Industrial Area, Azamabad, Hyderabad-20.
PHONE : 62680

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd-20.